# మహిళా మాణిక్యాలు

వ్యాససంపుటి

గబ్బిట దుర్గాప్రసాద్

ప్రచురణ:

సరసభారతి

ఉయ్యూరు, కృష్ణాజిల్లా

**Mahilaa Maanikyalu**

by **Gabbita Durga Prasad**

First Edition: **March 2014**

Copies: 1000



Price. Rs.**100/-**

Cover Design: **Kalasagar**

Dtp: **Ramya bharathi, Vijayawada**

For Copies:-

**Gabbita Durga Prasad**
President, "Sarasabharathi"
H.No.2-405, Sivalayam Street,
Near Raja gari kota, Vuyyuru- 521 165
Krishna Dist. Phone:08676- 232797
Cell: 9989066375
e-mail: gabbita.prasad@gmail.com
sarasabharati.vuyyuru@gmail.com
http/sarasabharati.wordpress.com
http/suvarchalanjaneyaswamy.wordpress.com

Printed : **Sree Ram Offset Printers,** vijayawada-2

## అంకితం



మహిళా మాణిక్యమైన అర్ధాంగి

**సౌ॥ శ్రీమతి మైనేని సత్యవతి గారికి...**

**"మహిళా మాణిక్యాలు"** అనే ఈ యాభై ఎపిసోడులను అంతర్జాలంలో రాసి, ఈ పుస్తకాన్ని సరసభారతి తరపున ముద్రించబోతున్నామని ఉత్సాహవంతులైన స్పాన్సర్‌లు ఉంటే స్పందించమని అంతర్జాలంలో సాహితీ బంధువులకు విన్నవించాను. అంతే కొన్ని గంటల్లోనే అదేరోజు సాయంత్రం అమెరికా నుండి నాకు ఆత్మీయులు, సరసభారతి ప్రోత్సాహకులు శ్రీ మైనేని

గోపాలకృష్ణగారు ఫోన్ చేసి 'ఎవరికీ ఆ అవకాశం ఇవ్వవద్దు. ఎంత ఖర్చు అయినా నేనే పెట్టుకొని ఆ పుస్తకాన్ని ముద్రించటానికి తోడ్పడతాను. "నా మనసులో ఎప్పటి నుంచో మా శ్రీమతి సత్యవతికి ఒక పుస్తకం అంకితమివ్వాలని ఉంది. ఆ కోరిక ఇంతవరకు తీరలేదు. ఇప్పుడు మీ ద్వారా ఆ అవకాశం వచ్చింది. కనుక సత్యవతికి అంకితమిచ్చి పుస్తకం ముద్రించటానికి అభ్యంతరం ఉందా?" అని అడిగారు. "నాకు మహదానందంగా ఉంది. తప్పక మీ మనసులోని కోరిక తీరుద్దాం" అన్నాను. ఆయన సంతోషించి "ఈ విషయం చాలా సీక్రెట్‌గా ఉంచుదాం. సత్యవతికి సర్ప్రైజ్ ఇద్దాం" అన్నారు. సరేనన్నాను. అంతే ఆ సాయంత్రానికే నాకు "వెస్టెన్ మనిట్రాన్స్‌ఫర్" ద్వారా పుస్తక ముద్రణకు అవసరమైన డబ్బును పంపారు. మర్నాడు ఉదయమే నేను పోస్ట్ ఆఫీస్ నుంచి తీసుకొన్నాను. అదీ మైనేని వారి స్పీడు. 2012 జూన్లో వారి ఆహ్వానంపై అమెరికాలో నార్త్ కరోలినా షార్లెట్‌లో మా అమ్మాయి చి.సౌ.విజయలక్ష్మి అవధాని దంపతుల ఇంటి నుంచి గోపాలకృష్ణగారున్న అలబామాలోని హాంట్స్ విల్‌కు వెళ్లాను. రెండు రోజులు వారి అతిథిగా ఉన్నాను. వారూ వారి సతీమణి శ్రీమతి సత్యవతిగారు చూపిన ఆదరణ, ఆతిధ్యం మరువలేనివి. వారి అబ్బాయి కృష్ణ కుటుంబం చూపిన ఆత్మీయత కూడా అలానే ఉంది. అక్కడి మిత్రులందరికీ నన్ను పరిచయం చేశారు. అలబామా తెలుగు అసోసియేషన్‌తో నాకు అంటే సరసభారతికి సన్మానం చేశారు. ఈ పుస్తక ముద్రణకు పూర్తి ఆర్థిక సహాయం అందించిన శ్రీ గోపాలకృష్ణగారికి సరసభారతి మనస్ఫూర్తిగా కృతజ్ఞతలును అందజేస్తోంది. ఇలాంటి వితరణ శీలుర తోడ్పాటు వల్లనే ఇప్పటికి పన్నెండు పుస్తకాలను ముద్రించగలిగామని సవినయంగా మనవి చేస్తున్నాము.



# శ్రీమతి మైనేని సత్యవతి పరిచయం

సత్యవతిగారు గోపాలకృష్ణగారికి అసలైన జీవిత సహధర్మచారిణి. స్వయం సిద్ధ. అర్ధాంగి అనే మాటకు అసలైన నిర్వచనం ఆమె. మైనేని భాషలో "అలుపెరుగని అర్ధాంగి". గుంటూరు జిల్లా రేపల్లె తాలూకా నల్లూరు గ్రామంలో సత్యవతిగారు పరుచూరి భావనారాయణ చౌదరి, రత్న మాణిక్యం దంపతులకు 1940 జూన్ ఒకటవ తేదీన ఏడవ సంతానంగా జన్మించారు. ఆమె సోదరి శ్రీమతి విమలాదేవి అమెరికాలో ఉంటున్నారు. సోదరులు శ్రీ స్వర్గీయ సుదర్శనరావు (ఆర్మీ ఇంజనీర్), కీ.శే.శ్రీరామ క్రిష్ణయ్య (ఎం.ఏ, పి.హెచ్.డి), కీ.శే.శ్రీ బాబూ రాజేంద్ర ప్రసాద్ (రీజినల్ ఇన్స్పెక్టర్ - ఎన్విరాన్‌మెంటల్ ప్రొటెక్షన్ ఏజెన్సీ)లు అమెరికాలో ఉన్నతోద్యోగాలులో స్థిరపడి స్వర్గస్తులయ్యారు. సోదరుడు శ్రీ మధుసూదనరావు ప్రొఫెసర్‌గా అమెరికాలో ఉంటున్నారు. మరొక సోదరుడు శ్రీ శ్రీనాధ వరప్రసాద రావు అమెరికాలో చికాగోలోని "యూనివర్సిటి ప్రింటింగ్ అండ్ యునిక్ ప్రింటింగ్" సంస్థలో మేనేజర్‌గా పనిచేసి రిటైర్ అయిఉన్నారు. సోదరుడు స్వర్గీయ శ్రీ శివాజీ

రావుగారు స్వగ్రామం నల్లూరులో వ్యవసాయంతోనే జీవిస్తూ స్వర్గస్థులయ్యారు. అంటే ఆమె సోదరులలో ఒక్క శివాజీరావు గారు మాత్రమే అమెరికాలో స్థిరపడలేదన్నమాట. ఇండియాలోనే ఉండిపోయారు.

శ్రీమతి సత్యవతిగారు తెనాలిలో దక్షిణ భారత హిందీ ప్రచారసభ వారి భాషా ప్రవీణ, భాషా ప్రచారక పరీక్షలలో గణనీయమైన మార్కులతో ఉత్తీర్ణులయ్యారు. ఉయ్యూరులో శ్రీ సరస్వతి ట్యుటోరియల్ కాలేజిలో మెట్రిక్ సెకండ్ క్లాస్‌లో పాస్ అయ్యారు. రేపల్లె దగ్గర నగరంలోని శ్రీ వెలగపూడి రామకృష్ణా మెమోరియల్ కాలేజిలో పి.యు.సి పాసై, బి.కాం మొదటి సంవత్సరం చదివారు. 1965లో ఉయ్యూరులోని సి.బి.ఏం. స్కూల్‌లో కొద్దికాలం హిందీ పండిట్‌గా పనిచేశారు. కృష్ణాజిల్లా ఉయ్యూరు వాస్తవ్యులు శ్రీ మైనేని గోపాలకృష్ణగారిని వివాహమాడారు. భర్తతో అమెరికా వెళ్లి అక్కడ కూడా గృహకృత్యాలు యదావిధిగా నిర్వహిస్తూ ఉద్యోగం చేశారు. అమెరికాలోని కెంటకి రాష్ట్రం లూఈ విల్‌లో "చెవ్రాన్ అకౌంటింగ్ సెంటర్"లో డేటా ఎంట్రి ఆపరేటర్‌గా 1973-78 కాలంలో పనిచేశారు. అక్కడే "హ్యూమానా హాస్పిటల్ అండ్ ఇన్సురెన్స్ కార్పోరేషన్"లో కంప్యూటర్ ఆపరేటర్‌గా 1978 నుంచి 21 ఏళ్ళు 1999 వరకు సేవలందించారు. న్యూ జెర్సీలోని ప్రిన్‌స్టన్‌లో "బ్రిస్టల్ మెయర్ స్క్విబ్ ఫార్మ న్యూటికల్ ఇండస్ట్రీ"లో కంప్యూటర్ ఆపరేటర్‌గా 2001 నుండి 2004 వరకు మూడేళ్ళు పనిచేశారు. ఈ ఉద్యోగం చేస్తూనే ప్రిన్‌స్టన్‌లోనే "Y.W.C.A చైల్డ్ కేర్ సెంటర్"లో పార్ట్‌టైం ఉద్యోగమూ ఒక ఏడాది చేసి అలుపెరుగని శ్రమజీవి అనిపించుకొన్నది.

గృహిణిగా తన సమర్థతను నిరూపించుకుంటూ భర్త గోపాలకృష్ణ గారికి అన్ని విషయాలలో సహాయ సహకారాలు అందిస్తూ పిల్లల విద్యా విషయాలను పర్యవేక్షిస్తూ చెరగని చిరు దరహాసంతో సత్యవతిగారు ఏ సమయంలోనైనా కనిపిస్తారు. అదీ ఆమె ప్రత్యేకత. కుటుంబం, బంధువర్గంలోని వారందరికీ ఆమె అందుబాటులో ఉండి సేవలందించటం ఆమె నైజం. భారతీయ శాస్త్రీయ సంగీతం అంటే మక్కువ ఎక్కువ. భారతీయ నృత్య కళపై ప్రత్యేక అభిమానం. వీటిని చూస్తూ, వింటూ ఆమె కాలాన్ని సద్వినియోగం చేస్తారు. అచంచలమైన

భగవత్ భక్తీ ఆమె నర నరాన జీర్ణించుకుపోయింది. ముఖ్యంగా శ్రీకృష్ణ పరమాత్మ ఆమె ఇష్టదైవం. కుట్టు పని, అల్లికలో మంచి ప్రావీణ్యం ఉంది. ఆవరణలో పెరటి తోటను పెంచి పుష్ప ఫల వృక్షాలను, కాయగూరలను పండించటంలో మహా నేర్పరి సత్యవతిగారు. ఇరుగు పొరుగువారికి, బంధువులకు తమ తోటలో తాము పండించిన కూరగాయలను ఆమె పంపించి, సంతృప్తి చెందుతారు. అంటే ఇతరులతో పంచుకోవటం ఆమెకు అమితమైన ఇష్టం. మాకు కూడా స్టెర్లింగ్ హైట్స్‌కు పోస్ట్‌లో పంపారు. "పంచభూత ప్రియ" సత్యవతిగారు. సేంద్రియ ఎరువులనే ఉపయోగిస్తారు. పుష్పాలే ఆమె ఊపిరి. ఉతికిన బట్టలను సూర్యరశ్మి సోకేటట్లు ఆరుబయట ఆరవేయటమే ఆమెకు ఇష్టం. నీటిని చాలా పొదుపుగా ఉపయోగించి ఆదా చేస్తారు. మంచి పొదుపరిగా పేరుపొందారు. దీనినే వృథా చేయటం ఆమెకు అసలు ఇష్టం ఉండదు. తోటలోని ప్రతి అంగుళం స్థలాన్ని సద్వినియోగపరచి కరివేపాకు చెట్లు, మిర్చి, పొట్ల, దోస, దొండ, సొర, కాకర, చిక్కుడు మొదలైన భారతీయ కూరగాయలను స్వయం సమృద్ధంగా పండించి ఆదర్శవంతంగా ఉన్నారు.

కుటుంబంలోని అందరితో సత్ సంబంధాలను నెరపటం ఆమె ప్రత్యేకత. తండ్రిగారంటే విపరీతమైన అభిమానం. ఆయన ఆదర్శాలే ఆమెకు శిరోధార్యాలు. ఆమె తండ్రిగారు రేపల్లెలో కో ఆపరేటివ్ బ్యాంక్‌లో ఉద్యోగం చేస్తూ, వ్యవసాయం చేసుకుంటూ, నిత్యం భగవత్ పారాయణ చేస్తూ సంఘంలో పెద్దగా ఉంటూ సమాజసేవలో ధన్యులయ్యారు. ఆయన మరణం తరువాత వారున్న వీధికి ఆయన పేరు పెట్టి గౌరవించారు. ఆడంబరం ఎరుగని మహిళ శ్రీమతి సత్యవతి. సాదా సీదా జీవితమే. గోపాలకృష్ణగారి కష్ట సుఖాలలో మమేకం అయి, వెన్నుతట్టి ముందుకు నడిపిన ఆదర్శజీవి. సర్వజన సంక్షేమం ఆమె ఆదర్శం. సకల జనులకు సత్యవతిగారు శ్రేయోభిలాషియే. తన ప్రాణం, ఊపిరి, సర్వస్వం సత్యవతిగారేనంటారు. ఆమెకు తగిన భర్త అయిన శ్రీ గోపాలకృష్ణగారు. ఆదర్శ దాంపత్యం వారిది. నలభై ఏళ్ళకు పైగా అమెరికాలో ఉంటున్నా మన సంస్కృతీ, సంప్రదాయాలను, ఆచార వ్యవహారాలను చక్కగా పాటిస్తూ స్ఫూర్తినిస్తున్న ఈ

దంపతులు అభినందనీయులు.  వారిద్దరూ జీవికా జీవులు.  ఒకరిపై మరొకరికి అత్యంత విశ్వాసం, ఆత్మీయత, అవ్యాజమైన ప్రేమ, ఆరాధనా.

గోపాలకృష్ణ, సత్యవతి దంపతులకు ఇద్దరు కుమారులు.  పెద్ద కుమారుడు శ్రీకృష్ణ, కోడలు శ్రీమతి రమ.  మనుమరాళ్ళు చి.శ్రేయ, సెరీన.  చిన్న కుమారుడు శ్రీ రవి, కోడలు శ్రీమతి కవిత.  మనుమడు చి. కిరణ్, మనుమరాళ్ళు చి. రియా, కరీనా.  కుమారులిద్దరూ కోడళ్ళు కూడా అమెరికాలోనే వారు కోరుకున్న ఉద్యోగ వ్యాపకాలలో స్థిరపడ్డారు.

సరసభారతి ప్రచురిస్తున్న పన్నెండవ పుస్తకం "మహిళా మాణిక్యాలు"ను శ్రీ మైనేని గోపాలకృష్ణ గారి ఆదర్శ గృహిణి, అర్ధాంగి అన్న పదానికి నిర్వచనం, సర్వజన శ్రేయోభిలాషి, స్వయం సిద్ధ, అలుపెరుగని కర్తవ్య పరాయణురాలు, మహిళా మాణిక్యం అయిన శ్రీమతి మైనేని సత్యవతిగారికి అంకితం ఇవ్వటం అత్యంత సముచితంగా ఉందని, శ్రీ గోపాలకృష్ణగారి చిరకాల కోరికను తీర్చే సదవకాశం లభించిందని, వారికి ఆమోదమూ, ఆనందమూ కలుగుతుందని భావిస్తూ, హృదయపూర్వకంగా అంకితమిస్తున్నాము.  వీరి దాంపత్యాన్ని, కుటుంబాన్ని కలకాలం ఆయురారోగ్య, ఐశ్వర్య, భోగ, భాగ్యాలతో వర్ధిల్లజేయవలసిందిగా పరమేశ్వరుని ప్రార్ధిస్తున్నాను.  అంతర్జాతీయ మహిళా దినోత్సవం (మార్చి 8) సందర్భంగా "మహిళా మాణిక్యాలు" పుస్తకాన్ని మార్చి 30న సరసభారతి 60వ సమావేశంలో శ్రీజయ నామ సంవత్సర ఉగాది వేడుకలలో ఆవిష్కరిస్తున్నందుకు మహా సంతోషంగా ఉంది.  ఇది శ్రీ గోపాలకృష్ణగారి మనసులోని ఆకాంక్ష కూడా. అది నెరవేరుతున్నందుకు వారితో బాటు అందరికి సంతోషంగా, సంతృప్తిగా ఉంటుందని భావిస్తున్నాను.  ఈ సందర్భంగా మరొక శుభవార్త.  సరసభారతిని రిజిస్టర్ చేయించే ప్రయత్నంలో ఉన్నాము.  అప్పటి నుండి అది రికగ్నైజ్డ్ సంస్థగా ఉంటుందని తెలియజేయటానికి సంతోషిస్తున్నాం.

**– గబ్బిట దుర్గాప్రసాద్**

అధ్యక్షులు – **సరసభారతి**

సాహిత్య సాంస్కృతిక సంస్థ – ఉయ్యూరు

## 'సరసభారతి' కార్యదర్శి నివేదిక

ఉయ్యూరులో సరసభారతి సాహిత్య సాంస్కృతిక సంస్థ 24-11-2009న ప్రారంభమైంది. "అక్షరంలో రక్షకం" అనే ఆశయంతో ప్రారంభించిన ఈ సంస్థ నాలుగేళ్ల ప్రస్థానాన్ని పూర్తి చేసుకొని అయిదవ ఏడాదిలోకి దిగ్విజయంగా ప్రవేశించింది. ఎన్నో విభిన్నమైన కార్యక్రమాలను నిర్వహించింది. ప్రతి ఉగాదికి కవిసమ్మేళనాలను నిర్వహించి, పుస్తక రూపంలో ఆ కవితలను ప్రచురించింది. సంగీత కచేరీలు నిర్వహించింది. ఇప్పటికి యాభై తొమ్మిది సమావేశాలు నిర్వహించింది. ఈ శ్రీ జయనామ సంవత్సర ఉగాది వేడుకలను ఉగాదికి ముందు రోజున 60వ సమావేశంగా నిర్వహిస్తోంది. ప్రారంభం నుండి 7-4-13 వరకు జరిగిన సరసభారతి ప్రగతిని 'సిద్ధ యోగ పుంగవులు' పుస్తకంలో సవివరంగా వివరించి అందజేశాం. అప్పటి నుండి జరిగిన కార్యక్రమ విశేషాలను ఇప్పుడు అందజస్తున్నాము.

శ్రీహనుమజ్జయంతి సందర్భంగా 1-6-13న శ్రీమతి కే. కనక దుర్గా మహాలక్ష్మితో ధార్మిక ప్రసంగాన్ని ఏర్పాటు చేశాము. 2-6-13న మధుర గాయకులూ శ్రీ ఆమంచి చంద్రశేఖర్ చేత "భక్తి సంగీత విభావరి"ని నిర్వహించాము.

శ్రీ చంద్ర శేఖర్ స్వర్గీయ ఘంటసాల గారికి మేనల్లుడు. అద్భుతంగా గానం చేసి శ్రోతలను మైమరపించారు. 3-6-13న శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్ రాసిన "శ్రీ ఆంజనేయ స్వామి మాహాత్మ్యం" పుస్తకాన్ని శ్రీ స్వామివారల శాంతి కళ్యాణం సందర్భంగా ఆవిష్కరింపజేశాము. కాలని మహిళా మండలి వారిచే సాయంత్రం "శ్రీ హనుమాన్ చాలీసా" పారాయణ ఏర్పాటు చేశాము. 22-7-13న వ్యాస జయంతి సందర్భంగా శ్రీ మాదిరాజు శ్రీనివాసశర్మగారి చేత వ్యాస మహర్షి జీవితం, రచనలపై ప్రసంగం చేయించాము. 27-8-13 శ్రీ కృష్ణాష్టమి రోజున "శ్రీ కృష్ణ తత్వ వైభవం"పై శ్రీ ఏ.త్రినాధ శర్మ అద్భుతంగా ప్రసంగించారు. 29-8-13న శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారి 150వ జయంతిని ఉయ్యూరు సెంటర్‌లో సమైక్య వేదిక మీద నిర్వహించి "సమైక్య శంఖారావం" పేరిట సెంటర్‌లోనే కవి సమ్మేళనాన్ని జరిపాం. ఎందరో విద్యార్థినీ, విద్యార్థులు చక్కని చిక్కని కవిత్వం రాసి వినిపించి తమ సృజనాత్మకతను వ్యక్తం చేశారు. వందలాది జనం మధ్య జరిగిన ఈ కార్యక్రమం హైలైట్‌గా నిలిచి అందరిని అలరించి ప్రశంసలను కురిపించింది.

ఏ సాహితీ సంస్థా నిర్వహించని అపూర్వమైన కార్యక్రమాన్ని 51వ సమావేశంగా 17-9-13న సరసభారతి నిర్వహించింది. "అపర అన్నపూర్ణ, నిరాతన్న ప్రదాత అయిన స్వర్గాయ శ్రీమతి డొక్కా సీతమ్మగారి జీవితంపై మూడు పాఠశాలల విద్యార్థులకు వ్యాసరచన, వక్తృత్వ, కవితల పోటీలు నిర్వహించి గెలుపొందిన విద్యార్థులకు బహుమతి ప్రదానం చేశాము. దీన్ని గుర్తించిన సీతమ్మగారి ముని మనవడు గారి అబ్బాయి అమెరికాలో ఉంటున్న శ్రీడొక్కా రామభద్ర సీతమ్మగారి పేర ప్రతిభగల పదవ తరగతి చదువుతున్న పేద విద్యార్థులకు 10,000 రూపాయలను సరసభారతికి పంపారు. దానిని మూడు స్కూళ్ళలోని ముగ్గురు విద్యార్థులకు, ముగ్గురు విద్యార్థినులకు అర్హత ప్రాతిపదిక మీద ఒక్కొక్కరికి 1668 రూపాయలను స్కాలర్‌షిప్‌గా సీతమ్మగారి ముని మనవడు శ్రీ సూర్యనారాయణ, వారి సతీమణి శ్రీమతి త్రిపుర సుందరి దంపతుల చేతులమీదుగా 52వ సమావేశంలో 22-10-13న అందజేశాము. ఈ సమావేశంలోనే తెలుగు లెక్చరర్ శ్రీ గుంటక

వేణుగోపాల రెడ్డి "పానుగంటివారి సాక్షి వ్యాసాల విశిష్టత"పై మహా ఆసక్తిగా ప్రసంగించి అందర్నీ ఆకట్టుకున్నారు. ఇలా వరుసగా రెండు కార్యక్రమాలను సీతమ్మగారిపై నిర్వహించి సెహభాష్ అనిపించుకొన్నాము. 53వ సమావేశంలో కార్తీక మాస వైశిష్ట్యాన్ని వ్యాఖ్యాన చక్రవర్తి శ్రీ అగ్నిహోత్రం శ్రీరామ చక్రవర్తి వివరించారు. 54వ సమావేశంగా శ్రీ గీతా జయంతిని నిర్వహించి శ్రీ మధుసూదన పిళ్లే దంపతుల చేత గీతా మాహాత్మ్యంపై ప్రసంగం ఏర్పాటు చేసి, విద్యార్థులచే గీతా పారాయణ చేయించి సరసభారతి ప్రచురించిన పుస్తకాలు అందజేశాం. 55వ సమావేశం 24-12-13న జరిపి శ్రీమతి మాదిరాజు శివలక్ష్మి చేత "ధనుర్మాసం – తిరుప్పావై ప్రాధాన్యత"పై ఉపన్యాసాన్ని అందించాం. 56వ సమావేశం విశిష్టతను సంతరించుకొన్నది. ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి 120వ జయంతి 42వ వర్ధంతి (జనవరి 10)ని పింగళివారి స్వగ్రామం చిట్టూర్పులో కృష్ణాజిల్లా రచయితల సంఘంతో కలిసి సంయుక్తంగా నిర్వహించి అందరి మన్ననలను అందుకొన్నాం. పింగళివారి జీవితం రచనలపై పరిశోధన చేసిన డాక్టర్ శ్రీ పింగళి వెంకట కృష్ణారావుగారు ముఖ్య అతిథిగా విచ్చేసి కీలక ఉపన్యాసాన్ని చేసి పింగళి వారిని అందరికి పరిచయం చేశారు. కృష్ణాజిల్లా రచయితల సంఘం అధ్యక్ష కార్యదర్శులు శ్రీగుత్తికొండ సుబ్బారావు, శ్రీ డా.జి.వి.పూర్ణచంద్, శ్రీ మాదిరాజు రామ లింగేశ్వరరావు, శ్రీ రావి రంగారావు, చింతలపాటి సోదరులు, శ్రీ మద్దూరి విశ్వం, శ్రీ కోసూరి ఆదినారాయణ, శ్రీ గొట్టిపాటి రామకృష్ణ, గ్రామ పెద్దలు శ్రీ యల్లాప్రగడ శ్రీరామమూర్తి, శ్రీ నాదెళ్ళ వెంకట గోపాలరావు, శ్రీ వెలివెల వీర రాఘవయ్య, శ్రీ దాసరి బసవ కుటుంబ రావు, శ్రీ జి.జి.ఎస్.ఎస్.ఎస్.వి.ప్రసాద్, శ్రీ పరుచూరి రామకృష్ణ, శ్రీశ్రీ పరుచూరి జగన్మోహనరావు వంటి గ్రామ పెద్దలు పాల్గొన్న ఈ సభ వందమందికి పైగా శ్రోతలతో దిగ్విజయమైంది. గ్రామస్తులు అందించిన అపూర్వ సహకారం మరువలేనిది. గ్రామీణ ప్రాంతంలో ఇలాంటి సభ నిర్వహించటం ఇదే ప్రథమం. దీని దిగ్విజయానికి అందరూ అభినందనీయులే. ముఖ్యంగా ఆ గ్రామస్థురాలు శ్రీమతి మాదిరాజు శివలక్ష్మి, వారి కుటుంబం నిర్వహించిన పాత్ర చిరస్మరణీయం. ఇలాంటి సభలే తొలి జ్ఞానపీఠ పురస్కార

గ్రహీత, కవి సామ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి "స్వగ్రామం నందమూరు"లోను, సినీ సంగీత దర్శకులు శ్రీ పెండ్యాల నాగేశ్వరరావుగారి స్వగ్రామం కాటూరులోను నిర్వహించాలని సరసభారతి భావిస్తోంది. 57వ సమావేశంగా సంగీత సద్గురు శ్రీ త్యాగరాజస్వామి ఆరాధనోత్సవాన్ని పుష్య బహుళ పంచమి నాడు 21-1-2014న నిర్వహించి త్యాగరాజ స్వామికి అష్టోత్తర పూజ చేసి పంచరత్న కీర్తనలను వినిపించాం. శ్రీ సీతారామాంజనేయ భక్త సమాజం చేత భజన ఏర్పాటు చేశాం. 58వ సమావేశంగా ప్రముఖ చలనచిత్ర నటీమణి శ్రీమతి అంజలీదేవి, నటుడు శ్రీ అక్కినేని నాగేశ్వరరావుల మరణానికి శాఖా గ్రంధాలయంలో సభ జరిపి నివాళులర్పించాం.

ఈ సంవత్సరం విద్యార్ధుల కోసం ఇంతవరకు ఏ పాఠశాలలోను కార్యక్రమాన్ని నిర్వహించలేకపోయాం. ఆ లోటును 59వ సమావేశం తీర్చింది. స్థానిక అమరవాణి హైస్కూల్‌లో 22-2-14 శనివారం ఉదయం 11 గంటలకు జ్ఞానపీఠ పురస్కార గ్రహీత స్వర్గీయ "రావూరి భరద్వాజ గారి జీవితం, రచనలు"పై విద్యార్ధులకు అవగాహన కల్పించటానికి ప్రముఖ కవి, రచయిత్రి, విమర్శకురాలు శ్రీమతి మందరపు హైమవతి, ప్రఖ్యాత కవి శ్రీ కె.ఆంజనేయ కుమార్‌గారల చేత చక్కటి ప్రసంగాన్ని ఏర్పరచి విద్యార్ధులకు గొప్ప అవగాహన కలిగించాం. ఉత్సాహంగా వారు పాల్గొని శ్రద్ధగా విని స్పందించారు. అమరవాణి విద్యార్ధులకు భరద్వాజ జీవితంపై వ్యాసరచన, రచనలలో మానవ సంబంధాలుపై వక్తృత్వ పోటీలు నిర్వహించి బహుమతి ప్రదానం చేశాము. శ్రీ చలపాక ప్రకాష్ ఈ కార్యక్రమానికి రూపకల్పన చేసి అమరవాణి స్కూల్ గ్రంధాలయానికి పుస్తకాలను బహూకరించి సహకరించారు. శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్ అధ్యక్షత వహించగా అమరవాణి ప్రిన్సిపాల్ శ్రీ పి.వి.నాగరాజు సభా నిర్వహణ చేసి అతిథులకు విందునిచ్చారు.

శ్రీ జయ నామ సంవత్సర ఉగాది వేడుకలను ఉగాదికి ముందురోజు 30-3-14 ఆదివారం మధ్యాహ్నం రోటరీ క్లబ్ ఆడిటోరియంలో నిర్వహిస్తున్నాం. ఈ సభలో జిల్లా నలుమూలల నుండి వచ్చిన కవులు తమ కవితలను వినిపించి అలరిస్తారు. ప్రపంచ ప్రఖ్యాత ఈల విద్వాంసులు శ్రీ కొమరవోలు శివప్రసాద్

ముఖ్య అతిథిగా విచ్చేసి సరసభారతి ఉగాది పురస్కారాన్ని గ్రహిస్తారు. ఆ తర్వాత వారి "ఈల కచేరి"తో తన్మయులను చేస్తారు. ఆంధ్రప్రదేశ్ మాసపత్రిక సంపాదకులు శ్రీ జి.వల్లీశ్వర్, విజయవాడ ఆకాశవాణి సంచాలకులు శ్రీమతి ముంజలూరి కృష్ణకుమారి, ప్రముఖ ఆయుర్వేద వైద్యురాలు శ్రీమతి డాక్టర్ కే. శ్రీవిద్య (ఎం.డి)లు ఆత్మీయ అతిథులుగా విచ్చేసి మా పురస్కారాలను అందుకొంటారు. కృష్ణాజిల్లా రచయితల సంఘం ముఖ్య కార్యదర్శి శ్రీ డా.జి.వి.పూర్ణచంద్ మొదలైన పెద్దలు పాల్గొని దిగ్విజయం చేస్తారు. ఈ ఉగాది కార్యక్రమానికి అన్ని విధాల సహకరించి, ఆడిటోరియంలో జరపటానికి అనుమతినిచ్చిన కే.సి.పి.సి.ఒ.ఒ.శ్రీ ఎం.వెంకటే శ్వరరావు గారికి, వారి సిబ్బందికి రోటరీ క్లబ్ అధ్యక్ష కార్యదర్శులకు కార్యవర్గానికి కృతజ్ఞతలు తెలియజేసుకొంటున్నాం.

వివిధ రంగాలలో ప్రపంచ ప్రసిద్ధులైన మహిళల గురించి సరసభారతి అధ్యక్షులు శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్ అంతర్జాలంలో సీరియల్‌గా రాసిన వ్యాసాలను "మహిళా మాణిక్యాలు" పుస్తకంగా సరసభారతి 12వ ప్రచురణగా ముద్రించి ఈ రోజున ఆవిష్కరించపజేస్తోందని తెలియజేయటానికి సంతోషిస్తున్నాం. ఇది దుర్గాప్రసాద్‌గారు రాసిన ఏడవ పుస్తకం. ఈ పుస్తకం ముద్రణ ఖర్చులన్నీ ఉయ్యూరు వాసి ప్రస్తుతం అమెరికాలో అలబామా రాష్ట్రంలో హాంట్స్‌విల్‌లో ఉంటున్న సరసభారతికి అత్యంత ఆప్తులు శ్రీ మైనేని గోపాలకృష్ణ గారు భరించి పుస్తకం వెలువడటానికి తోడ్పడ్డారు. వారికి సరసభారతి కృతజ్ఞత తెలియజేస్తోంది. వారి కోరికపై "మహిళా మాణిక్యాలు" పుస్తకాన్ని "మహిళా మాణిక్యం" సహధర్మ చారిణి అయిన మైనేని వారి ధర్మపత్ని శ్రీమతి మైనేని సత్యవతి గారికి అంకితమిస్తున్నాం. అంతర్జాతీయ మహిళా దినోత్సవం జరిగే ఈ మార్చి నెలలో ఈ పుస్తకం ఆవిష్కరింపబడటం అత్యంత సమంజసమని భావిస్తున్నాము. సరసభారతికి ఇప్పటి వరకు సహాయ సహకారాలందించిన వారందరికీ వినయంతో కృతజ్ఞతలను తెలుపుకొంటున్నాము. ఇకముందు కూడా ఆదరణ, అభిమానం, ఆత్మీయత, సహాయ సహకారాలను అందించాలని కోరుతూ, అందిస్తారని ఆశిస్తున్నాము.

**– మాదిరాజు శివలక్ష్మి**

కార్యదర్శి – సరసభారతి

# నా మాట

**మే**ము నాలుగవసారి 2012లో అమెరికాలో నార్త్ కరోలినాలోని షార్లెట్‌కు మా అమ్మాయి చి.సౌ.విజయలక్ష్మి, అల్లుడు అవధానివాళ్ళ ఇంటికి వెళ్ళినప్పుడు లైబ్రరీలో తీసుకొని చదివిన అనేక పుస్తకాలలో మహిళల మీద రాసిన పుస్తకాలు నన్ను బాగా ఆకర్షించాయి. అందులో చాలామంది మనవాళ్లకు తెలియనే తెలియదనిపించింది. ఆ పుస్తకాలు ఆధారంగా వివిధ రంగాలలో ప్రపంచ ప్రసిద్ధులైన స్త్రీలపై వరుసగా అంతర్జాలంలో వ్యాసాలు రాయటం ప్రారంభించాను. అవి అందరినీ ఆకర్షించాయి. అదే సమయంలో "విహంగ" మహిళా వెబ్ మాసపత్రిక సంపాదకురాలు శ్రీమతి పుట్ల హేమలతగారు తమ పత్రికకు కూడా వ్యాసాలను రాయమని కోరితే అమెరికా నుండే మహిళామతల్లుల మీదనే ఆ పత్రిక కోసం ప్రత్యేకంగా వ్యాసాలు రాయటం ప్రారంభించాను. ప్రతి నెలా సుమారు పదిహేనవ తేదీన మరుసటి నెలకు వ్యాసం రాయమని మెయిల్ రాసేవారు. అలానే రాసి పంపిస్తున్నాను. అందులో అచ్చు అయిన తర్వాతే సరసభారతి సాహితీ బంధువులకు పంపేవాడిని. దాదాపు పదిహేను ఆర్టికల్స్ ఆ పత్రికకు రాశాను. ఇవి కాక అంతర్జాలంలో నేను ప్రతిభావంతులైన స్త్రీలపై రాస్తూనే ఉన్నాను. ఇవన్నీ కలిపి

"మహిళా మాణిక్యాలు" పేరిట ఒక పుస్తక రూపంలో తేవాలనే ఆలోచన ఈ మధ్యనే కలిగింది. ఏర్పాట్లు చేస్తూ విహంగలో నేను రాయగా ప్రచురింపబడిన వ్యాసాలను ఈ పుస్తకంలో చేర్చటానికి శ్రీమతి హేమలతగారిని అనుమతించవలసిందిగా కోరగా వెంటనే సంతోషంతో స్పందించి, పుస్తకం తెస్తున్నందుకు నన్ను అభినందిస్తూ ప్రోత్సహించి, అనుమతినిస్తూ అందులోని నా వ్యాసాలను వరుస క్రమంలో నాకు పంపారు. వారికి కృతజ్ఞతలను తెలుపుకొంటున్నాను

**– గబ్బిట దుర్గాప్రసాద్**

**'సరసభారతి'** సాహిత్య సాంస్కృతిక సంస్థ

ఉయ్యూరు

**"మహిళా మాణిక్యాలు" పుస్తక రచనకు తోడ్పడిన పుస్తకాలు**

❀శ్రీ మైనేని గోపాలకృష్ణగారు నాకు పంపి, నాతో చదివించిన women of power and grace, Lincoln's battles with God అనే రెండు పుస్తకాలు.

❀మాతృశ్రీ పబ్లికేషన్ ప్రచురణ "మాతృశ్రీ అనసూయా దేవి"

❀తెలుగు విజ్ఞాన సర్వస్వం

❀ఇంగ్లీష్ వీకీపీడియా

❀శ్రీ వాసవ్య రచించిన "ప్రాచీన భారతీయ శాస్త్రవేత్తలు"

❀అమెరికాలో నార్త్ కరోలినా రాష్ట్రం షార్లెట్‌లోని బిల్లీ గ్రాహం లైబ్రరీలో నేను చదివిన అనేక ఆంగ్ల పుస్తకాలు

❀శ్రీ లకుమ కూర్చిన ఎం.ఎస్.సుబ్బలక్ష్మిపై వ్యాసాలు

❀వివిధ వార, మాస పత్రికలలోవెలువడిన వ్యాసాలు.

❀శ్రీ వకుళాభరణం రామకృష్ణగారు డొక్కా సీతమ్మగారిపై రాసిన వ్యాసం. (దీనిని శ్రీ రామినేని భాస్కరేంద్రరావు గారు నాకు పంపారు)

# ఇదీ 'మాణిక్యాల' వరస

# మహిళా మాణిక్యాలు

## 1. నిరతాన్నదాత అపర అన్నపూర్ణ – శ్రీమతి డొక్కా సీతమ్మగారు

**తూ**ర్పు గోదావరి జిల్లా రామచంద్రాపురం తాలూకా మండపేటలో 1841 అక్టోబర్ రెండవ వారంలో డొక్కా సీతమ్మగారు జన్మించారు. తండ్రి అనపిండి భవానీ శంకరం, తల్లి నరసమ్మ గార్లు. ఆ కాలంలో ఆడపిల్లలకు చదువుకు ప్రోత్సాహం లేదు. సీతమ్మగారి తల్లిదండ్రులే ఆమెకు గురువులుగా ఉండి పురాణ కథలు, పాటలు, పద్యాలు ఎన్నో నేర్పారు. మన సంప్రదాయాలు, ఆచారాలను వారి నుండి ఈమె నేర్చుకొని అమలుచేశారు. "అతిథి దేవో భవ" అన్న మన సంప్రదాయాన్ని తల్లిదండ్రుల నుండి గ్రహించి జీవితాంతం అమలు చేశారు. ఆ రోజుల్లో అందరికి లాగానే సీతమ్మగారికీ రాజోలు తాలూకా లంకల గన్నవరం గ్రామస్తుడు డొక్కా జోగన్న గారితో బాల్యవివాహం జరిపించారు. అప్పటికి ఆమె పెద్దబాలశిక్ష చదువు కూడా పూర్తికాలేదు.

ఈ వివాహానికి ఒక సందర్భం ఉంది. జోగన్న గారు సంపన్నుడు, వేద పండితుడు కూడా. ఒకసారి ఒక పండిత సభకు వెళ్లి వచ్చేసరికి మధ్యాహ్నం అయినందున భవాని శంకరం గారు జోగన్నగారిని తన ఇంటికి ఆహ్వానించారు. అక్కడ ఆయన సీతమ్మగారి మర్యాదా, అణకువ, నేర్పరితనం, చొరవ, సాంప్రదాయ పద్ధతిలకు ముగ్ధుడై సీతమ్మగారి తండ్రికి తెలియజేశారు. సీతమ్మగారూ అంగీకరించారు. వెంటనే భవానీ శంకరంగారు సీతమ్మ జోగన్నగారల వివాహాన్ని ఒక శుభ ముహూర్తంలో వైభవంగా జరిపించారు. అన్యోన్య దంపతులుగా వారిద్దరూ పేరు తెచ్చుకొన్నారు. అత్తగారినే తల్లిలాగా భావించి సీతమ్మగారు

ఆమెకు సకల సపర్యలూ చేస్తూ, అభిమానం పొందినారు. ఆప్యాయత, ఆదరణ, శుచి శుభ్రతలకు మారుపేరుగా గ్రామంలో పేరు తెచ్చుకొన్నారు. అతిథి అభ్యాగతులను ఆదరించటంలో సీతమ్మగారికి సాటి ఎవరూ లేరనిపించుకొన్నారు. ఆమె పేరు ఆ తాలూకా, జిల్లా, రాష్ట్రం, దేశం అంతా మారుమోగింది.

ఆకలికి కులం, గోత్రం, మతం ఏమీ ఉండదని, ఆదరించి అన్నం పెట్టటానికి ఇవి ఆటంకాలు కాకూడదని సీతమ్మగారు అభిప్రాయపడ్డారు. ఆ భేదాలేమీ లేకుండా ఆమె ఆ నిరతాన్నదాన కార్యక్రమం నిర్వహించారు. ఎదుటివారిలో ఆకలిని మాత్రమే ఆమె గుర్తించారు తప్ప ఇంకేదీ కాదు. అదీ ఆ అన్నపూర్ణమ్మ గొప్పదనం. అన్నం కోసం వచ్చినవారికి ఇంత అన్నం కడుపునిండా పెట్టి వారికి సంతృప్తి కలిగించటమే ఆమె ధ్యేయంగా భావించారు. ఇంతకుమించి ఆమెకే ధర్మసూత్రాలు, సూక్తులూ తెలియవు. తన నిరతాన్నదానం గురించి ఎవరి వద్దా ఆమె గొప్పగా చెప్పుకోలేదు. ప్రచారానికి, ఆర్భాటానికి ఆమడదూరం సీతమ్మగారు. ఇంత గొప్ప కార్యక్రమం చేస్తున్నా ఆమె కుటుంబం ఏమీ మరీ అంత సంపన్నమైనదేమీ కాదు. కొద్దిపాటి పొలం మాత్రమే ఉండేది. అప్పుడు ఆ మండలం అంతా లంకభూములు, రవాణా సౌకర్యాలు అంతగా అభివృద్ధి కాలేదు. అన్నీ కుగ్రామాలే. ఏ సౌకర్యమూ ఉండేవికావు. అవీ చెల్లాచెదురుగా దూరం దూరంగా ఉండేవి. ఎక్కడికి వెళ్ళాల్సివచ్చినా యెంత దూరమైనా నడిచే వెళ్ళేవారు. భోజనం ఇంటి వద్ద చేయటమే లేక మూటలు కట్టుకొని వెంట తీసుకొని వెళ్ళటమే. ఎక్కడైనా ధర్మ సత్రాలుంటే పట్నాలలోనే ఉండేవి పల్లెలకు ఆ అదృష్టం లేదు. ఎవరైనా ఉదారులు ఉంటే ఇంటికి పిలిచి భోజనం పెట్టేవారు. దూర ప్రయాణాలలో ప్రజలు దాహంతో, ఆకలితో బాధ భరించలేక సొమ్మసిల్లి పోయేవారు మధ్యదారిలోనే. ఇలాంటి వారందరి కోసమే పుట్టిన అన్నపూర్ణ డొక్కా సీతమ్మగారు. వారి పాలిటి ఆరాధ్య దేవత.

సీతమ్మగారి కాలంలో ఆ ప్రాంతంలో ఆకలి కేకలు వినిపించేవి కావని అందరూ చెప్పే మాట. అతిథులకు వండి వడ్డించటంలో ఆమెకు అలుపూ, సొలుపూ ఉండేదికాదు. అతిథిని చూస్తే ఆమెకు పరవశం. వారిలో ఆమెకు సాక్షాత్తు దైవమే కనిపించేవాడు. భక్తీ శ్రద్ధలతో వారికి ఇంటికి ఆహ్వానించి కమ్మని రుచికర భోజనాన్ని పదార్థాలన్నిటితో ఆప్యాయంగా వండి వడ్డించి కొసరి కొసరి తినిపించేవారు. సీతమ్మగారి ఈ సదాశయానికి భర్త జోగన్నగారి సహకారం, తోడ్పాటు మరువలేనిది. దంపతులిద్దరూ ఎంతో నిరాడంబరంగా, ఆదర్శప్రాయంగా జీవించారు. పొలంలో కష్టపడి పనిచేయటం, భార్య చేసే అన్నదానానికి మనస్ఫూర్తిగా సహకరించి, ప్రోత్సహించటం జోగన్నగారు కర్తవ్యంగా భావించి చూశారు.

**సీతమ్మగారి వితరణ గురించి ఎన్నో విశేషాలున్నాయి**

ఒకరోజు అర్థరాత్రి గాఢనిద్రలో ఉన్నారు సీతమ్మ దంపతులు. ఎవరిదో దూరంగా

పిలుపు వినిపించింది. అలసిపోయి ఉన్నా ఆమెకు ఎవరో ఒకరు అతిథిగా అర్థరాత్రి వేళలో వస్తారేమోనని ఎదురు చూసేవారు. లాంతరు తీసుకొని రేవు దగ్గరకు వెళ్లి ఎవరైనా ఉన్నారేమోనని చూసి వచ్చి అప్పుడే నిద్రపోవటం ఆమె దినచర్యలో భాగం. అప్పుడు ఆమె గుమ్మంలో పలుగులూ, పారలూ, తట్టలూ, బుట్టలూ పట్టుకొని దాదాపు పదిహేను మంది వాకిట్లో కూర్చుని ఉండటం చూశారు. వారు సీతమ్మగారిని చూడగానే కన్నీళ్లు పెట్టుకొని తమకు ఉదయం నుండి ఎక్కడా పనులు దొరకలేదని ఆకలితో పిల్లా జెల్లా అలమటించిపోతున్నామని దయగల తల్లి కనుక ఇంత అన్నం ముద్దపెట్టి ఆదుకోమని వేడుకొన్నారు. అర్థరాత్రి నిద్ర లేపినందుకు క్షమించమని కోరారు చేతులు జోడిస్తూ. సీతమ్మ గుండె కరిగి కన్నీరైంది. వెంటనే వారందరినీ నూతి దగ్గరకు వెళ్లి కాళ్ళూ చేతులూ కడుక్కొని రమ్మని చెప్పి వంటింటిలోకి వెళ్లి పొయ్యిమీద ఎసరు గుండిగను ఎక్కించారు. అన్నం, పప్పు, పులుసూ క్షణాలమీద వండి ఊరగాయలుతో సహా వడ్డించి అందరికి ఆప్యాయంగా భోజనం పెట్టిన అపర అన్నపూర్ణ సీతమ్మగారు. వారందరూ ఆమెకు ఎంతో కృతజ్ఞతలు చెప్పి ఆమె చెప్పినట్లు వీధి అరుగుమీద హాయిగా నిద్రపోయారు. ఇది విన్నా చదివినా మానవత్వం ఉన్న ఎవరికైనా కన్ను చెమరుస్తుంది. ఏ సమయంలో ఎవరు అన్నానికి వచ్చినా ఆమె ముఖంలో విసుగు కాని అలసట కాని కనిపించకపోవటం విశేషం. అతిథులను దేవునితో పోల్చుకోవటం వలన వచ్చే ఆనందం అది.

ఇంకోసారి ఒక హరిజనుడు గోదావరి లంకలో కొద్దిపాటి వ్యవసాయం చేస్తూ జీవిస్తూండేవాడు. లంకలోనే గుడిసెలో ఒంటరిగా ఉండేవాడు. అకస్మాత్తుగా గోదావరికి విపరీతమైన వరద వచ్చింది. లంక అంతా నీటితో నిండిపోయింది. అతని గుడిసె మెరక మీద ఉండటంతో ప్రాణాపాయం లేకపోయింది. సీతమ్మగారు అతిథి సేవ పూర్తి చేసుకొని పెరటి తలుపు మూయబోతుండగా "అమ్మా! సీతమ్మ తల్లీ! నేనిక్కడ వరదలో చిక్కుకుపోయాను. బువ్వలేక ఆకలితో ప్రాణాలు పోతున్నాయమ్మా" అన్న కేకలు వినిపించాయి. వెంటనే ఆమె భర్త జోగన్నగారిని నిద్రలేపి "ఏవండీ! అవి వెంట్రాముడి కేకల్లా ఉన్నాయండీ. ఆకలితో చచ్చిపోతాడేమో?" అని చెప్పి ఇంట్లో ఉన్న అన్నాన్ని మూటకట్టి పళ్ళు, ఊరగాయ కూడా పెట్టి పొగాకు చుట్టతో సహా జోగన్నగారికిచ్చి వెళ్లి ఇచ్చిరమ్మన్నారు. ఆయన ఏమాత్రం సంకోచం లేకుండా వాటిని నెత్తి మీద పెట్టుకొని గోదావరి దాటి వెంకట్రాముడికిచ్చి ఆకలి పోగొట్టారు. వరద తగ్గన తర్వాత అతడు ఊరిలోకి సీతమ్మగారింటికి వచ్చి "అమ్మా! మీరు చేసిన ఊపకారానికి నా చర్మంచెప్పులు కుట్టి ఇచ్చినా మీ ఋణం తీర్చుకోలేనమ్మా" అని కృతజ్ఞతతో కన్నీరు కార్చాడు. అదీ మానవత్వం అంటే. అందుకే సీతమ్మగారి చరిత్ర, చరిత్ర పుటల్లో చేరింది.

సీతమ్మ దంపతులు ఎన్నో పెళ్ళిళ్ళు చేయించారు. విద్యకు, ఉపనయనాలకు

విరాళాలిచ్చి సహకరించారు. పశువుల కాళ్ళకు, నోటికి వచ్చే గాళ్ళ వ్యాధికి జోగన్నగారు మందు ఇచ్చేవారు. నయం కాగానే వాటిని తమ పచ్చిక బీడులో మేపే ఏర్పాటు చేసి ఆరోగ్యం బాగా కుదుటపడిన తర్వాత పంపించేవారు. మనుషుల మీదేకాదు పశువులలోను వారికి దైవమే కన్పించాడు. పొలాలలో మినుము, పెసర పండించేవారు. బాడవలు దొంకలు తుప్ప భూముల్ని బాగు చేసి మొదటిసారిగా కొబ్బరి, మామిడి మొదలైన ఫల వృక్షాలను పెంచిన ఘనత ఆ దంపతులది. అందరితోనూ అలా చేయించి కోనసీమ అందాలకు మార్గదర్శి అయ్యారు. మంచినీటి బావులు అనేకం త్రవ్వించి, త్రాగునీటి వసతి కల్పించారు. సీతమ్మగారు త్రవ్వించిన బావి పేరూరు అగ్రహారంలో ఇప్పటికీ సాక్షిగా ఉంది. లంకల గన్నవరం "డొక్కా సీతమ్మ గన్నవరం" అయింది. సర్ ఆర్థర్ కాటన్ దొర ధవలేశ్వరం ఆనకట్ట కట్టిన తర్వాత గన్నవరం ఆనకట్ట ఆక్విడేక్ట్ నిర్మించాడు. ఎన్ని రహదారి సౌకర్యాలేర్పడినా 1909లో సీతమ్మగారు మరణించేదాకా ఆమె అన్నదానం నిరంతరంగా కొనసాగింది.

## ఎడ్వర్డ్ రాజు అభినందన

సీతమ్మగారి నిరతాన్నదాన విషయం కలెక్టర్ ద్వారా బ్రిటిష్ రాజు ఏడవ అడ్వర్డ్ చెవిన పడింది. 1902లో సీతమ్మగారికి యోగ్యతా పత్రాన్ని కలెక్టర్ ద్వారా అందజేశాడు. 1903లో తన పట్టాభిషేక మహోత్సవానికి రావలసిందిగా ఆహ్వానం పంపాడు. కాని సీతమ్మగారు తానేమీ ప్రతిఫలాపేక్ష కోసం ఈ పనులు చేయటం లేదని అతిథి మర్యాద భారతీయ సంప్రదాయం అని దానికి ఇంతగా ప్రచారం అక్కర్లేదని సున్నితంగా తిరస్కరించారు. విశాఖ కలెక్టర్‌ను పంపి సీతమ్మగారి ఫోటో తీయించి లండన్‌కు తెప్పించుకొన్నాడు రాజు. ఆమెకు ఒక బంగారు పతకాన్ని ఊరిలో అందరి సమక్షంలో కలెక్టర్ చేత ఇప్పించాడు. సీతమ్మగారి ఫోటోను రాజదర్బారులో గౌరవంగా ఉంచాడు. ప్రతి ఏడాది తన పట్టాభిషేకం రోజున దానిని అందరు దర్శించటానికి వీలుగా ప్రదర్శించేవాడు రాజు. కాశీలో అన్నపూర్ణ దేవాలయంలో సీతమ్మగారి చిత్ర పటం ఉంది. ధవళేశ్వరం ఆనకట్ట నిర్మాణ సమయంలో ఒక కలెక్టర్‌కు జ్వరం వస్తే సీతమ్మగారు ఆయనకు ఆతిథ్యమిచ్చి అన్నం పెట్టి జ్వరానికి మందులు కూడా ఇచ్చారు.

## ప్రసంసా పత్రం

ìBy command His Excellency The viceroy and Governor General in council this certificate is presented in the name of the gracious Majesty king Edward 7 - Emperor of India to Dokka Seetamma of Gannavaram in recognition of her well known charityî

Sd. Stocks

Chief Secretary to the Government of India

## పిఠాపురం జమీందార్ వితరణ

గోదావరి జిల్లా కలెక్టర్ పిఠాపురం రాజువారికి సీతమ్మగారి గొప్పతనాన్ని గురించి వివరించాడు. ఆయన తానూ ఎన్నో దానధర్మాలు సేవల్లో చేస్తున్నా తనకు రాని కీర్తి సీతమ్మగారికి రావటంతో నిజం యెంత అని నిర్ధారించుకోవాలనుకొన్నాడు. ఒకరోజు గన్నవరం వచ్చి దివాన్‌తో సహా సీతమ్మగారి అరుగుమీద మారువేషంతో కూర్చున్నాడు. అప్పుడు సీతమ్మగారింట్లో భోజనం చేసి బయటకు వస్తున్న అతిథుల ప్రసంగాలు, ఆమెను వారు కీర్తిస్తున్న విధానం అంతా విన్నాడు. అప్పుడు సీతమ్మగారి వ్యక్తిత్వం, గొప్పతనం, అన్నదానం తెలిసింది. లోపలికి వెళ్లి తానూ దివాను కూడా ఆమె ఆతిథ్యాన్ని పొందారు. అప్పుడు రాజు ఆమె ఆతిథ్యాలకు వీలుగా ఒక గ్రామాన్ని రాసిస్తానని తానూ మారువేషంలో వచ్చి తప్పుచేశానని చెప్పాడు. "ఇతరుల సహాయంతో అన్నంపెట్టి, అన్నం అమ్ముకొనేవారు పోయే దుర్గతికి నేను పోను" అని ఖచ్చితంగా చెప్పారు సీతమ్మగారు.

సీతమ్మగారు చనిపోయిన తర్వాత కొడుకు సుబ్బారాయుడిని ఒప్పించి 40 ఎకరాల భూమి రాసిచ్చాడు జమీందార్. ప్రతి ఏడాది ఆయనకు దసరా కానుకగా పంచల చాపు, 365 రూపాయలు వార్షికంగా పంపి తన వితరణ రుజువు చేసుకొన్నాడు పిఠాపురం రాజు.

## సీతమ్మ వారధి

ధవళేశ్వరం వద్ద ఆనకట్ట కట్టేటప్పుడే కాటన్ దొర కొనసీమ కోసం పి.గన్నవరం వద్ద ఒక ఆక్విడేక్ట్ నిర్మించాలని భావించాడు. 1859లో ఆక్విడేక్ట్ కట్టించి కొనసీమ కొరతను తీర్చాడు. దానితో బాటు వైనతేయ నది మీద రోడ్డు బ్రిడ్జి కూడా 2000లో ఏర్పడి రహదారి సౌకర్యం ఏర్పడి, 45,000 ఎకరాలకు సాగునీటి సౌకర్యం కలిగింది. ఇది ఆనాటి లోక్‌సభ స్పీకర్ స్వర్గీయ బాలయోగి ఆలోచన. ఆయనే లండన్ మ్యూజియంలో డొక్కా సీతమ్మగారి చిత్రపటాన్ని చూసి ఆమె పేర గొక్కా సీతమ్మ ఆక్విడేక్ట్‌గా నామకరణం చేశాడు. దీన్ని ఆనాటి మంత్రి మండవ వెంకటేశ్వరరావు ప్రారంభించాడు. ఆనాటి ముఖ్యమంత్రి చంద్రబాబు పాత, కొత్త ఆక్విడేక్ట్‌లను టూరిస్ట్ స్పాట్‌గా అభివృద్ధి చేస్తానని హామీ ఇచ్చాడు. ఇంతవరకు అది జరగలేదు. వైనతేయ గోదావరి రెండవ వైపునే సీతమ్మగారి లంకల గన్నవరం ఉంది. ఈ రెండు గన్నవరాలలో అనేక సినిమా షూటింగులు జరుగుతాయి.

## సీతమ్మ గారిపై సరసభారతి కార్యక్రమాలు

డొక్కా సీతమ్మగారి గురించిన పాఠాలు తెలుగు వాచకంలో సుమారు ముప్ఫై ఏళ్ళ క్రితం వరకూ ఉండేవి. ఇప్పుడవి లేకపోవటం బాధేస్తుంది. ప్రవచనం కర్త శ్రీ చాగంటి కోటేశ్వరరావుగారు టివి చానల్‌లో సీతమ్మగారి మహోన్నత వ్యక్తులను మనం మరచిపోతున్నామని, ఈతరం విద్యార్థులకు, యువకులకు ప్రేరణగా ఆమె జీవిత చరిత్రను

అందించాలని చెప్పారు. దీనిపై సరసభారతి స్పందించి 17-09-2013న 51వ సమావేశంగా "శ్రీమతి డొక్కా సీతమ్మగారి జీవితం అన్నదానం"లపై విద్యార్థులకు వ్యాసరచన, వక్తృత్వం, కవితల పోటీ నిర్వహించి, వారితో మాట్లాడించి కవితలు చదివించి బహుమతులంద జేసింది. ఈ విషయం తెలిసిన సీతమ్మగారి మునిమనవడి గారి అబ్బాయి అంటే ఇని మనవడు డొక్కా రాంభద్ర అమెరికా నుండి ఫోన్ చేసి అభినందించారు. సీతమ్మగారి పేర స్కాలర్‌షిప్‌లను అందజేస్తానని చెప్పారు. పదివేల రూపాయలను వెంటనే పంపారు. దానిని పదవ తరగతి చదువుతున్న పేద ప్రతిభగల ముగ్గురు విద్యార్థినులకు, ముగ్గురు విద్యార్థులకు సమానంగా సరసభారతి 52 సమావేశంలో మంగళవారం సాయంత్రం శ్రీ సువర్చలాన్జనేయ స్వామి దేవాలయంలో సీతమ్మగారి మనుమడు శ్రీ డొక్కా సూర్యనారాయణగారు, సతీమణి బాలాత్రిపుర సుందరి దంపతుల చేతులమీదుగా అందజేశాం. హైదరాబాద్ నుండి రాంభద్రగారి కోరికమేరకు వారు ఇక్కడికి వచ్చి సమావేశంలో పాల్గొని, అందజేయటం విశేషతను సంతరించుకొన్నది. బహుశా ఆంధ్రదేశంలో ఏ సాహితీ సంస్థ సీతమ్మగారిపై ఇలాంటి కార్యక్రమాన్ని చేబట్టలేదని అందరు అనుకొన్నారు. ఇది సరసభారతికి గర్వకారణం. ఈ రకంగా నిరతాన్న ప్రదాత అపర అన్నపూర్ణ అయిన శ్రీమతి డొక్కా సీతమ్మగారిని సంస్మరించే మహదవకాశం అందరికి కలిగింది. ❀



## 2. తొలి తరం మహిళోద్యమ నాయకురాలు - భండారు అచ్చమాంబ

**భా**రతదేశంలోనే మొదటి మహిళా చరిత్ర రచయితగా, మన రాష్ట్రంలో తొలి తరం మహిళోద్యమ సారధిగా శ్రీమతి భండారు అచ్చమాంబ గుర్తింపు పొందింది. కృష్ణాజిల్లా నందిగామ దగ్గర పెనుగంచిప్రోలులో ఆమె 1874లో జన్మించింది. తండ్రి కొమర్రాజు వెంకటప్పయ్య, కొమర్రాజు వెంకటలక్ష్మణరావు గారికి సోదరి. తండ్రి ప్రభుత్వ దివాన్‌గా పనిచేసేవారు. అచ్చమాంబకు ఆరేళ్ళ వయసు వచ్చేసరికి తండ్రి మరణించారు. మేనమామ భండారు మాధవరావుగారితో పదేళ్ళ వయసులో వివాహం అయింది. పదిహేడవ ఏట కాపురానికి వెళ్లి దాంపత్య జీవితం ప్రారంభించింది.

అచ్చమాంబకు విద్య మీద అమితాసక్తి ఉండేది. కాని భర్త మాధవరావు అందుకు సహకరించలేదు. తమ్ముడు లక్ష్మణరావు సాయంతో అతని దగ్గరే చదివి తెలుగు, హిందీ, ఇంగ్లీషు, మరాఠీ భాషలు నేర్చింది. తమ్ముడు బిలాస్‌పూర్‌లో ఉద్యోగంలో చేరటానికి వెడితే తానే స్వయంగా బెంగాలీ, గుజరాతీ, సంస్కృతంలను అభ్యసించి నేర్చుకొని స్వయం సిద్ధ అనిపించుకొన్నది. అచ్చమాంబ దంపతులకు పుట్టిన ఒక కొడుకు కూతరు అకస్మాత్తుగా మరణించారు. ఆమె శోకం వర్ణనాతీతంగా ఉంది. ఈ దు:ఖం నుండి బయటపడటానికి అయిదుగురు అనాధలను చేరదీసి వారికి వసతి, ఆహారం సమకూర్చి విద్యాబుద్ధులు నేర్పించి తల్లిగా అండగా నిలిచింది. తీరాంధ్రంలోనే మొదటి స్త్రీ సమాజాన్ని ఓరుగంటి సుందరీ రత్నాంబ గారితో కలిసి "బృందావన స్త్రీల సమాజం" పేరిట 1902లో మచిలీపట్నంలో నెలకొల్పింది.

"అబలా సచ్చరిత్ర రత్నమాల" అనే గ్రంథాన్ని అచ్చమాంబ రాసింది. అందులో 1000 ఏళ్ళ కాలంనాటి 34 మంది హిందూ సుందరీమణుల చరిత్రలను మధురంగా వర్ణించింది. ఆమెకు కుట్టుపని, అల్లికలలో మంచి ప్రావీణ్యం ఉండేది. "క్రోషా అల్లిక"పై ఆమె వ్యాసాలను రాసి "హిందూ సుందరి" పత్రికలో ప్రచురించింది.

ఆంధ్రదేశం అంతటా పర్యటించి అనేక ఉత్సాహక ప్రసంగాలు చేసి మహిళోద్యమానికి నాంది పలికి స్త్రీ జనాభ్యుదయానికి వారిని సమాయత్త పరచింది. స్త్రీ జనాభ్యుదయంపై అనేక పత్రికలలో వ్యాసాలు రాసి చైతన్యపరచింది. మహిళా సమాజాలను స్థాపించి సేవలందించింది. రాష్ట్రమంతా తిరిగి అనేక చోట్ల మహిళా సమాజాలను నెలకొల్పింది.

అచ్చమాంబ ఆకాలంలోని అనేక విషయాల పైనా స్త్రీ సమస్యల మీద గొప్ప కథలు రాసి తొలితరం మహిళా రచయితగా గుర్తింపు పొందింది. తెలుగు బ్రిటిష్ మహిళలపై అనేక జీవిత చరిత్రలను రాసి మార్గదర్శనం చేసింది.

అచ్చమాంబ రాసిన "ధన ప్రయోదశి" కథ మనం అందరం మొదటి తెలుగు కథానికగా భావిస్తున్న 1901లో వచ్చిన గురజాడ అప్పారావుగారి ''దిద్దుబాటు'' కథ కంటే ముందు రాసినదేనని అందరూ అంగీకరించి అచ్చమాంబగారి ధన త్రయోదశి కథ మాత్రమే "తొలి ఆధునిక కథ" అని ఎందరెందరో నిక్కచ్చిగా చెప్పారు. ఆమె రచనలలో "బీద కుటుంబం, ఖానా, శతకం" ఉన్నాయి. ఆమె రాసిన "దంపతుల ప్రథమ కలహం, విద్యావంతులగు యువతులకు ఒక విన్నపం, స్త్రీ విద్య ప్రభావం" మొదలైన వ్యాసాలూ హిందూ సుందరి, సరస్వతి పత్రికలలో ప్రచురింపబడినాయి. అచ్చమాంబ "ధన త్రయోదశి" కథ హిందూ సుందరిలో 1902లో ప్రచురితమైంది. బీద, యువ దంపతుల కథ ఇది. దీపావళి దీపాలు కూడా వెలిగించలేని గర్భ దరిద్రం వారిది. భర్త నేరం, కుటిలోపాయం చేసి డబ్బు సంపాదించి దీపావళి జరుపుకొందామని ప్రయత్నం చేస్తే వారించి అతనిని సన్మార్గంలో పెట్టిన సద్గుణ రాశి అయిన యువతి కథ.

సోదరుడు లక్ష్మణరావు సహాయంతో 1901లో అచ్చమాంబ రాసిన "అబలా సచ్చరిత్రమాల"లోని కొన్ని భాగాలు కందుకూరి వీరేశలింగం గారి ప్రముఖ పత్రిక "చింతామణి"లో ప్రచురింపబడ్డాయి. ఆమె రాసిన "ఖనా" ప్రముఖ భారతీయ ఖగోళ గణిత శాస్త్రవేత్త "వరాహ మిహిరుడు" భార్య ఖన కథ. అచ్చమాంబ దేశమంతా పర్యటించి అనేక మంది ప్రసిద్ధులైన విద్యావేత్తలతో పరిచయం సాధించి వారి మొప్పు పొందింది. మహిళోద్యమానికి మద్దతు కూడా గట్టింది. 1905 జనవరి 18న అచ్చమాంబ తన సోదరుడు లక్ష్మణరావు దగ్గర మధ్యప్రదేశ్‌లోని బిలాసపూర్‌లో మరణించింది. ❀



## 3. వాయుసేనలో మొదటి మహిళా మార్షల్ - పద్మావతి బందోపాధ్యాయ

**తి**రుపతిలో జన్మించి మెడిసిన్‌లో డిప్లమా డిఫెన్స్, సైన్స్‌లో ఉన్నత విద్య పొందిన పద్మా గంగోపాధ్యాయ ఏం.డి సాధించింది. ఆర్మేడ్ ఫోర్స్, మెడికల్ సైన్స్‌లో ఉద్యోగం ఆరంభించింది. ఆర్కెటిక్ ఖండం పరిశోధనా బృందంలో పరిశోధన చేసింది. బెంగళూర్ యూనివర్సిటిలో ఏవియేషన్, మెడిసిన్‌లో అసోసియేట్ ప్రొఫెసర్‌గా చేరి అనేక ఉన్నత స్థానాలు పొందింది.

ఏయిరో మెడిసిన్ సొసైటీ ఆఫ్ ఇండియా, ఇంటర్నేషనల్ మెడికల్ సైన్సెస్ అకాడెమి మొదలైన సంస్థలలో గౌరవ సభ్యత్వం పొందింది. న్యూయార్క్ అకాడెమి ఆఫ్ సైన్సెస్ గౌరవ పురస్కార గ్రహీత పద్మ. విశిష్ట సేవా మెడల్, A.F.W.W.A అవార్డును పొందింది. డిఫెన్స్ సర్వీసెస్ స్టాఫ్ కాలేజిలో ఉన్నత విద్యలో ప్రథమ శ్రేణిలో పాస్ అయి ఆర్మీ మెడికల్ కాలేజి సైనిక ఉద్యోగంలో చేరిన మొదటి మహిళ మన పద్మా బందోపాధ్యాయ. 1981లో వాయు సేవా దళంలో విశిష్ట సేవలందించిన ఉద్యోగినిగా అపూర్వ సత్కారం అందుకొంది పద్మ. దేశ విదేశీ ప్రసిద్ధ మెడికల్ జర్నల్స్‌కు పాతిక పైగా పరిశోధనా వ్యాసాలను రాసి ప్రచురించిన విశిష్ట మహిళా శాస్త్రజ్ఞురాలు పద్మ.

### కీర్తి శిఖరాలు

1971లో ఇండియా - పాకిస్తాన్ యుద్ధంలో ధైర్య సాహసాలతో సేవలందించినందుకు పద్మకు విశిష్ట సేవా పథకం ఇచ్చి ప్రభుత్వం గౌరవించింది.

భారతీయ ఏయిరో స్పేస్ సొసైటీ మొదటి ఉమన్ ఫెలోగా గౌరవం పొందింది. ఉత్తర ధ్రువ ప్రాంతంలో పరిశోధనలు నిర్వహించిన తొలి మహిళగా పద్మ గుర్తింపు పొందింది. డిఫెన్స్ సర్వీస్ స్టాఫ్ కాలేజిలో చదివి 1978లో కోర్సు పూర్తి చేసిన తొలి మహిళ పద్మ. సెంట్రల్ మెడికల్ ఎస్టాబ్లిష్మెంటును కమాండ్ చేసింది. భారతీయ వాయుసేనలో పనిచేసే మహిళలలో మొదటిసారిగా ఎయిర్ వైస్ మార్షల్గా పదోన్నతి పొందిన మొదటి మహిళా ఆఫీసర్ పద్మ. ప్రపంచ వాయుసేనలో వైస్ మార్షల్గా పదోన్నతి పొందిన మొదటి మహిళా ఆఫీసర్ పద్మ. ప్రపంచ వాయుసేనలో వైస్ మార్షల్ అయిన తొలి మహిళ పద్మ. ఆర్మడ్ ఫోర్సెస్కు అడిషనల్ డైరెక్టర్ అయి, తర్వాత మెడికల్ బ్రాంచ్లో ఎయిర్ చీఫ్ మార్షల్గా 2004 అక్టోబర్ ఒకటిన ప్రమోషన్ పొంది ప్రపంచంలోనే మొదటి మహిళా ఏర్ మార్షల్గా మహిళా లోకానికి గర్వకారణంగా నిలిచి, మహిళలు రక్షణ సంస్థలోనూ అపూర్వమైన ప్రజ్ఞా పాటవాలను ప్రదర్శించగలరు అని రుజువు చేసింది. తనతో పాటు పనిచేస్తున్న వాయుసేనాధికారి ఎన్.యెన్ బందోపాధ్యాయను వివాహమాడింది.

### జననం – విద్య – డాక్టర్

1944 నవంబర్ నాలుగున పద్మస్వామినాథన్ అలమేలు దంపతులకు కుమార్తెగా పద్మ తిరుపతిలో జన్మించింది. తల్లి తరచుగా జబ్బుపడి హాస్పిటల్ పాలై అక్కడే జీవితకాలమంతా గడపటం చూసి డాక్టర్ కావాలని, తన అమ్మ లాంటి వారికి సేవ చేయాలనే కోరిక బలంగా కలిగింది. ఢిల్లీలో కిరణ్ మాలి కాలేజిలో ప్రి మెడికల్ చదివింది. పూనాలో మెడికల్ కాలేజి ఏర్పడినప్పుడు దానికి ప్రవేశ పరీక్ష రాసిన మొదటి బాచ్ అమ్మాయిగా గుర్తింపు పొందింది. అంత దూరం పంపి హాస్టల్లో చేర్చి అయిదేళ్ళు చదివించటం తలిదండ్రులకు ఇష్టం లేకపోవటంతో చేరలేదు. కాని బి బాచ్లో చేరటానికి వారిని ఒప్పించి A.F.M.C లో చేరింది. మెడిసిన్లో చదివేటప్పుడు అనేక మెడల్స్, ప్రైజులూ, నగదు బహుమతులు పొంది మొదటి స్థానంలో అన్నిటా నిలబడింది.

### వాయుసేనలో సేవ – అన్నిటా ప్రథమ స్థానం

వాయుసేనలో చేరాలని నిర్ణయిస్తే ఆమెకు బెంగళూర్ ఎయిర్ ఫోర్స్ హాస్పిటల్‌లో ఇంటర్నీగా వుద్యోగం వచ్చింది. ఆర్మ్‌డ్ ఫోర్స్ మెడికల్ కాలేజిలో చేరి 1968లో ఐ.ఏ.ఎఫ్‌లో కమీషన్ అయింది. కంటిచూపు మందగించటం వలన పైలెట్‌గా సేవ కుదరదని వైద్య సేవకే ప్రాధాన్యతనిచ్చింది. 1975లో కొత్తగా వచ్చిన ఏవియేషన్ మెడిసిన్‌కు ప్రాధాన్యతగా ఎంచుకొంది. 23 రిసెర్చ్ పేపర్లు 27 ప్రచురణలతో అగ్రగామి మహిళగా నిలబడింది. మొదటి మహిళా ఏవియేషన్ మెడిసిన్ స్పెషలిస్ట్‌గా పద్మ నిలిచింది. స్క్వాడ్రన్ లీడర్ పద్మ డిఫెన్స్ ఫిజియాలజీ అండ్ అల్లైడ్ సైన్సెస్‌లో వింగ్ కమాండర్ అయి హై ఆల్టిట్యూడ్ ఏవియేషన్‌లో తూర్పు పశ్చిమ హిమాలయాలలో అద్భుత పరిశోధనలు చేసింది. అంత ఎత్తున పని చేసే సైనికులకు వచ్చే జబ్బుల నివారణకు ఆలోచించింది. భారత రాష్ట్రపతికి మొదటి మహిళా ఆనరరి డాక్టర్‌గా నియమింపబడి అన్నిటా ముందు నిల్చింది పద్మావతీ బందోపాధ్యాయ.

ఇంటర్నేషనల్ మెడికల్ సొసైటీకి న్యూయార్క్ ఎకాడమి ఆఫ్ సైన్సెస్‌కు ఇండియన్ సొసైటీ ఆఫ్ ఏయిరో స్పేస్ మెడిసిన్స్‌లో సభ్యురాలైంది. 1989 నవంబర్ నుండి నాలుగు నెలలు ఉత్తర ధ్రువ ప్రాంతంలో ఉష్ణమండల వాసులు ఉండటానికి అనుకూలించే పరిస్తితులపై రష్యన్ ఫిజిలాలజి ప్రయోగంలో పనిచేసింది. ఈ పనిలో పాల్గొన్న మొదటి భారతీయ మహిళ పద్మ. దీనికిగాను పద్మకు అత్యున్నతమైన ఇందిరా ప్రియదర్శిని అవార్డ్‌ను ప్రభుత్వం అందించి సత్కరించింది. ఎయిర్ ఫోర్స్ వైవ్స్ వెల్ఫేర్ సొసైటీ పురస్కారమూ పొందింది. గ్రూప్ కెప్టెన్‌గా ప్రమోషన్ పొంది పశ్చిమ కమాండ్‌లో డిప్యూటీ ప్రిన్సిపల్ మెడికల్ ఆఫీసర్ అయింది. కార్గిల్ యుద్ధంలో వాయు సైనికుల వైద్య అవసరాలను పర్యవేక్షించింది. 2006 జూన్ 26న భారత వాయుసేన మొదటి మహిళా కమాండర్ అయి రికార్డు సృష్టించింది. ఎయిర్ ఫోర్స్ మెడికల్ యూనిట్ కమాండర్‌గా గొప్ప సేవ చేసింది. దీనికే 2002 జనవరి 26న ప్రభుత్వం చేత విశిష్ట సేవా పతాకాన్ని పొందింది. సాహసానికి, అంకిత భావానికి, సేవకూ మార్గదర్శిగా నిలిచిన మహిళా మాణిక్యం పద్మావతీ బందోపాధ్యాయ. ❀



## 4. అమ్మకు నిర్వచనం జిల్లెళ్ళమూడి అమ్మ

**"నీ** పిల్లల్లో ఏమి చూస్తున్నావో అందరిలో దానినే చూడటం బ్రహ్మస్థితి పొందటమే. తిథులు విధిని మార్చలేవు. పెట్టింది కాదు, జరిగేదే ముహూర్తం. మానవుడి నడక నవగ్రహాల మీద ఆధారపడిలేదు, రాగ ద్వేషాలు అనే రెండే రెండు గ్రహాలమీదే. జీవితం సమస్యల తోరణం, సమస్యలతో రణం. వైకల్యం లేనిదే కైవల్యం రాదు, తృప్తే ముక్తి. దిగులే జిజ్ఞాస, తపనే తపస్సు. వర్గం లేనిదే స్వర్గం, విశ్వాసం, కర్తవ్యమే భగవంతుడు. విధి వర్షం లాంటిది. కొందరికి అనుకూలం, కొందరికి ప్రతికూలం. ప్రేరణే దైవం. సర్వత్రా అనురాగమే విరాగం. నేను అమ్మను, మీరు నా బిడ్డలు" ఇవీ అందరికి అమ్మ, అమ్మకి నిర్వచనం అయిన జిల్లెళ్ళమూడి అమ్మ అభిభాషణం. చిన్న చిన్న మాటలలో ఎంత జీవిత పరమార్థాన్ని, కర్తవ్యాన్ని బోధించిందో? సకల వేదోపనిషత్తుల సారం అంతా వీటిలోనే ఉంది. ఆప్యాయతకూ, ఆత్మీయతకు, ఆదరణకు అమ్మ మారుపేరై నిలిచింది. జిల్లెళ్ళమూడి అమ్మగానే అందరికి తెలుసు. అమ్మ జీవిత విశేషాలను తెలుసుకొందాం.

### బాల్యం - వివాహం

అమ్మ గుంటూరు జిల్లా పొన్నూరుకు దగ్గరలోని మన్నవ గ్రామంలో 28-03-1923 ఆ ఊరి కరణం మన్నవ సీతాపతి శర్మ, రంగమ్మలకు జన్మించింది. అనసూయమ్మగా నామకరణం చేశారు. పసితనం గొల్ల నాగమ్మ పెంపకంలో గడిచింది. చిన్నప్పటి నుంచే అమ్మ అనేక మహిమలు చూపి అందరికి ఆశ్చర్యం కలిగించింది. తల్లి రంగమ్మ చనిపోతే అందరూ ఏడుస్తుంటే ఏడవ వద్దని అమ్మ దేవుడి దగ్గరికే వెళ్లిందని ఓదార్చింది.

ఒకసారి బాపట్ల భావనారాయణ స్వామి గుడికి వెడితే పూజారి గమనించకుండా గుడి తలుపులు మూసేసి వెళ్ళిపోగా అక్కడే విచికిత్స చేసి అన్నిటికీ ఆధారం భూమి కనుక భూమి పూజ చేయాలని చెప్పింది. మర్నాడు ఉదయం పూజారి వచ్చి గుడి తలుపులు తెరవగానే అమ్మ రాజ్యలక్ష్మి అమ్మవారుగా దర్శనమిచ్చింది. మరోసారి ఒక పోలీసు ఉద్యోగి అమ్మ మెడలోని పులిగోరు తీసుకోవటానికి ప్రయత్నిస్తే అమ్మ తీసి ఇచ్చింది. అతను ఆశ్చర్యపడి మళ్ళీ భక్తితో అమ్మ మెడకు అలంకరించి నమస్కరించి వెళ్లిపోయాడు. అమ్మపై అందరికీ అనంత విశ్వాసం కలిగింది. ఆమెను సర్వ దేవతా స్వరూపిణిగా భావించారు. పదమూడవ ఏట అమ్మకు మేనత్త కనకమ్మగారి పెద్ద కొడుకు బ్రహ్మాండం నాగేశ్వరరావుతో 05-05-1936న బాపట్లలో వివాహం చేశారు. కాపురం బాపట్లలో పెట్టారు. నాలుగేళ్ల తర్వాత 1940లో జిల్లెళ్ళమూడికి ఆ దంపతులు చేరి అక్కడ కాపురమున్నారు. ఆ గ్రామానికి ప్రయాణ సౌకర్యమే లేదు. వారి పెద్దకొడుకు సుబ్బారావు గ్రామ సర్పంచ్ అయిన తర్వాతే 1966లో రోడ్డు వేశారు.

## ధార్మిక కార్యక్రమాలు

1950 నడివేసవిలో ఒక సన్యాసి ఆకలితో అలమటిస్తూ నడిచి సోలిపోతుంటే అమ్మ చూసి ఇంటికి పిలిచి ఆతిథ్యం స్వీకరించమని కోరింది. ఆ ఊళ్ళో దేవాలయం లేదు కనుక తాను భిక్ష స్వీకరించనని చెప్పగా అమ్మ మనసు తల్లడిల్లి ఒక దేవాలయం, స్వంత సత్రం ఏర్పాటు చేయాలని భావించింది. ఊరి వారందరి సహకారం కోరుతూ ఎవరికీ ఇబ్బంది కలుగకుండా రోజుకు "పిడికెడు బియ్యం పథకం" ఏర్పాటు చేసింది. ప్రతి ఇంటివారు దాన్ని సేకరించి అందజేసేవారు వాటిని భద్రం చేసి అందులో కొంత భాగం దేవాలయ నిర్మాణానికి ఉపయోగించటం ఆమె ఆలోచన. కొద్దికాలంలోనే ఇది అద్భుత విజయం సాధించింది. ''పిడికెడు బియ్యం'' అనేది మంత్రంలా పనిచేసింది. 1958 ఆగస్ట్ పదిహేనున "అన్నపూర్ణాలయం"కు ప్రారంభోత్సవం చేసింది. ఆ సత్రంలో భోజనం చేయటానికి ఆకలే అర్హత. అర్హత వేషధారణ బట్టి కాకుండా ఆకలిని బట్టే అన్నం పెట్టింది. అన్ని బాధల కంటే ఆకలి బాధే ఎక్కువ అనేది అమ్మ, సమాజంలోని అన్ని వర్గాలవారు అన్నిరకాల వారు అమ్మ చేతి అన్నపూర్ణ ప్రసాదాన్ని అమ్రుతోపమానంగా ఆరగించారు. అమ్మ తన ఇంటిని "అందరి ఇల్లు" అని పేరు పెట్టింది.

బాపట్ల కుష్టు ఆస్పత్రి రోగులకు అరటిపళ్ళు. పరవాన్నం, పులిహోరా పంపేది అమ్మ. అందరినీ సమానంగా చూడటమే అమ్మ మనసు. ఒక జ్యోతిష్యుడు వచ్చి ఏదైనా ప్రశ్న అడగమంటే "సృష్టిలో ఏ ప్రాణీ ఆకలితో బాధపడకుండా ఉండే రోజు ఎప్పుడొస్తుందో చెప్పండి?" అని అడిగి ఆయన్ను అప్రతిభుడిని చేసింది. అదే అతిలోక మాతృత్వం. అది అమ్మకే సాధ్యం. అన్నంతో బాటు బట్టలనూ అందరికీ అందించేది. జిల్లెళ్ళమూడి వచ్చిన

ప్రతివారు అమ్మ ప్రసాదం తినకుండా, అమ్మ ఇచ్చిన వస్త్రాలను పొందకుండా వెళ్ళిన వాళ్ళు లేనేలేరు. మరోసారి వాసుదేవ స్వామి అనే వైష్ణవ స్వామి వద్దకు అమ్మ వెళ్ళగా తల్లిలేని పిల్ల అని తెలిసి అందరూ తనను ప్రేమించేట్లు చేయనా అని అడిగాడు. అమ్మ "అందరూ నన్ను ప్రేమించినా, ద్వేషించినా నేను అందర్నీ ప్రేమించేట్లు ఆశీర్వదించండి" అని కోరి తన నడివడికి ఒక దివ్య మార్గాన్ని ఎన్నుకొన్నది అమ్మ.

## సంస్కృత పాఠశాల – విద్యాలయం – హైమాలయం – ఆదరణాలయం

ప్రేమమయ వాతావరణంలో ఉండేట్లు అందరినీ చేసింది అమ్మ. అందరూ అక్కా చెల్లి, అన్నా తమ్ముడుగానే అక్కడ మెలగటం విశేషం. అమ్మ సన్నిధి దైవ సన్నిదే వారికి. 1971లో సంస్కృత పాఠశాల, కళాశాలను అమ్మ నెలకొల్పి మన సంస్కృతీ, సంప్రదాయ వ్యాప్తికి ముందడుగు వేసింది. అక్కడ చదివే ప్రతివారికి ఉచిత వసతి, భోజన సౌకర్యాలు కలిగించి ఆదర్శ ప్రాయమైనది. 1978 రోగార్తుల కోసం ఒక ఉచిత విద్యాలయాన్ని స్థాపించి సేవలందించింది. అప్పటికే ఉన్న ఆయుర్వేద విశ్వవిద్యాలయానికి తోడుగా హోమియో వైద్యశాల, అల్లోపతి వైద్యశాల ఏర్పరచింది. తన కుమార్తె హైమలో అందరిలో మానవత్వాన్ని, అనుబంధాన్ని, అనురాగాన్నీ పెంపొందించే తలంపుతో పెంచింది. ప్రసిద్ధ జర్నలిస్టు శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు హైమను చూసి హైమలో దేవతా స్వరూపం కనిపిస్తోంది అని కొనియాడారు. అమ్మ తన దగ్గరకు వచ్చే రోగుల్ని హైమ వద్దకు పంపేది. ఆమె వారి పాలిట కల్పవృక్షం, కామధేనువుగా బాధలు నివారించేది. పదవీ విరమణ చేసిన వారికి, జబ్బుతో బాధపడుతూ ఎవరూ పట్టించుకోని వారికి అండగా "ఆదరణాలయం" ఏర్పరచి వారి పాలిటి దీనబంధువే అయింది అమ్మ.

## ప్రచురణలు – సినిమాలు

మాతృశ్రీ పబ్లికేషన్ ట్రస్ట్‌ను 1966లో ప్రారంభించి సంస్కృతాంధ్ర హిందీ, ఒరియా భాషలలో వందకు పైగా ప్రచురించి అమ్మ సాహిత్యాన్ని ప్రపంచమంతా పంచిబెడుతున్నారు. 1971లో "విశ్వజననీ పరిషత్"ను ఏర్పరచారు. అమ్మపై అడపా రామకృష్ణారావు గారు మొదటిగా కొన్ని స్లైడులు తయారు చేశారు. తర్వాత అరగంట డాక్యుమెంటరీ చిత్రం అమ్మపై వచ్చింది. పదిహేను రీళ్లలో జిల్లెళ్ళమూడిలో జరిగే అన్ని కార్యక్రమాలను, అమ్మ పర్యటనలు స్వర్ణోత్సవ వేడుకలు అన్నీ చిత్రీకరించి శ్రీ కొండముది రామక్రిష్ణ స్క్రిప్ట్ రాయగా ప్రముఖ నటుడు పి.జే.శర్మ కామెంటరి చెప్పాడు, సూక్తులతో మరో కామెంటరీ ఫిలిం తయారైంది. అమ్మ జీవితంపై "మాతృశ్రీ జీవితం – సాహిత్యం – సౌందర్యం సర్వస్వం" పేరుతో డాక్టర్ బి.ఎల్.సుగుణ తెలుగు విశ్వవిద్యాలయంలో పరిశోధన చేసి "మాతృ శ్రీ తత్వ సౌరభం" పేర ముద్రించారు.

## అమ్మ మహాప్రస్థానం

విశలమైన నుదురు భ్రుకుటిపై పెద్ద యెర్ర కుంకుమ బొట్టు, ముక్కుకు ముక్కెర, చేతుల నిండా గాజులు, ఒంటినిండా చీర కొంగు కప్పుకొని, చిరునవ్వుతో ఆప్యాయంగా "రారా నా కన్నా, రా అమ్మా" అని ఆప్యాయంగా పిలుస్తున్నట్లు చేతులు చాపి అపర అన్నపూర్ణా దేవిలాగా సాక్షాత్కరించేది అమ్మ అనసూయమ్మ. చూడగానే భక్తి ప్రపత్తులతో ప్రణమిల్లాలనే ఆలోచన మనసులో వచ్చి నిండు హృదయంతో నమస్కరిస్తారు. ఆ సంస్కారం, ప్రేమ, ఆదరణ అమ్మదనంలో ఉన్న కమ్మదనం అమ్మలోనే అందరూ దర్శించేవారు. అమ్మపై ఆరాధన ఉన్నవారి కోసం హైమాలయం అనసూయేశ్వరాలయం ఏర్పడ్డాయి, పరిస్థితులకు మించిన గురువు లేదు అన్న అమ్మకు గురువులే లేరు. 1958 మాఘ పౌర్ణమి నాడు నల్లమడ వాగు అనే ఓంకార నదిలో అసంఖ్యాక భక్తులకు అమ్మ దేశిరాజు రాజమ్మగారి అభ్యర్థన మేరకు మంత్రోపదేశం చేసి చిరస్మరణీయురాలైంది. 16-02-1981 అమ్మ భర్త, అందరికి "నాన్నగారు" అయిన నాగేశ్వరరావుగారు మరణించారు. 1973లో అమ్మ యాభై ఏళ్ళ స్వర్ణోత్సవం సమయంలో ఒకే పంక్తిలో అక్షమందికి భోజనం పెట్టింది అమ్మ. మిగిలిన పదార్థాలను పశు పక్ష్యాదులకు, జలచరాలకు పెట్టించింది. వజ్రోత్సవం నాడు పశువులకు పూజ చేయించింది. అమ్మ ఆరోగ్యం క్రమంగా క్షీణించింది. ఎందరో వైద్యులు అమ్మ ఆరోగ్యాన్ని కాపాడే ప్రయత్నం చేసినా ఫలించలేదు. అమ్మకు భ్రుకుటీ భేదం, సహస్రార భేదం జరిగింది. తల నుండి భ్రుకుటి నుండి రక్తం చిమ్మి త్రుటిలో భస్మంగా మారిపోవటం జరిగి అందరికి ఆశ్చర్యం కలిగించింది. అమ్మను "యోగ పరాకాష్ట స్తితి పొందిన జగన్మాత"గా కొమర్రాజు లక్ష్మీకాంత యోగి, కాంతయ్య యోగి వర్ణించారు. 12-07-1985లో అరవై మూడవ ఏట అమ్మ జగదమ్మలో కలిసిపోయింది. 05-05-1987 అమ్మ కళ్యాణ దినోత్సవం రోజున అమ్మ విగ్రహ ప్రతిష్టాపన జరిగింది.

అమ్మను జీవితకాలంలో సందర్శించిన ప్రముఖులలో రఘువరదాసు, ఆత్మానంద స్వామి లక్ష్మణ యతీంద్రులు, నరసింహ యోగి, ప్రభాకర ఉమా మహేశ్వర పండిట్, కుర్తాలం పీఠాధిపతి శివ సదానంద భారతీస్వామి, ప్రసాద రాయ కులపతి, కరుణశ్రీ, జటానల్లభుల పురుషోత్తం, జమ్మలమడక మాధవ రామశర్మ, ఎక్కిరాల కృష్ణమాచార్య, పుట్టపర్తి నారాయణాచార్యులు, పళ్ళే పూర్ణ ప్రజ్ఞాచార్యులు, దువ్వూరి వెంకట రమణ శాస్త్రిగారు వంటివారెందరో ఉన్నారు. ముప్ఫైకి పైగా తెలుగులోనూ అయిదు ఆంగ్లంలోను అమ్మపై పుస్తకాలను మాతృశ్రీ పబ్లికేషన్స్ ప్రచురించి అమ్మ భావవ్యాప్తికి దీప్తి కల్గిస్తోంది. ❁



## 5. నిర్భయ మలాలా

**మ**లాలా యూసఫ్ జా 1997 జూలై పన్నెండున పాకిస్తాన్‌లో జన్మించింది. స్త్రీ విద్యా వ్యాప్తికి కృషి చేసింది. తాలిబన్లు స్త్రీ విద్యను నిషేధించారు. పన్నెండేళ్ళ వయసులోనే ఇంటర్నెట్‌లో బ్లాగ్‌లో తాలిబన్ల నిరంకుశ ధోరణులను ఎండగడుతూ మారుపేరుతో ఆర్టికల్స్ రాసింది. మహిళా విద్యాహక్కులపై ఎన్నో విషయాలను తన మనోభావాలను ఆ బ్లాగ్‌లో రాసేది. ఆమె ధైర్య సాహసాలకు మెచ్చిన న్యుయార్క్ టైమ్స్ ఆమెపై డాక్యుమెంటరీ తీస్తుండగా సైన్యం అడ్డుపడింది. అనేక ఇంటర్వ్యూలు, టి.వి.ప్రోగ్రాములు ఇచ్చి నిర్భయంగా మహిళా సాధికారతను ప్రచారం చేసింది. ఆమెకు ఇంటర్నేషనల్ చైల్డ్ పీస్ ప్రైజ్ దక్షిణాఫ్రికా నాయకుడు డెస్మాండ్ టూటూ ప్రదానం చేశాడు.

2012 అక్టోబర్ తొమ్మిదిన మలాలా స్కూల్‌కు బయల్దేరింది. ఆమె కోసమే ముందస్తు ప్లాన్ ప్రకారం ఎదురు చూస్తున్న గన్‌మాన్ ఆమెపై మూడు రౌండ్లు తుపాకితో కాల్చాడు. ఒక బులెట్ ఆమె నుదుటి ఎడమ భాగానికి తాకింది. అది భుజంలోకి దూసుకు వెళ్ళింది. వెంటనే ఆమె స్పృహ కోల్పోయింది. ఆమెను ఇంగ్లాండ్‌లోని బెర్మింగ్ హోంలో ఉన్న క్వీన్ ఎలిజబెత్ హాస్పిటల్‌కు చేర్చారు. ఆమెకు అన్నిరకాల పునరావాస సౌకర్యాలు కల్పించారు. పాకిస్తాన్‌లోని ఇస్లామిక్

మత సంస్థలన్నీ మలాలాపై తాలిబన్ల దాడిని గర్హిస్తూ ఫత్వా జారీ చేశాయి. ఇవేమీ పట్టించుకోకుండా తాలిబన్లు ఆమెను, ఆమె తండ్రిని చంపేస్తామని ప్రకటించారు.

మలాలాపై జరిగిన అమానుషమైన దాడిని ప్రపంచం అంతా తీవ్రంగా ఖండించి ఆమెకు బాసలగా నిలిచింది. యునైటెడ్ నేషన్స్‌కు చెందిన గ్లోబల్ ఎడ్యుకేషన్‌కు ప్రత్యేక అధికారి అయిన గార్డన్ బ్రౌన్ మలాలా పేర "ఐ యాం మలాలా" అనే పేర ఒక పిటీషన్‌ను యుయెస్‌లో దాఖలు చేసి ప్రపంచవ్యాప్తంగా ఉన్న బాల బాలికలందరికి విద్యా సౌకర్యం కలిగించాలని కోరాడు. దీనితో పాకిస్తాన్‌లో విద్యాహక్కు పిల్లలకు లభించింది. ఇది మలాలా మహిమే. టైం మేగజైన్ ఆమె ముఖచిత్రంతో ఒక ప్రత్యేక సంచిక వెలువరించి ఆమె సాహసాన్ని దీక్షను కొనియాడుతూ "హండ్రెడ్ ఇన్ఫ్లయెంషియల్ పీపుల్ ఇన్ ది వరల్డ్" పేరిట ప్రత్యేక వ్యాసం వెలువరించి గౌరవం కల్పించింది. పాకిస్తాన్ మొదటి "నేషనల్ యూత్ పీస్ ప్రైజ్"ను మలాలాకు ఇచ్చి గౌరవించింది. 2013 నోబెల్ శాంతి పురస్కారానికి ఆమె నామినేట్ అయింది. అయితే అది రాలేదు కానీ పదహారేళ్ళ అతి పిన్న వయసులో నామినేట్ అయిన యువతిగా ఆమె చరిత్ర సృష్టించింది. 2013 బర్మింగ్ హాం లైబ్రరీని మలాలా స్తాపించింది. సఖరోవ్ బహుమతిని పొందింది. 2013లో మలాలా అనే యూసఫ్ జాకు కెనడా గౌరవ పౌరసత్వాన్ని ప్రదానం చేసింది. అది ఒక అరుదైన విశిష్టమైన గౌరవం. అతి పిన్న వయసులో ఇన్ని అద్భుతాలు సాధించిన మలాలా అందరికి ఆదర్శం అయింది. ఆఫ్ఘనిస్తాన్‌లో పుట్టిన మహా మహిళా మాణిక్యం మలాలా. తండ్రి వృద్ధమలామా కాబోయే భర్త లో బ్రిటిష్‌వారితో జరిగిన యుద్ధంలో వీరు ఓడిపోతుంటే మహిళలందర్నీ సమాయత్త పరచి యుద్ధరంగానికి తరల్చి వారిని ఉత్సాహపరిచింది. "ఈ యుద్ధంలో మీరు అమరవీరులు కాకపోతే మీ జీవితాలు వ్యర్థం" అని ఉద్రేకపరిచింది. వారిద్దరు బ్రిటిష్ సైన్యాల చేతిలో వీర మరణం పొందారు. బ్రిటిష్ సైనికులు తమ గ్రామానికి చెందిన యువతిని చంపితే, వారందర్ని ఆఫ్ఘన్లు హతమార్చారు. అదొక సంఘటన. ఆ మలామా పేరే ఈ మలామాకు పెట్టారు. అదే స్ఫూర్తితో, ధైర్యంతో ఈ మలామా దూసుకుపోతోంది. ❁



## 6. మొదటితరం ఆసియా మహిళా డాక్టర్ కాదంబినీ గంగూలి

**బ్రి**టిష్ ప్రభుత్వకాలంలో మొదటి తరం మహిళా పట్టభద్రురాలే కాక పాశ్చాత్య, వైద్య శాస్త్రంలో శిక్షణ పొందిన మొదటితరం డాక్టర్ శ్రీమతి కాదంబినీ గంగూలీ. 1861 జులై 18న బీహార్‌లోని భాగల్పూర్‌లో బ్రహ్మ సమాజ మతస్తుడు వ్రజ కిషోర్ బసుకు కుమార్తెగా జన్మించింది. తండ్రి హెడ్ మాస్టర్‌గా పనిచేసేవాడు. భాగల్పూర్‌లో మహిళా విమోచనోద్యమాన్ని అభయ చరణ్ మాలిక్‌తో కలిసి నడిపినవాడు. భారతదేశంలోనే మొదటి మహిళా సమాజాన్ని భాగల్‌పూర్‌లో 1863లోనే స్థాపించిన ఆదర్శ పురుషుడు.

కాదంబిని ప్రాథమిక విద్య వంగ మహిళా విద్యాలయంలో ప్రారంభమైంది. 1878లో అక్కడ బెతూన్ స్కూల్ ఏర్పడింది. ఈ స్కూల్ నుండి కలకత్తా విశ్వవిద్యాలయంలో ప్రవేశ పరీక్ష రాసిన తొలి మహిళగా కాదంబినీ గుర్తింపు పొందింది. ఆమె ప్రయత్న ఫలితంగా బెతూన్ కాలేజి ఇంటర్ కోర్సును, తర్వాతా డిగ్రీ కోర్సును 1883 ప్రారంభించటం విశేషం. బెతూన్ కాలేజి నుండి కాదంబినీ, చంద్రముఖి బసులు మొదటిసారిగా డిగ్రీ సాధించి రికార్డ్ నెలకొల్పారు. దీనితో బ్రిటిష్ ప్రభుత్వకాలంలో మొట్టమొదట డిగ్రీ పొందిన భారతీయ మహిళలుగా చరిత్ర సృష్టించారు.

కాదంబినీ కలకత్తా మెడికల్ కాలేజిలో చేరి మెడిసిన్ పూర్తి చేసింది. 1886లో బెంగాల్ మెడికల్ కాలేజి డిగ్రీని పొందింది. ఈ ఘన విజయాన్ని అప్పుడు సాధించినవారు ఇద్దరే ఇద్దరు మహిళలు. ఒకరు కాదంబినీ, రెండవవారు

ఆనంది గోపాల్ జోషి. పాశ్చాత్య, వైద్య శాస్త్ర అభ్యాసానికి అనుమతి సాధించిన వీరిద్దరూ గర్వకారణమైనారు. 1881లో అబలా బోస్ అనే ఆమె కూడా ప్రవేశ పరీక్ష పాస్ అయినా మెడికల్ కాలేజిలో ప్రవేశం లభించకపోవటం వలన మద్రాస్ వెళ్లి అక్కడ చేరినా మెడిసిన్ పూర్తి చేయలేకపోవటం విచారకరమైన విషయం. మొదట్లో ఉపాధ్యాయుల నుంచి, చాందస భావాల మనుష్యుల నుంచి కాదంబినికి అడ్డంకులేర్పడినా క్రమంగా ఆమె అచంచల విశ్వాసం, దీక్షలతో అధిగమించి పురోగమించింది. 1882లో ఇంగ్లాండ్ వెళ్లి అక్కడ ఎడింబర్గ్‌లో L.R.C.P. ను, గ్లాస్కోలో L.R.C.S. ను, డబ్లిన్ నుండి G.F.P.S. ను సాధించింది. లేడి డఫ్రిన్ ఆస్పత్రిలో కొద్దికాలం విద్యాసేవలందించి తర్వాత స్వంతంగా ప్రాక్టిస్ మొదలుపెట్టింది.

సంఘ సంస్కర్త, స్త్రీ విముక్తి ఉద్యమ నాయకుడు బ్రహ్మసమాజ అనుచరుడు అయిన ద్వారకా గంగూలీని కాదంబినీ 1883లో వివాహమాడింది. తూర్పు భారతంలోని బొగ్గుగని కార్మికుల జీవన పరిస్తితులు మెరుగుపరచటానికి, మహిళా విముక్తి సాధనకూ ఈ దంపతులు చిరస్మరణీయమైన సేవలు చేసి గుర్తింపు పొందారు. 1889లో భారత జాతీయ కాంగ్రెస్‌కు హాజరైన ఆరుగురు మహిళలలో కాదంబిని ఒకరు. 1908లో బెంగాల్ విభజన తర్వాత కలకత్తాలో కాదంబిని మహిళా సమావేశాన్ని నిర్వహించింది. దక్షిణాఫ్రికాలోని ట్రాన్స్‌వాల్ కార్మికుల సమ్మెకు సానుభూతిగా కలకత్తాలో సత్యాగ్రహం జరిపింది. వారి సహాయం కోసం ధన సేకరణ చేసింది. ఎనిమిదిమంది పిల్లలకు తల్లి అయిన కాదంబినీ గంగూలీ కుటుంబ బాధ్యతలనూ అతిశ్రద్ధగా నిర్వహించేది. కుట్టుపని అల్లికలలో ఆమె బహు నేర్పరి. అమెరికన్ చరిత్రకారుడు డేవిడ్ కోఫ్ ఈ దంపతుల అన్యోన్య ప్రేమ, సేవాభావం అనితర సాధ్యమైనవి అని రాశాడు. అప్పుడున్న పరిస్తితులను అధిగమించి గంగూలీ దంపతులు సాధించిన విజయాలు అసామాన్యమైనవి. బెంగాలీ స్త్రీల విముక్తి సాధనలో వారిద్దరి కృషి నిరుపమానం. 63 ఏళ్ళ వయసులో 1923లో అక్టోబర్ మూడున కాదంబినీ గంగూలీ కనుమూసింది.❀

**(విహంగ మహిళా వెబ్ మాసపత్రికలో ప్రచురితం)**



## 7. అమెరికా చేరిన మొదటి హిందూ మహిళా డాక్టర్ ఆనందీ బాయ్ జోషి

**కా**దంబినీ గంగూలీతోబాటు మొదటిసారిగా వైద్య పట్టా పొందిన మొదటి తరం మహిళా డాక్టర్ ఆనందీబాయ్ జోషి. అమెరికా చేరిన తొలి హిందూ మహిళా డాక్టర్ కూడా. 1865 మార్చి 31న మహారాష్ట్రలోని పూనాలో జన్మించింది. ఆమెది సంపన్న సాంప్రదాయ బ్రాహ్మణ కుటుంబం. చిన్నతనంలో యమున అని ముద్దుగా పిలిచేవారు. తొమ్మిదవ ఏటనే గోపాల రావుజోషితో కుటుంబంలోని వారు ఆమెకు వివాహం జరిపించారు. వివాహం తర్వాత భర్త యమున పేరును ఆనందిగా మార్చాడు. కళ్యాన్‌లో పోస్టల్ గుమాస్తాగా పనిచేసి ఆలీబేగ్‌కు మారి కలకత్తాకు వెళ్ళాడు. అభ్యుదయ భావాలున్నవాడు అవటంతో భార్యను అన్నివిధాలా ప్రోత్సహించాడు. స్త్రీకి విద్య అవసరం అని భావించేవాడు. ఆకాలంలో అందరూ సంస్కృతాన్ని చదివితే గోపాలరావు ఇంగ్లీష్ ప్రాధాన్యతను గుర్తించి, ఆనందికి ఉన్న అభిరుచిని తెలుసుకొని ఆమె ఆంగ్ల విద్యాభ్యాసానికి ఎంతో సహకరించాడు.

పద్నాలుగవ ఏటనే ఒక మగపిల్లవాడికి జన్మనిచ్చింది. అవసరమైన మందులు లభ్యం కానందున పది రోజులకే ఆ పసివాడు చనిపోయాడు. ఈ సంఘటనతో ఆమెకు డాక్టర్ అవాలనే బలమైన కోరిక కలిగింది. ఆమె అభిలాషను తెలియజేస్తూ అమెరికాలోని

ప్రసిద్ధ మిషనరీ రాయల్ వైల్డర్‌కు జాబు రాశాడు. క్రిస్టియన్ మతం తీసుకొంటే తప్పక సహాయం చేస్తానని ఆయన జవాబు రాశాడు. ఇది దంపతులకు ఏమాత్రమూ ఇష్టంలేదు. వైల్డర్ తన పత్రికలో వీరితో జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలను ప్రచురించేవాడు. దీన్ని న్యూ జెర్సీలోని రోసేల్లాలో ఉండే థియోడికా కార్పెంటర్ చదవటం జరిగింది. భర్త జోషి భార్య ఆనందికి మెడిసిన్ చదవటానికి ఇస్తున్న ప్రోత్సాహం చదివి కార్పెంటర్ అబ్బురపడి ఆమె అమెరికా వస్తే వసతి వగైరా సౌకర్యాలను తాను ఏర్పాటు చేస్తానని జాబు రాయటమూ జరిగిపోయాయి. అనేక జాబుల్లో భారతీయ సంస్కృతీ సంప్రదాయాలను ఆనంది థియోడికాకు తెలియజేసింది.

ఇది ఇలా ఉండగా జోషి దంపతులు కలకత్తాలో ఉండగా ఆనంది ఆరోగ్యం క్షీణించింది. తరచుగా తలనొప్పి, అలసట, బలహీనత, జ్వరంతో బాధపడింది. ఇది తెలుసుకొన్న థియోడికా ఆమెకు తగిన మందులను అమెరికా నుండి పంపినా, ఈమె వాడినా ప్రయోజనమేమీ కనిపించలేదు. ఇంతలో జోషీకి శేరామ్పూర్ బదిలీ అయింది. ఆమె ఒత్తిడికి లోనైంది. ఇక తప్పదని అనారోగ్యంగా ఉన్నా, భార్యను అమెరికాలో మెడిసిన్ చదవటానికి పంపాలని నిర్ణయించాడు. ఉన్నత విద్య నేర్చి అందరికి ఆదర్శప్రాయంగా ఉండాలని హితవు చెప్పాడు. తార్ బారన్ అనే డాక్టర్ దంపతులు ఆనందిని పెన్సిల్వేనియా వుమెన్స్ మెడికల్ కాలేజికి అప్లికేషన్ పంపమని సలహా నిచ్చారు. ఆనంది అమెరికాలో చదవటానికి వెళ్తోందని తెలుసుకొన్న హిందూ చాందస వాదులు ఆమెపై నిషేధం విధించారు. చాలామంది ఆమెనే బలపరిస్తే కొద్దిమంది ఆమె క్రైస్తవ మతం తీసుకోవటం మంచిది అని అన్నారు.

సేరామ్పూర్ కాలేజి హాల్‌లో ఆనంది అందరిని సమావేశపరచి తను మెడిసిన్ చదివే ఉద్దేశ్యాన్ని దానికోసం అమెరికా వెళ్ళబోతున్న విషయాన్ని తెలియజేసింది. భారతదేశంలో హిందూ డాక్టర్లు లేరని, ఆ కొరత తీర్చటానికే తాను వెళ్ళదలచుకొన్నానని, ఇండియాలో ఒక మహిళా వైద్య కళాశాలను స్థాపించే ఆలోచన తనకు ఉందని విస్పష్టంగా చెప్పింది. తాను క్రైస్తవ మతాన్ని తీసుకోనని నిర్ద్వంద్వంగా ప్రకటించింది. ఆమె ఉపన్యాసం విన్నవారంతా ఎంతో మెచ్చి స్పందించి డబ్బులు విరాళాలుగా అక్కడికక్కడే ప్రకటించి అందించి ఆమె ఆశకు ఉద్దీపన కల్గించారు. ఆనాటి వైస్ రాయ్ ఆమె ఉన్నత విద్యాభ్యాసం కోసం రెండు వందల రూపాయలు విరాళంగా అందించాడు.

కలకత్తా నుండి న్యూయార్క్‌కు చాపరాన్ అనే నౌకలో ఆనంది ప్రయాణం చేసింది. తార్ బరాన్‌కు పరిచయం ఉన్న ఇద్దరు మహిళలు ఆమెతో ప్రయాణం చేయటం ఊరటగా ఉంది. 1883 జూన్‌లో థియోడికా కార్పెంటర్ ఆనందిని న్యూయార్క్‌లో కలిసి స్వాగతించింది. వెంటనే పెన్సిల్వేనియా మహిళా వైద్య కళాశాలకు తనను మెడికల్ ప్రోగ్రాంకు

అనుమతించవలసిందని అప్లికేషన్ పంపగా అప్పటి కాలేజి డీన్ రాఖేల్ బ్రాడ్లీ ఆమెను అనుమతించి చేర్చుకోవటంతో ప్రపంచంలోనే మొదటిసారిగా మెడికల్ ప్రోగ్రాంలో పాల్గొన్న మహిళగా చరిత్ర సృష్టించింది ఆనందీ జోషి. పందొమ్మిదవ ఏట వైద్య విద్య చదవటం ప్రారంభించిన ఆనంది అందరి మన్ననలను పొందింది. కాని అమెరికాలో అలవాటుకాని వాతావరణం, అనుకూలంగాలేని ఆహారం వలన క్రమక్రమంగా ఆరోగ్యం క్షీణించి క్షయవ్యాధికి గురైంది. అయినా ధైర్యం సడలనీయకుండా చదివి 1886 మార్చి నెల 11న మెడిసిన్‌లో డిగ్రీ సాధించి, అందరికి ఆదర్శంగా నిలిచింది. భర్త ప్రోత్సాహాన్ని విశ్వాసాన్ని నిలబెట్టింది "Obstestrics in Aryan Hindus" అంటే "ఆర్య హిందూ సమాజంలో మంత్రసానితనం" అనే ప్రత్యేక విషయంపైన థీసిస్ రాసి సమర్పించింది. ఆనంది వైద్య డిగ్రీ ప్రదానోత్సవ సభకు ఎలిజబెత్ రాణి ఆమెకు అభినందన సందేశం పంపటం మరపుకు రాని మహోన్నత విషయం ఆమెకూ, మనకూ మహిళలందరికీ.

సాధించిన విజయంతో ఆనంది జోషి భారతదేశానికి 1886లో తిరిగి వస్తే వేలాదిమంది అభిమానులు ఆమెకు వీరోచిత స్వాగతాన్ని పలికారు. కొల్హాపూర్ రాజ సంస్థానం ఆమెను ఆల్బర్ట్ ఎడ్వర్డ్ హాస్పిటల్‌లో స్త్రీ వార్డ్‌కు ఇంచార్జిగా నియమించి గౌరవించింది. కాని విధి వక్రించి ఆనందీ జోషి మరుసటి ఏడాదే ఇరవై రెండేళ్ళు నిండకుండానే 1887 ఫిబ్రవరి 26ర మరణించింది. ఇంకా ఎంతో సేవ చేయాల్సిన ఆమె జీవితం అకస్మాత్తుగా ముగియటం అభిమానులు జీర్ణించుకోలేకపోయారు. ఆమె మరణానికి భారతదేశం అంతా సంతాపం ప్రకటించింది. ఆమె అస్తికలను అమెరికాలోని ఆమెను అన్ని విధాలా ఆదుకొన్న థియోడికా కార్పెంటర్‌కు పంపగా ఆమె వాటిని ఎంతో భక్తితో, కన్నీటితో న్యూయార్క్‌లో పోకీప్సీ అనే తన కుటుంబ శ్మశాన వాటికలో భద్రపరచినది. ఏ జననాంతర సౌహృదయమో ఇది? ❀



# 8. స్వర్గీయ ఏం.ఎస్.సుబ్బలక్ష్మికి "స్మృతి గీతం"

**త**న గానాన్ని భగవదర్పితం చేసి, స్వరరాగ రంజితంతో ప్రపంచాన్ని పరవశింపజేసి, మధుర, మంజుల గాత్రంతో సమ్మోహనపరచి, భారతదేశానికి సాంస్కృతిక రాయబారిగా నిలిచి "భారత రత్నమైన" సంగీత రత్నం స్వర్గీయ ఏం.ఎస్.సుబ్బులక్ష్మి. ఆమె పరమపదించినా ఆ పద మంజీరాలు వినిపిస్తూనే వున్నాయి. సంగీత రసజ్ఞుల హృదయాలలో శాశ్వతంగా నిలిచిన ఆ సంగీత మహాసామ్రాజ్ఞి మరణించటం జీర్ణించుకోలేని అభిమానులు, ఆమె స్వంత రాష్ట్రంలో కూడా చేయలేని అపూర్వ స్మృతిగీతంను ప్రచురించి, సహృదయ స్పందనను, అభిమానులకు అందించారు. ఇందులో ముఖ్యపాత్రదారి కృష్ణాజిల్లా విస్సన్నపేట వాస్తవ్యుడు, ఆకునూరువారి అల్లుడు, నాగార్జునసాగర్‌లో ఇంజనీరింగ్ డిపార్టు మెంటులో ఆఫీసు Superintendent శ్రీ లకుమా అని పిలువబడే బూదేస్వరరావు. నిన్న సాయంత్రం మా ఇంటికి వచ్చి ఆ పుస్తకాన్ని నాకు ఇచ్చారు. ఆయన మంచి కవి, "రజనీ – కుందుర్తి అవార్డు" గ్రహీత. సుబ్బులక్ష్మి ఫౌండేషన్ స్థాపకులు కూడా. ఆమె 95వ జయంతి జూలైలో వస్తోంది. ఆనాడు సమగ్రమైన సుబ్బులక్ష్మి జీవిత చరిత్రను వెలువరించే పనిలో వున్నట్లు చెప్పారు లకుమను. హార్థికంగా అభినందించాను. అంతేకాదు షహనాయి మాస్ట్రో, "భారత రత్న" బిస్మిల్లా ఖాన్ స్మృతిగీతం కూడా త్వరలో రాబోతోందని మంచి కబురు తెలియజేశారు. వారి అకుంఠిత దీక్షకు, కార్యదక్షతకు అభినందన శతం.

ఇప్పుడు "స్మృతి గీతం"లోని విశేషాలను తెలియజేస్తారు. భారతీయ మూర్తిమత్వాన్ని తన నడకలో, ఆహార్యంలో, స్వర, రాగ గానంలో మేళవించుకొని చూడంగానే రెండు చేతులు ఎత్తి మనసార నమస్కరించాలనే భావన కలుగుతుంది. భారతీయ మహిళా స్వరూపానికి ఆమె నిలువెత్తు అద్దం. ఈ భావాన్ని ప్రతిబింబించే చక్కని చిత్రాలు ఈ పుస్తకంలో పొందుపరిచి అందరికీ ఆనందం కల్గించారు. ఆమె మరణానికి బాష్పాంజలి ఘటించిన వారి కవితలు మనోభావాలు ఇందులో పొందుపరిచారు. ముందున్న ముఖచిత్రంలో ఆమె తన్మయ స్థితిలో పాడుతున్న అద్భుత రంగుల ఫోటో చిరస్మరణీయంగా వుంది. చివరి ముఖచిత్రం రెండు చేతులు కలిపి నమస్కరిస్తున్న ఫోటో "గానానికి, లోకానికి ఇంక సెలవు" అన్న భావన కలిగించి కన్ను చెమరుస్తుంది. లకుమగారి ఎడిటింగ్‌కు అభినందనలు.

మాజీ రాష్ట్రపతి, యువజన స్ఫూర్తి దాత "భారతరత్న" అబ్దుల్ కలాం సుబ్బులక్ష్మిని స్మరిస్తూ ఆమె వసంత యామిని అనీ, అలనాటి తాన్సేన్‌ను స్ఫురణకు తెచ్చిందని అంటారు. ఆమె కాల పురుషుడు బహూకరించిన కమనీయ బహుమతి అని కీర్తించారు. సర్వేశ్వరుడినే సంగీతంతో విభ్రమం చెందించిన విదుషి అని మనసార "గీతాంజలి" గేయంలో అభివర్ణించి, నివాళులర్పించారు.

ప్రతి భార్య వెనక ఒక భర్త ఉంటాడని, ఆమె అభ్యుదయానికి సకల సహకారాలు అందించిన ఆమె భర్త "కల్కి" అనే సదాశివం గారిని ప్రస్తుతించారు లకుమ. "ఆమె పాడకపోతే దేవుళ్ళకు కూడా తెల్లవారదు" అన్న గీతంలో ఈ భావాన్ని అత్యద్భుతంగా పలికించారు. ఆమెను "మెలోడి సబ్ లైమ్" అన్నారు. తనకి తనే కాదు మనలోకి తొంగి చూడగల కమనీయ స్వరం అని, సంగీతాన్ని ఊగించి, శాసించి పాలించగల అసామాన్య ప్రావీణ్యం వున్న మహా విద్యాంసురాలని మెచ్చారు. "బతుకు డొల్లను పూరించే స'జీవ' స్వరం అనటం ఆయనకే చెల్లింది, నేను సుబ్బులక్ష్మి సమకాలికుణ్ణి" అనే ఒకే ఒక్క వాక్యంతో దేవుణ్ణి గెలిచాను అని లకుమ మినీ కవితలో మెగా భావాన్ని పొదిగాడు.

డాక్టర్ భూసురపల్లి వెంకటేశ్వర్లు "Friend of Pleasure" కవితలో ఏం.ఎస్‌ను రాధ చేతిలోంచి ద్వాపరంలో జారిపోయిన వేణువు అని, ఆమెలేని ప్రపంచం పక్షులెగిరిపోయిన గూడులా వుందని, ఆమె ఆధునిక మీరా అని భక్తి భావంతో అంజలి ఘటించారు. నన్నపనేని రాజకుమారి ఆమెను "సంప్రదాయ మూర్తి నీవు, సంగీత సామ్రాజ్య కీర్తి నీవు" అని చెమ్మగిల్లిన కన్నులతో అంటారు. "గళ దేవత" కవితలో చిల్లర భవానీదేవి ఉదాత్త మృదు మధుర భక్తి సంకేతాన్ని – నాద మయంగా దర్శనం చేయించిందనీ, ప్రతి ఇంటి సుప్రభాతంగా వెలిగిందనీ, మానవతా సంగీతాన్ని విన్పించిన మనస్విని అని హృదయపూర్వక నివాళులందించి భవానీమాతగా ఈ జాతి అంతా ఆమెకు రుణగ్రస్త శ్రోతలేనని మన రుణాన్ని గుర్తు చేయటంతోపాటు శిరసు వంచి జోతలర్పించారు.

"జ్ఞానరస సంగీత కర్మిణి" అని లిఖిత సంగీత మధురవాణి అని, శ్రవణ పూయ అమేయ రసధుని అని ధ్వని తరంగాల రసరాణి అంటూ ఆమె మరణవార్తకు సంగీతవల్లి తల్లడిల్లిందని కలత చెందారు కానూరి వెంకటేశ్వరరావు. నటుడు ఏ.వి.ఎస్ "సదా వెంకటేశం స్వరామి స్వరామి" వచన రచనలో "నా దేశం సంగీత భారత ప్రధానిని కోల్పోయింది. ఏం అనే మాధుర్యాన్ని, ఎస్ అనే సుస్వరాన్ని ఆమె ఇంటిపేరుగా మార్చుకొంది. మా కోసం మళ్ళీ రా అమ్మా. నువ్వొస్తే దేవతలంతా వస్తారు. నువ్వు కావాలి నీ పాట కావాలి. అందుకోసం మా మనోశ్వేత పత్రాలపై నూరుకోట్ల చేవ్రాళ్ళతో దేవతలకు దరఖాస్తు చేసుకుంటాం. నా దేశంలో ఓ కాశ్మీరం, ఓ స్వర్ణ దేవాలయం, ఓ తిరుపతి క్షేత్రం, ఓ సుబ్బులక్ష్మి గాత్రం" మాత్రమే వున్నాయని ఆమెకు భారతీయులకు వున్న సంగీత స్మరణీయ వైభవ సత్‌సంబంధాన్ని

స్పష్టంగా తన శైలిలో చెప్పారు ఏ.వి.ఎస్.

"నిద్ర లేచిన దేవుడు సైతం తలచుకొనే తొలి నామం ఏం.ఎస్ అని, ఇప్పుడు కచ్చేరీలలో "కల్యాణి" వినిపించటం లేదని, హృదయ లిపిలో ఒక గీతం శోక మూర్ఛనలుపోతూ తాళం వేస్తోందని "తొలి నామం"లో ఈతకోట సుబ్బారావు బాధా తప్త హృదయంతో ఆవేదన చెందారు. మొహమ్మద్ ఖాదర్ ఖాన్ "పునరపి జననం, పునరపి మరణం పదేపదే పాడే నీ పాటకోసం నువ్వు మళ్ళీ వెంటనే రావాలని ఆశిస్తూ ఆకాంక్షిస్తూ శోకిస్తున్నాం తల్లీ" అని ఆమెను పున: జన్మించమని వేడుకొన్నారు. స్వరాలమ్మ అని ఎల్.కే.సుధాకర్ అంటే అమరగాన సరస్వతి అని ఏం.వి.అప్పారాలు అన్నారు. ఇ.రఘు "మల్లెపూలు, మట్టిగాజులు" కవితలో ఆమెకు అవే ఇష్టమని, అసలైన మట్టి మనిషని మెచ్చారు. కవి, రచయిత నటదర్శకుడు భరణి "ఆమె భారత ధాత్రి గౌరవ పతాకాన్ని భూగోళం మీద పాతిన త్రివర్ణ గాత్రి. ఆమె సాక్షాత్తు వరవీణా మృదుపాణి" అని సంగీత స్వరార్చనతో ఘన నివాళులిచ్చారు. ఆమె పాటల పూదోటలో పూచిన ముకుందమాల, నిత్య నూతనంగా గుబాళిస్తుందని భక్తి కుముద మాల వేసారు. "పాటల పాలవెల్లి"లో ప్రముఖ కవి శిఖామణి "సాధన చేసి చేసి పరమపద సోపానానికి చివరికి గొంతునే సాధనంగా మలచుకుందామె" అంటూ ఆమె పాట ఆపాత మధురం, అజరామరం, వెన్నెల కోయిల, మల్లెపూవు పసిపిల్లల నవ్వు ఉన్నంత కాలం అని మురిసిపోయారు. అక్షర మణి నీరాజనమందించారు శిఖామణి. ప్రఖ్యాత సితార్ విద్వాంసుడు రవిశంకర్ తనకు తెలిసిన ఆమెను స్మరిస్తూ అహంభావం లేనిదని, వినయ విధేయతల ఆమె ఆభరణాలని, సంగీతాన్ని ఆమెలాగా ఆధ్యాత్మిక స్థితికి తీసుకువెళ్ళ గలిగిన సంగీతజ్ఞుడు తనకు ఇంతవరకు తారసపడలేదని, ఆమె దైవత్వం మూర్తీభవించిన సంగీత విద్వన్మణి అన్నారు. భర్త చేసే దానధర్మాలను చూసి ఆయన్ను సదా "శివం" అంటే ఎప్పుడూ ఏదో ఒకటి అవతలి వారికి ఇచ్చేవాడు అనేవారట సరదాగా. ఆమెది అన్ని శైలుల కంటే అతీతమైనదని, గళం నిజంగా అద్వితీయమైందని, చాలా లోతుగా పరిశుద్ధమైన భావోద్వేగంతో నిండి ఉంటుందని నిండు మనసుతో స్మృత్యంజలి ఘటించారు రవిశంకర్. నిజంగానే ఆయన సంగీత పండిట్ కదా.

ఇవి కాక బాలమురళి, జేసుదాస్, పట్టమ్మాళ్, సుశీల, వైజయంతా మాల మున్నగు వారంతా "ఆ గానం మధురామృతం" అని మనస్ఫూర్తిగా జేజేలందజేశారు. చివరలో ఆమె జీవితంలోని వివిధ ఘట్టాలను "మైలురాళ్ళు"గా నిలిపారు. ఏం.ఎస్ అంత అందంగా ఆమె గాత్రమంత పరిశుద్ధంగా, ఆమె గానం అంత పవిత్రంగా, ఈ స్మృతి గీతాలను అంటే Elegy లను ఘన నివాళిగా ఆమెకు అందజేసిన లకుమ గారిని మనసార అభినందిస్తున్నాను. మన జాతి మణిదీపాలై, మనల్ని సంస్కృతీ సుసంపన్నులను చేసిన మహానుభావులందరికి ఇలాంటి నీరాజనాలు మనం అందించాలి. లకుమకు సహకరించిన వారందరినీ అభినందిస్తున్నాను. ఇది నిజంగా అందరు గళం కలిపిన "స్మృతి స్వరమే". ❀



# 9. అమెరికాలో ఆంధ్ర తేజం కూచిపూడి "నృత్య రత్న" పాప

దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి మేనకోడళ్ళు సీతా, అనసూయల గురించి తెలియని ఆంధ్రులుండరు. జానపద సంగీతాన్ని బంగారు పల్లకిలో దేశ విదేశాల్లో ఊరేగించిన సోదరీమణులు. దేవులపల్లి వారి గీతాలను దేశమంతా పాడి తెలుగు జన హృదయాలను రస ప్లావితం చేసినవారు. అలాంటి ఇద్దరిలో అనసూయగారు వివాహం చేసుకొని అవసరాల అనసూయ అయ్యారు. ఆమె పుత్రికా రత్నమే రత్న పాప. రత్న పాప ప్రసిద్ధ కూచిపూడి నృత్య దర్శకురాలు, పద్మశ్రీ డాక్టర్ వెంపటి చినసత్యంగారి శిష్యురాలు. గురువుగారి వద్ద గొప్ప శిక్షణ పొంది, ఆయనతోను, ఆమె ఇతర కళాకార సహాధ్యాయినులతోను ఆంధ్రదేశమంతా పర్యటించి, వందలాది ప్రదర్శనలిచ్చి పేరు తెచ్చుకొన్నారు. కుమార్ అనే వారిని వివాహం చేసుకొని ఇప్పుడు "రత్నకుమార్"గా వ్యవహరింపబడుతున్నారు. సుమారు 25 ఏళ్ళుగా అమెరికాలో టెక్సాస్ రాష్ట్రంలోని హూస్టన్ నగరంలో "అంజలి" అనే నాట్య సంస్థను స్థాపించి నృత్య సేవ చేస్తున్నారు. అందులో కూచిపూడితోబాటు భరతనాట్యం మొదలైన భారతీయ నృత్యరీతులను అన్నిటిని నేర్పుతున్నారు. వందలాది విద్యార్థులకు ఆమె శిక్షణనిచ్చి రంగప్రవేశం చేయించి, వారి నాట్యాభిరుచికి దోహదం చేస్తున్న మహా కళాకారిణి రత్నపాప. ఆమె సంస్థ Anjali-Center for Indian Performance Arts.

2002లో మేము అమెరికాకు మొదటిసారిగా మా అమ్మాయి వాళ్ళు ఉన్న హూస్టన్‌కు వచ్చాం. అక్కడ మా బంధువు వావిలాల లక్ష్మిగారు ఒకరోజున మమ్మల్ని రైస్ యూనివర్సిటీలో ఒక అమ్మాయి కూచిపూడి నేర్చి, రంగప్రవేశం చేసి కార్యక్రమానికి తీసుకువెళ్లారు. అప్పుడు రత్నపాపగారి దగ్గరకు నేను, నా శ్రీమతి వెళ్లి పలకరించాం. చాలా చక్కగా మాట్లాడారు. అక్కడే ఉన్నవారి తల్లిగారు అనసూయ గారిని పరిచయం చేశారు. ఆమె మా చిన్నప్పటి నుండి తెలిసిన ఆవిడే. కృష్ణశాస్త్రిగారితో మా పరిచయం గుర్తుకు తెచ్చుకున్నాం. ఆమె మేమెవరో తెలిసి ఆశ్చర్యపోయారు. దేవులపల్లి వారిని ఆమె "మామయ్యా" అనే సంబోధిస్తారు. మద్రాస్‌లో ఉన్న మా పెద్దక్కయ్య లోపాముద్ర, బావ కృపానిధిగార్లు అనసూయగారికి బంధువులే.

బాగా తెలుసు, అవన్నీ గుర్తు చేసుకొన్నారు. శాస్త్రిగారి భార్య అంటే ఆమె అత్తయ్య చనిపోయిందనీ చెప్పారు. వాళ్ళింటికి రమ్మన్నారు కాని ఎందుకో కుదరలేదు. ఆ తర్వాత మూడేళ్ళ క్రితం వెంపటి చినసత్యంగారు కూచిపూడిలో జరిపిన సిద్ధేంద్ర ఆరాధనోత్సవాలకు రత్నపాప ఆయన ఆహ్వానంపై అమెరికా నుండి గురువుగారి మీది భక్తితో కూచిపూడి వచ్చి రెండు రోజుల కార్యక్రమంలో పాల్గొని వెళ్లారు. నేను ఒకరోజు కార్యక్రమంలో ఆమెను చూసి హూస్టన్ పరిచయాన్ని జ్ఞాపకం చేశాను. ఆమె ఆనందించింది. ఆ వేదిక మీద lecture cum Demonstration చేసింది రత్నపాప. నేను స్పందిస్తూ శ్రీనాథ మహాకవి భీమఖండంలో రాసిన పద్యం వ్యాసునికి కాశిలో విశ్వనాధుడు విశాలాక్షీ కన్పించిన తీరును ఒకే పద్యంలో వర్ణించినదాన్ని "చంద్ర బింబానన, చంద్రరేఖా మౌళి, నీలకుంతల ఫాల, నీలగళుడు – ధవళాయ తేక్షణ, ధవళాఖిలాంగుడు మదన సంజీవని మదన హరుడు – నాగేంద్ర నిభ యాన, నాగ కుండలదారి, భువన మోహన గాత్ర భువనకర్త" చదివాను. ఆమె "చిన్నపాప"లాగా నా దగ్గరకు పరిగెత్తుకొని వచ్చి "మేష్టారు మాస్టారు ఆ పద్యం చాలా అద్భుతంగా ఉంది. ఇదే నేను మొదటిసారి వినటం. అది "నాకు కాగితం మీద రాసివ్వరా? నేను నా శిష్యులకు దాన్ని నృత్యరూపంలో పెట్టి నేర్పిస్తాను" అని కోరింది. ఆనందంగా అంగీకరించి రాసిచ్చాను. ఈ మధ్య హూస్టన్‌లో జరిగిన "నాటా" తెలుగు సభలవారు ప్రచురించిన సావనీర్‌లో ఆమె తన గురువు గారిని గుర్తుకు తెచ్చుకుంటూ, తన నృత్య ప్రస్థానాన్ని గొప్పగా ఆవిష్కరించారు. అందులోని కొన్ని ముఖ్య విషయాలు, ఆ విదుషీమణి సాధనను మీకు అందజేస్తున్నాను.

రత్నపాప తన తల్లి అనసూయగారి వల్ల కూచిపూడి నాట్య ప్రాభవాన్ని తెలుసుకొన్నారు. అందులో ప్రవేశించే సంకల్పం కలిగి, దాన్ని అభ్యసించి ప్రపంచానికి కూచిపూడిని పరిచయం చేసే గొప్ప అదృష్టాన్ని పొందింది. అప్పుడే ఆమెకు నటరాజ రామకృష్ణ, కోరాడ నరసింహారావు, బందా కనకలింగేశ్వరరావు లాంటి మహానుభావులతో పరిచయం కలిగింది. ఇదంతా ఆమె మద్రాస్‌లో తల్లి గారింట ఉన్నప్పటి సంగతులు. అలానే నరసింహాచారిగారి బంధువు రామాచారిగారితోను పరిచయం. కూచిపూడి నాట్య గురువులు వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రిగారిని "తాతయ్యగారూ" అని పిలిచేది. ఆయనే తనను మూడేళ్ళ వయసులో ఒడిలో కూర్చోబెట్టుకొని హస్తముద్రలను నేర్పించారట. ఆయన గానం చేసే "వసంత స్వర వల్లరి"ని ఇప్పటికి మరిచిపోలేనంటారు. అనుభూతితో పాడి, కళ్ళ వెంట ఆనంద బాష్పాలు కార్చేవారట. అందరికి అదే అనుభూతి కలిగేది. అప్పటి నుంచే తనకు కూచిపూడి మీద అభిరుచి కలిగిందని చెప్పింది రత్నపాప. తల్లి అనసూయాదేవి వెంపటి చినసత్యం గారిని రత్నపాప రంగ ప్రవేశానిని నాట్యాన్ని సమకూర్చమని కోరారట. అలానే ఆయన ఆనందంగా అంగీకరించి కోరియోగ్రఫీ చేశారు. ఈనాటి వరకు ఆ పాటను పూర్తిగా సాహిత్యంతో తాను తప్ప ఇంకెవరూ రంగంమీద

నటించలేదని ఆనందంగా గర్వంగా తెలియజేశారు. దీనికి తన నాట్య గురువు సత్యంగారికి జీవితాంతం కృతజ్ఞురాలినని అంటారు వినమ్రంగా.

1961లో హై స్కూల్ చదువు పూర్తి అయింది. కాలేజిలో చేరటానికి కొన్ని నెలల వ్యవధి ఉంది. అందుకని ఈలోగా నాట్యం నేర్చుకోవాలని కోరిక కలిగింది. తల్లిగారు వెంపటి చినసత్యంగారి వద్ద చేర్చారు. అప్పటికే సత్యంగారు నాట్య విద్యాలయం స్థాపించిన దుర్గాబాయ్ దేశముఖ్, వగైరాలు సత్యంగారి కౌశలానికి ముగ్ధులయ్యారు. లజ్ చర్చరోడ్‌లో నాగేశ్వరరావు పార్క్ దగ్గర వెంపటివారి విద్యాలయం ఉండేది. ఆంధ్ర మహిళా సభ రజతోత్సవాలకు సత్యగారిని తెలుగులో ఒక నృత్య ప్రదర్శన ఏర్పాటు చేయించమని అనసూయగారికి చెప్పారు. అనసూయగారు వెంటనే భుజంగ రాయశర్మగారు రాసిన "శ్రీ కృష్ణపారిజాతం" నృత్యరూపకంను ప్రదర్శిస్తే బాగుంటుందని చెప్పారు. రత్నపాప సత్యభామగా, రమా రమణ రుక్మిణిగా, కుచల కుమారి కృష్ణుడిగా సుకుమారి నారదుగా పాత్రలతో సత్యంగారి ఆధ్వర్యంలో ప్రదర్శన జరిగి బ్రహ్మాండమైన విజయం సాధించింది. దానితో రత్నపాపకు కూచిపూడి మీద ఆసక్తి విపరీతంగా పెరిగింది.

సత్యంగారు ఇంటికి వచ్చి నాట్య శిక్షణనిచ్చేవారు. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి గొప్ప రచన "కొలువైతివా రంగసామి"కి సత్యంగారు నృత్య రీతులు నేర్పారు. ఆ తరువాత 'విప్రనారాయణ' నాటకం మొత్తం నేర్పారు. అందులో రత్నపాప దేవదేవిగా, ఈనాటి సినీ నటుడు చంద్రమోహన్ అల్వార్‌గా, పద్మ విభూషణ్ డాక్టర్ మంగళంపల్లి బాలమురళీ కృష్ణ మొత్తం అందులోని పాటలన్నీ స్టేజిమీద పాడిన గాయకుడిగా దాన్ని నిర్వహించారు. ఇది రత్నపాప జీవితంలో మరపురాని ఘట్టంగా అభివర్ణించారు.

రత్నపాప సోదరి సీతారత్న కుమార్, మద్రాస్ దూరదర్శన కేంద్రానికి అసిస్టెంట్ డైరెక్టర్. ఆమె ఈమెకన్నా ముందే కూచిపూడి నృత్య అకాడెమిలో చేరింది. తనకంటే ముందే చాలా నృత్యాలు అభ్యసించింది. 1967లో ఆమెతో కలిసి కూచిపూడి రంగప్రవేశం చేశారు. 1968లో రత్నపాపకు కూచిపూడి నృత్యానికి సంగీత నాటక అకాడెమి నుండి మొదటి స్కాలర్‌షిప్ పొందింది. దీన్ని పొందిన తొలి విద్యార్థి రత్నపాపే. ఇదంతా మాస్టరుగారి కృపా కటాక్ష వీక్షణమే అని సంబరపడుతుంది.

మద్రాస్‌లో ప్రముఖ సంగీత దర్శకుడు మాస్టర్ వేణుగారింటికి దగ్గరలో చిన్న గదిలో ఉన్న అకాడమి తర్వాత పానగల్ పార్క్ దగ్గర పెద్ద ప్రాంగణంలోకి మారింది. క్రమంగా నేర్చేవారి సంఖ్య కూడా పెరిగింది. మంచి పేరు ప్రఖ్యాతలు వచ్చాయి. మాస్టర్ సత్యంగారి వద్ద వైజయంతిమాల, రేఖా, హేమామాలిని, చంద్రకళ, చంద్రమోహన్, లక్ష్మీ విశ్వనాధన్, రాధా, జ్యోతి రాఘవన్, క్షేమావతి, రేఖ కజిన్స్, ప్రతిభ, సుధా, వేదాంతం రాఘవయ్యగారి

కూతుళ్ళు మొదలైన హేమా హేమీలంతా నృత్యం నేర్చారు. సాయంత్రం పూట శిక్షణా తరగతులు జరిగేవి. అందరికి శ్రద్ధతో విద్య నేర్పేవారు సత్యంగారు. అలసట అంటే ఏమిటో వారికి తెలీదట. కూచిపూడి గ్రామాన్ని గురించి అక్కడ నేర్పే విధానాన్ని గురించి తమతో ముచ్చటించేవారట. కూచిపూడిని "విశ్వ వేదిక"కు పరిచయం చెయ్యాలి అనేదే సత్యంగారి కల అని రత్నపాప అంటారు. దేశమంతా తన సోదరితో కలిసి ప్రదర్శనలిచ్చింది రత్నపాప. వెంపటి చినసత్యంగారి ట్రూప్‌లో తానూ మిగిలిన కళాకారిణులు కలిపి ట్రైన్‌లో వివిధ పట్టణాలకు, నగరాలకు వెళ్లి ప్రదర్శించిన అనుభవాలు మరచిపోలేనివి అంటుందామె. మజ్జిగ రసం తాగుతూ, పులిహోర తింటూ గడిపిన రోజులు మధురాలని అన్నది. శోభానాయుడు కృష్ణుడిగా, పద్మిని రుక్మిణిగా, తాను సత్యభామగా, శ్రీకృష్ణపారిజాతాన్ని సింహాచలంలో ప్రదర్శిస్తు ఉంటే వేదిక ఒరిగిపోయినా దాన్ని అలానే కొనసాగించి అదీ దానిలో భాగమేననే అనుభూతిని ప్రేక్షకులకు కల్గించిన సంఘటన చిరస్మరణీయం అన్నారు. అంతా అయిన తర్వాత మాస్టర్‌గారు నవ్వుతూ దాన్ని జ్ఞాపకం చేసుకోవటం భలేగా ఉందట.

చాలాకాలం తర్వాత గురువుగారి కల సాకారమైంది. గ్రీన్వే రోడ్డులో కొత్త అకాడెమి సర్వాంగ సుందరంగా రూపుదాల్చింది. అన్ని సౌకర్యాలతో అలరారింది. అందరి దృష్టిలో పడి దేశ విదేశీయులు వచ్చి శిక్షణ పొందటం మొదలెట్టారు. అందులో మాస్టారు రాజసంగా మహారాజులాగా ఠీవిగా కూర్చుని తమకందరికీ కన్నుల పండువ చేశారని సంబరపడిపోయారు రత్నపాప. అన్ని క్లాసులను సత్యంగారే నిర్వహించేవారట. విద్యార్థులతో సంస్కృతం, నాట్యం గురించి అధ్యయనం చేయించేవారట. సంపూర్ణ కళా స్వరూపంగా నృత్యాన్ని ప్రదర్శించాలని మాస్టారుగారి ఆకాంక్ష. ఆయనకు అభినయ దర్పణం, నాట్య శాస్త్రం కరతలామలకం. ఆయన లేచి నిలబడి ఒక భంగిమను అభినయించి చూపుతుంటే సాక్షాత్తు ఆ శివుడే దిగివచ్చి ప్రదర్శిస్తున్నాడు అనే భావం తామందరికీ కలిగేదని ఆమె మురిసిపోయారు. అంత నిర్దుష్టంగా ఆయన శిక్షణ ఉండేది.

రత్నపాప ఒకసారి దేవులపల్లివారి "క్షీర సాగర మధనం" నృత్య రూపకంలో మోహినిగా మాస్టర్‌గారు శివునిగా వేశామని అది తాను జీవితాంతం గుర్తుంచుకోదగిన మహాద్ఘటన అని అన్నారు. ఆహార్యంతోనే సత్యంగారు నట్టువాంగం చేస్తూ అభినయిస్తూ ద్విపాత్రాభినయం చేయటం చిరస్మరణీయం అంటారు. గురువుగారితో కలిసి నటించే మహాభాగ్యం తనకు కల్గినందుకు ఆమె పొంగిపోతున్నారు. అది ఎవరికీ లభించని మహదవకాశం. వింజమూరి రత్నపాప అనే రత్నకుమార్ తన నాట్య విద్యానుభావానికి, కూచిపూడి నృత్య వ్యాప్తికి భారత ప్రభుత్వం నుండి సంగీత నాటక అకాడెమి అవార్డ్‌ను పొందిన ఏకైక N.R.I. ఇంకెవరికీ అలాంటి పురస్కారం ఇంతవరకు దక్కలేదు. ఆంధ్రులుగా ఇది మనందరికి గర్వకారణం. ❀



## 10. సమాజ సేవా "భవానీ దీక్ష"

**అ**మెరికా వచ్చి బాగా సంపాదిస్తూ హాయిగా విలాస జీవితం గడపవచ్చునని అందరు అనుకోవటం సహజం. ఈ మధ్య కొందరు మాతృదేశాన్ని గుర్తించి, అనేక సేవా, అభివృద్ధి కార్యక్రమాలలో భాగస్వాములవుతు, జన్మభూమి ఋణం తీర్చుకొంటున్నారు. ఎక్కడ ఉన్నా మన చుట్టూ సమాజం ఉంటుంది. సమాజ పురోగతే మానవ ప్రగతి. ఈ రెండు అవినాభావ సంబంధం కలిగి ఉంటాయి. మనం ఉంటున్న దేశం మనదే. అక్కడి పమాజమూ మనదే. అందులో మనమూ ఒకళ్ళమే ఈ భావన వస్తే, విశ్వజనీన భావన కలుగుతుంది. అప్పుడు మనం చేసే సేవాకార్యక్రమాలకు, అర్థం, పరమార్థం లభిస్తాయి. ఇలా సమాజ సేవా కార్యక్రమాలలో నిర్విరామంగా పాల్గొంటూ, తన చుట్టూ ఉన్న సమాజ ప్రగతికి దోహదపడుతున్న తెలుగు వారెందరో ఉన్నారు. వారినే నేను "అమెరికాలో ఆంధ్ర తేజం" అన్నాను. అలాంటివారిలో అమెరికా ఆగ్నేయ రాష్ట్రమైన అలబామాలోని హంట్స్ విల్ (వేటపాలెం) నివాసి, కృష్ణాజిల్లా వాసి అయిన శ్రీమతి కాకాని భవానిగారు ముఖ్యులుగా కనిపించారు. క్రిందటి వారం నా అలబామా ప్రయాణంలో ఆమెను వారింట్లో భర్త డాక్టర్ ప్రసాద్‌గారితో పరిచయం కల్గించారు నా మిత్రులు మైనేని గోపాలకృష్ణగారు. ఆమె చేస్తున్న సమాజ సేవా కార్యక్రమాలను వివరించి చెప్పారు. "సమాజ సేవా భవానీ దీక్ష"గా ఆమె సాగిస్తున్న కార్యక్రమాలను మనవారందరికి అందజేయటమే నా ఉద్దేశ్యం. మిగిలిన వారు కూడా ప్రేరణ పొందుతారనే విశ్వాసం.

ఆంధ్రప్రదేశ్‌లో కృష్ణాజిల్లాలో కూచిపూడికి దగ్గర గ్రామం అయిన "పెడసనగల్లు"లో భవాని జన్మించారు. మేనమామ పెంపకంలో పెరిగారు. ఆయన ఈమె జీవితాన్ని తీర్చిదిద్దటానికి మంచి పునాది వేశారు. ఉయ్యూరు దగ్గర గ్రామమైన ఆకునూరు నివాసి కాకాని బ్రహ్మేశ్వరరావుగారి పెద్ద కుమారుడు డాక్టర్ కాకాని ప్రసాదరావుగారితో వివాహం జరిగింది. ఇద్దరు అమెరికా చేరారు. ప్రసాద్ వైద్య వృత్తిలో విశేష అనుభవాన్ని సంపాదించి అలబామాలో హంట్స్ విల్‌లో స్థిరపడ్డారు. సంతానం కూడా అభివృద్ధిలోకి వచ్చింది. సమాజంలో ఆదర్శమైన వైద్యులుగా ఆయన పేరొందారు. జెనరల్ మరియు వాస్క్యులర్ సర్జన్‌గా ప్రసాద్ లబ్ధప్రతిష్టులు. కావలసినంత సంపాదించి, ఇక సంపాదనపై వైముఖ్యం పెంచుకొని వాలంటరీగా పదవీ విరమణ చేశారు. సంసారంతో సంతృప్తిగా జీవిస్తున్నారు. శ్రీమతి భవాని 34 ఏళ్ళుగా సమాజసేవా కార్యక్రమాలలో, విద్యా, సంక్షేమ కార్యక్రమాలలో అగ్రగామిగా నిలిచారు. భర్తకు చేదోడుగా ఉంటూ, అన్యోన్య దాంపత్యాన్ని సాగిస్తున్నారు. ఆమె మంచి వాణిజ్యవేత్త. హంట్స్‌విల్‌లో ఎన్నో స్వచ్ఛంద సంస్థలకు ఆమె నిర్వాహకురాలు. 2004లో Girls inc. state అవార్డ్ పొందారు. మరుసటి ఏడాది National Conference for Community Sisterhood పురస్కారం పొంది తన సేవా కార్యక్రమాలకు తగిన గుర్తింపు తెచ్చుకొన్నారు. అలాగే Arthitis Foundation, Women Hounoring Women's Health మొదలైన విలువైన అవార్డులను, రివార్డులను పొందిన మహిళా మాణిక్యం కాకాని భవని. ఆమె ఆలోచనలన్ని సమాజ అభివృద్ధి మీదే ఉంటాయి. ఆమె మేధో జనితమైన భావనే "ఆశా కిరణ్" అనే లాభాపేక్షలేని సేవా సంస్థ. అమెరికాలో ఉన్న దక్షిణ ఆసియా వాసుల కల్లోల జీవితాలకు వెలుగునివ్వటానికి ఏర్పడిన సంస్థ ఇది. భవాని "Progress Bank and Trust"కు సెక్రెటరి మరియు డైరెక్టర్. అంతేకాదు International finance for intergraph corporationకు సీనియర్ స్టాఫ్ సూపర్వైజర్. ఇలా ఆమెను వరించని పదవి లేదు అంటే ఆశ్చర్యంలేదు. సమాజంలో వివిధ వర్గాల మధ్య సమన్వయము సాధించటానికి ఆమె గొప్ప కృషి చేస్తున్నారు. అందరికి ఆరోగ్యం అందించాలనే ఆమె దీక్ష ఆమెది. దానికోసం ఆమె నడంకట్టి ముందు నిలిచారు. ఎన్నో స్వచ్ఛంద సంస్థలను ఈ కార్యక్రమంలో భాగస్వాములను చేయటంలో కృతకృత్యులయ్యారు. Medical alliance medical society of the state of Alabamaకు అధ్యక్షత వహిస్తున్నారు. అలానే South medical association and hospiceకు సారధిగా ఉన్నారు. ఆమె స్వచ్ఛంద సేవా దీక్షితురాలు. Authority of the Hants Villie hospital foundation, మరియు The state wide health planning council వంటి ఎన్నో సంస్థలకు గౌరవ స్థానంలో బాధ్యతలు నిర్వహిస్తూ, సమాజహితైషిగా జీవితాన్ని సార్థకం చేసుకొంటున్నారు.

సమాజంలో వివక్షతకు గురైన పిల్లలను, సమాజ విస్మృత పిల్లలకు ఆమె అండా, దండగా నిలుస్తున్నారు. వివిధ కారణాల వల్ల విద్యకు దూరమైన బడి ఈడు బాలబాలికలను స్కూళ్ళలో చేర్పించి, వారి విద్యాభివృద్ధికి పూర్తి సహాయం అందిస్తున్నారు. దీనికి తార్కాణమే ఆమె The national children's advocacy center in varjiniaకు బోర్డ్ చైర్‌పెర్సన్‌గా గౌరవ స్థానాన్ని అధిరోహించటం. ఆమె సేవకు తగ్గ ప్రతిఫలం, పురస్కారం ఇది. విద్యనేర్పటంతోపాటు సరైన వృత్తిని ఎన్నుకోవటానికి తగిన సలహా సంప్రదింపులు ఇవ్వాలన్న ఆమె ఆలోచన మంచి కార్యరూపం దాల్చింది. ఎందరికో మార్గదర్శనం చేసింది. దీనికోసం Women council foundationకు ఆరేళ్ళు నిర్విరామంగా పనిచేసి అనేకమందికి ఉపాధి మార్గాలను కల్పించింది. U.A.H. foundation board commissionను ద్వారా అనేక ముందడుగు పథకాలను చేబట్టి ఆదర్శ మహిళగా నిలబడింది. Randolph school, women's economic development council foundation board వంటి మరెన్నో సేవా సంస్థలతో, వాటి సేవలో ప్రత్యక్ష భాగస్వామ్యం భవాని గారికి ఉంది.

సమాజాభివృద్ధి పథకాలలో ముందుండి నడిపించిన ముందు చూపున్న మహిళ భవాని. వీటికోసం Hants villie maadisaan countyకి అధ్యక్షురాలిగా, హన్ట్స్‌విల్ తెలుగు సంస్థకు ప్రారంభ అధ్యక్షురాలిగా పనిచేసి తెలుగు భాషా సంస్కృతులను సంరక్షించే అనేక కార్యక్రమాలను నిర్వహించింది. కళా పురస్కారాన్ని అందుకొన్నది. కళా సంస్థ art councilకు నేతృత్వం వహించింది. హంట్స్‌విల్‌లోని అంతర్జాతీయ సంఘానికి మార్గదర్శనం చేసింది. ఆ సంస్థ శత, ద్విశత వార్షికోత్సవ నిర్వహణలో ప్రముఖ పాత్ర వహించింది. ఆమె ఆర్థిక శాస్త్రంలో డిగ్రీ సాధించింది. బిజినెస్ అడ్మినిస్ట్రేషన్ అండ్ ఫైనాన్స్‌లో హంట్స్‌విల్‌లోని అలబామా యునివర్సిటి నుండి మాస్టర్ డిగ్రీ సాధించింది. ఆమె పత్రికా రంగంలో కూడా ప్రముఖ పాత్ర వహిస్తున్నారు. "ప్రవాసి హెరాల్డ్" అనే పత్రికను స్థాపించి, దాని సంపాదకురాలుగా ఉంటూ, దానినీ తన అభిరుచి మేరకు తీర్చిదిద్దుతున్నారు. "సమాజ సేవే ఉచ్ఛ్వాస నిస్వాసాలుగా అనుక్షణం జీవితాన్ని పండించుకొంటున్న ధన్యజీవి శ్రీమతి కాకాని భవాని. అందరికి ఆమె జీవితం ఆదర్శం కావాలి. ఉత్తేజం, ప్రేరణ పొందాలి. ❀



# 11. మనస్మరణీయ మహిళా శాస్త్రవేత్త - నూర్జహాన్

**మ**న దేశంలో మహిళా మణులెందరో ప్రత్యేక స్థానం పొంది ఉన్నారు. రాజ్యాలేలిన ఝాన్సీ లక్ష్మీబాయి, చాంద్ బీబీ, అందానికి కొత్తర్థం చెప్పిన రాణి సంయుక్త, ఒక సామ్రాజ్యానికే నాయకత్వం వహించిన కాకతీయ రాణి, రుద్రమ దేవి, చతుర రాజకీయంలో నిధి అనిపించుకొన్న నాగమ్మ త్యాగానికి మరోపేరైన మగువ మాంచాల, మహాభక్తి సామ్రాజ్యమేలిన వెంగమాంబ, కావ్యమే రాసి ఆ రామునికే అంకితమిచ్చిన మొల్ల, దేశభక్తిలో తన స్థానమేమిటో మహిళా సేవలో తన గమ్యమేమిటో తెలియజెప్పిన దుర్గాబాయి, మొదటి ఆధునిక కధానిక రాసి గురజాడతో పోటీపడిన అచ్చమాంబ అందరు అందరే. ఎవరికీ తీసిపోని వారే. సంగీతంలో ప్రపంచాధిపత్యమే సాధించిన భారతరత్న సుబ్బులక్ష్మి, సేవే దైవం అని నిరూపించుకొన్న మదర్ తెరీసా భారత దేశ మహిళా ప్రధానిగా సమర్ధతను చాటిన ఇందిరా గాంధీ, మొదటి మహిళా గవర్నర్, స్త్రీజాతి శిరోమణి కవితా కోయిల సరోజినీ నాయుడు, ఇలా ఎందరెందరో ఆ కాలం నుంచి ఈ కాలం వరకు ఖ్యాతి పొందారు. దేశానికి కీర్తి తెచ్చారు.

మనకు మహిళా శాస్త్రవేత్తలు కూడా తక్కువ సంఖ్యలో ఏమీలేరు. తండ్రి రాసిన గణితశాస్త్రమే తన పేర ఉన్న లీలావతి, వేశ్యగా జీవించి బుద్ధుని శరణు వేడి ఆమ్రపాలిగా మారి జీవితాన్ని సేవలో ధన్యం చేసుకొన్న ప్రజాపతి గౌతమి, సంఘమిత్ర, భక్తికే పరాకాష్టగా నిలచిన అవ్వయ్యార్, గోదాదేవిలను మనం నిత్యం స్మరిస్తా. శాంతలాదేవి, అక్కమహాదేవి మొదలైన రాజపుత్ర స్త్రీ రత్నాలున్నారు. మొఘల్ కాలంలో దుర్గాదేవి చాంద్ బీబీ, నూర్జహాన్, ముంతాజ్ మహల్, శివాజీ తల్లి జిజియా బాయ్, జహానారలను స్మరిస్తే ధన్యులమవుతాం.

షాజహాన్ భార్య ముంతాజ్ బంధువు నూర్ మహల్ అనే మహిళ మేధావిగా గుర్తింపు పొందింది. ఆమె సుగంధ పుష్పాల పరిశోధనలో ఆరితేరిన నిపుణురాలనిపించుకొన్నది. ఆమెయే డిస్టిలేషన్ పద్ధతిలో పూలనుంచి సుగంధ తైలాలను తయారు చేసిందని మనం మర్చిపోయాం. జహంగీర్ భార్య మెహరున్నీసా అనే వితంతువును వివాహం చేసుకొన్నాడు. ఈమెనే "నూర్జహాన్" అంటారు. ఈ మాటకు అర్థం "విశ్వకాంతి". జహంగీర్ చనిపోయిన తర్వాత షాజహాన్ పాలనలో ఈమె నిరాదరణకు గురైంది. గులాబీ అత్తరును తయారు చేయటంలో నూర్జహాన్ అనేక ప్రయోగాలు చేసింది. ఈమె 1645లో మరణించింది. ఆమె పేర "నూర్జహాన్ సెంట్స్" వాడుకలోకి తెచ్చినవారు దేవరపల్లి సత్యనారాయణరావు. వారికి మనం కృతజ్ఞతలు చూపాలి. ❀



## 12. గణిత మేధావి... మానవ కంప్యూటర్ - శకుంతలా దేవి

**బా**ల మేధావిగా, మానవ కంప్యూటర్‌గా గణిత మేధావిగా ప్రసిద్ధి చెందిన శకుంతలాదేవి 1929 జనవరి 4న బెంగళూర్‌లో సాంప్రదాయ బ్రాహ్మణ కుటుంబంలో జన్మించింది. 1982లో గిన్నిస్ బుక్ ఆఫ్ ప్రపంచ రికార్డులో స్థానం సంపాదించింది. నవలలు, గణిత పుస్తకాలు, పజిల్స్, జ్యోతిషంపై పుస్తకాలు రాసి పేరొందింది. భారతదేశంలో స్వలింగ సంపర్కం మీద కొత్త కోణాలను వెలువరించింది. తండ్రి సాంప్రదాయకంగా వస్తున్న పూజారిత్వం వదిలి సర్కస్ కంపెనీలో చేరి అప్పటికే కాలానికి ఎదురీదాదనిపించుకొన్నాడు. అందులో రోప్ వాకర్‌గా, మెజీషియన్‌గా పనిచేశాడు. మూడేళ్ళకే ఆమెకున్న అద్భుత జ్ఞాపకశక్తికి ఆశ్చర్యపోయాడు. ఒకటో తరగతిలో చేర్చినా నెలకు రెండు రూపాయల జీతం కట్టలేక మాన్పించారు. సర్కస్ కంపెని వదిలి కూతురు జ్ఞాపకశక్తి ప్రదర్శనలిప్పిస్తూ అందరికి పరిచయం చేశాడు. 1944లో 6 ఏళ్ళప్పుడే మైసూర్ విశ్వవిద్యాలయంలో మొదటి ప్రదర్శననిచ్చి అబ్బురపరచింది. తర్వాత తండ్రితో లండన్ చేరింది.

1960లో తిరిగి వచ్చి, కలకత్తాలో ఐ.ఏ.ఎస్ ఆఫీసర్ అయిన పరితోష్ బెనర్జీని వివాహమాడింది. ఇరవై ఏళ్ళు కాపురం చేసి విడాకులు పొందారు. బెంగళూర్ తిరిగి వచ్చారు. యూరప్ అంతా పర్యటించింది. గణితంలో తన ప్రతిభా ప్రదర్శన చేసి అందరిని ఆకట్టుకొని ఎన్నో అవార్డులు, రివార్డులు పొందింది. 1977లో 201 అంకెల సంఖ్యకు 23వ వర్గాన్ని మనసులోనే గుణించి 50 సెకన్లలో చెప్పి ప్రపంచ దృష్టిని ఆకర్షించింది. ఇదే సమస్య సాధించటానికి అత్యాధునిక కంప్యూటర్‌కు 1 నిమిషంపైనే పట్టింది. గడిచిన శతాబ్దంలో ఏ ఏడాదిలో, ఏ నెలలో, ఏ తేదీన, ఏ వారం వచ్చిందో నిద్రలో లేపి అడిగినా ఠక్కున చెప్పగల మేధస్సు ఆమెది. అమెరికా వెళ్లి బెర్కిలీలోని కాలిఫోర్నియా వర్సిటీలో ప్రొఫెసర్‌గా ఉన్న ఆర్థర్ జెన్సన్ వద్ద అనేక ప్రదర్శనలిచ్చి ఆకట్టుకొంది. క్యూబ్ రూట్ సెవెంత్ రూట్‌లను సునాయాసంగా చెప్పింది. వీటినన్నిటిని "ఇంటలిజెన్స్" అనే పత్రికలో సవివరంగా జెన్సన్ ప్రచురించి ప్రపంచానికి

శకుంతల గణిత వైదుష్యాన్ని చాటి చెప్పాడు. జ్యోతిష్యం మీద అనేక గొప్ప పుస్తకాలు రాసింది. అన్నీ బాగా ప్రచారం పొందినవే. 2013 ఏప్రిల్‌లో శ్వాస సంబంధ వ్యాధితో బాధపడగా బెంగళూర్ ఆస్పత్రిలో చేర్చారు. ఆస్పత్రిలోనే ఇరవై ఒకటిన 84వ ఏట శకుంతల మరణించింది. పదికి పైగా పుస్తకాలు రచించింది. గూగుల్ డూడీలో గౌరవం పొందింది. ఎంతపెద్ద గణిత సమస్య అయినా కంప్యూటర్ కంటే ముందుగా సమాధానం చెప్పి కంప్యూటర్‌కే మార్గదర్శిని అనిపించుకొన్నది. ఫన్ విత్ ది నంబర్స్, ఆస్ట్రాలజీ ఫర్ యు, మాథ్‌బట్, ఎవేకెన్ ది జీనియస్ ఇన్ యువర్ చైల్డ్, ఇన్ ది వండర్ లాండ్ ఆఫ్ నంబర్స్ అనే గొప్ప పుస్తకాలు రాసింది. ❀



## 13. సాంప్రదాయ సాహిత్య విమర్శకురాలు, అందరికి అక్కగారు – శ్రీమతి పి. యశో(ధరా)దా రెడ్డి

**ఆం**ధ్రప్రదేశ్ అధికార భాషా సంఘానికి మొదటి మహిళా అధ్యక్షురాలుగా తన దక్షతను చాటిన మేటి విద్యావేత్త ఆచార్య పాకాల యశోదారెడ్డి. పి.యశోదారెడ్డిగా అందరికి పరిచితురాలు. గొప్ప సాహిత్య విమర్శకురాలుగా పేరుపొంది, 78 సంవత్సరాల స్మారక జీవితం గడిపి కీర్తిశేషులయ్యారు.

సుప్రసిద్ధ చిత్రకారులు పి.టి.రెడ్డిగారిని పరిణయమాడి, యశోదారెడ్డి అయ్యారు. ఆయన అంతర్జాతీయ చిత్రకారునిగా గుర్తింపు పొందారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో యశోదా 33 ఏళ్ళు అధ్యాపకురాలుగా పనిచేసి, ఆచార్యులుగా పదవీ విరమణ చేశారు. సంప్రదాయ సాహిత్య విమర్శకురాలిగా ప్రఖ్యాతి పొందారు. తెలంగాణా మాండలికానికి తన రచనలలో గొప్పపీట వేసిన విదుషీమణి. 1929లో మహబూబ్ నగర్‌జిల్లా బిజినెపల్లిలో జన్మించారు. నిజాం ప్రభుత్వంలో నగర కమీషనర్ అయిన రాబహదూర్ బిరుదాంకితులు వెంకట రామారెడ్డి హైదరాబాద్‌కు ఆమెను తీసుకొని వచ్చి రెడ్డి హాస్టల్‌లో చేర్పించారు. 1969లో పి.హెచ్.డి చేశారు. 1955లో కొంతకాలం ఉపాధ్యాయినిగా పనిచేశారు. హైదరాబాద్‌లో ఆకాశవాణిలో కొంతకాలం ఉద్యోగించారు. 1976లో ఆగ్రా విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేట్‌నిచ్చి సత్కరించారు. 1990–93 కాలంలో ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంగాధ్యక్షులుగా బాధ్యతలు నిర్వహించారు.

## సాహితీ సేవ

తెలుగుదేశంలో తెలుగుదనం వెల్లివిరియాలని యశోదా రెడ్డి సంకల్పంతో అధికార భాష సంఘాధ్యక్షురాలిగా గొప్ప కృషే చేశారు. తెలుగును అధికార భాష చేయాలన్న ఆమె పంకల్పం మాత్రం కార్యరూపం దాల్చలేదు. అది ఆమెకే కాదు అందరికి బాధగానే ఉంది. ఆమెను సంగీత నాటక అకాడెమి జనరల్ కౌన్సిల్ సభ్యత్వం, ప్రపంచ సంస్కృత అధ్యయన కేంద్ర సభ్యత్వం వరించాయి. అనేక భాషా సాహిత్య సంఘాలలో సభ్యురాలిగా పనిచేశారు. 1991లో కేంద్ర సాహిత్య అకాడెమీ అవార్డు అందుకొన్నారు. డాక్టర్ సి.నారాయణరెడ్డిగారు తమ భార్య పేర నెలకొల్పిన అవార్డును స్వీకరించారు. తెలుగులో సుమారు 30 అమూల్య గ్రంధాలను రచించారు. అందులో పారిజాతాపహరణం, హరివంశం, ఆంధ్ర సాహిత్య చరిత్ర వికాసం, అమరజీవులు, తెలుగు సామెతలు పుస్తకాలు ఆమెకు యెనలేని కీర్తిని తెచ్చిపెట్టాయి. తెలంగాణా మాండలికంలో రాసిన కథలు, మా ఊరి ముచ్చట్లు, ఎచ్చమ్మ కథలు, ప్రజల్లో బాగా చొచ్చుకుపోయాయి. మంచి ప్రభావమూ చూపాయి. ఆమెతో తెలంగాణా భాషాభిమానం నిండుగా ఉండేది. ఎంతో గొప్ప పండితురాలైనా సంప్రదాయ సాహిత్యాన్ని కాచి వడబోసినా వాడుక మాటలతో అందరికి అర్థమయ్యే పదాలతో, జాతీయాలతో, నానుడులతో ఆకర్షణీయంగా ప్రసంగించే నేర్పు యశోదా రెడ్డిది. అందరు ఆమెను ఆప్యాయంగా "అక్క" అని ఆత్మీయంగా పిలిచేవారు. కీ.శ.సురవరం ప్రతాపరెడ్డిగారి సంపాదకత్వంలో వెలువడిన గ్రంధానికి ముందు మాట రాసిన యోగ్యురాలు. ఎన్నో సాహిత్య సాంస్కృతిక సభలలో ప్రసంగించి ప్రేరణ కల్గించిన విజ్ఞురాలు యశోద. నిజంగా ఆమె యశో"ధరా" రెడ్డియే. ❀



## 14. సినీ అష్టావధాని "బహు"మతి - భానుమతి

ఆ మాటలో వెటకారం, మనసులో నిర్మలత్వం, అభినయంలో శిఖరారోహణ, హాస్యంలో అద్వితీయం, సంగీతంలో సరస్వతీయం, హాస్య సాహిత్యంలో సమర్ధత్వం, దర్శకత్వంలో అసామాన్యం, ఆవకాయ పెట్టినా అత్తగార్ని ఝూడించినా అన్నిటా ఆమెకు ఆమే సాటి. జ్యోతిషం, వేదాంతాల లోతులు తరచింది. బహుముఖీన ప్రజ్ఞకు "బహు"మతి శ్రీమతి పాలువాయి భానుమతి. తెలుగువారికి గర్వకారణం.

భానుమతి 1925 సెప్టెంబర్ 7న బొమ్మరాజు వెంకటసుబ్బయ్య, సరస్వతమ్మ దంపతులకు ప్రకాశం జిల్లా ఒంగోలు దగ్గర దొడ్డవరం గ్రామంలో మూడవ సంతానంగా జన్మించింది. తండ్రికి కర్నాటక సంగీతంలో మంచి ప్రావీణ్యం ఉండేది. కూతురు భానుమతిని తనతోబాటు కచేరీలకు తీసుకొని వెళ్లి ఆమెకు సంగీతంలో అభిరుచి కల్గించాడు. క్రమంగా సినిమాపై దృష్టిపడింది. తెలుగు తమిళాలలో రెండు వందల సినిమాలలో నటించి, పాడి, రచన, సంగీత దర్శకత్వం చేసి "అష్టావధాని" అనిపించుకుంది. భరణి స్టూడియో నిర్మించింది.

1939లో వకవిక్రయం సినిమాలో కాళిందిగా నటించి సి.పుల్లయ్య దర్శకత్వంలో తెరంగేట్రం చేసింది. భానుమతి, మాలతీ మాధవం, ధర్మపత్ని, భక్తిమాల చిత్రాలలో నటించింది. కృష్ణ ప్రేమ సినిమాలో నిలదొక్కుకొని అందరి దృష్టి ఆకర్షించింది. స్వర్గసీమ చిత్రం ఆమె కెరీర్‌ను మలుపు తిప్పి అసమాన నటిగా సుప్రతిష్టమైంది. మల్లీ మల్లీశ్వరితో ఆమె నటన పరాకాష్టకు చేరింది. అందులో చిలిపితనం, హాస్యం, శృంగారం, విరహం, వేదన, నాట్యం, సెంటిమెంట్ అన్నీ సమర్ధవంతంగా పోషించి తనకు సాటి లేరని రుజువు చేసింది. అదొక కళాఖండంగా నిలిచిపోయింది. నాగిరెడ్డి దర్శకత్వ ప్రతిభ, దేవులపల్లివారి సాహిత్య పరిమళం,

రాజేశ్వరరావు సంగీత దర్శకత్వ ప్రతిభ, రామారావు నటనా వైదుష్యం అన్నీ సమపాళ్ళలో కుదిరి క్లాసిక్ అయింది మల్లీశ్వరి చిత్రం. చక్రపాణి సినిమాలో నవ్వుల పువ్వులే పూయించింది. అదొక ట్రెండ్ సెట్టర్ అయింది. చక్రపాణి కలల సాకారం అది. అంతస్తుల సినిమాలో "దులపర బుల్లోడా" అంటూ చెడును, అవినీతిని దులిపి పారేసింది.

నిర్మాత, దర్శకుడు అయిన పాలువాయి రామకృష్ణను కృష్ణప్రేమ సినిమా చిత్రీకరణప్పుడు చూసి వలచి 08-08-1943న వివాహం చేసుకొని భరణికి జన్మనిచ్చింది. కొడుకు పేర భరణి స్టూడియో నిర్మించి భరణి పిక్చర్స్ బేనర్‌తో సినిమాలు నిర్మించింది ఆ జంట. ఆదర్శ దంపతులుగా వారు ఇండస్ట్రీలో వెలిగిపోయారు. రామకృష్ణ గొప్ప దర్శకుడు. లైలా మజ్ను, విప్రనారాయణ, బాటసారి చిత్రాలు వారిద్దరి కళా తపనకు నిలువెత్తు అద్దాలు. నాగేశ్వరరావు మజ్నుగా చిరస్మరణీయ నటన, లైలాగా భానుమతి, సముద్రాల సాహిత్యం దాన్ని అమర ప్రేమ కావ్యంగా చేసింది. విప్రనారాయణలో అక్కినేని ఆ పాత్రనే పోషిస్తే దేవ దేవిగా భాను తన నట ప్రతాపాన్ని చూపించింది. రాజేశ్వర రావు సంగీతం, ఏ.ఏం.రాజా స్వరం, భానుమతి మధుర గాత్రం ఆ సినిమాను ఎంతో ఎత్తున నిలబెట్టాయి.

నటిస్తూనే దర్శకత్వ బాధ్యతలనూ చేబట్టి తన సమర్ధతను నిరూపించుకోవాలనుకొని "చండీ రాణి" సినిమాను 1953లో తెలుగు, తమిళ, హిందీ భాషల్లో తీసి దర్శకత్వం నిర్వహించి తొలి మహిళా దర్శకురాలనిపించుకొంది. మూడు భాషల్లో ఒకేసారి చిత్రాన్ని నిర్మించటమూ అపూర్వ విషయమే. దేనికైనా సమర్ధురాలు భానుమతి. ఆమెది కుశాగ్ర బుద్ధి. తమిళనాడు ముఖ్యమంత్రి అన్నా దొరై భానుమతికి "Nadippukku Llakkalam" "నటనకు వ్యాకరణం" అనే బిరుదు ప్రదానం చేశాడు. నట శిరోమణి జెమిని గనేషన్, తమిళనాడు మాజీ ముఖ్యమంత్రి, వందలాది సినిమాల హీరో ఏం.జి.రామచంద్రన్ భానుమతితో సినిమాలలో నటిస్తూ సెట్‌మీద ఆమెలోని అసమాన ప్రతిభకు, ఆమె సాహసానికి, ధైర్యానికి, పెర్ఫెక్షన్‌కు అబ్బురపడటమే కాదు ఆమె అంటే భయపడేవారు కూడా. తెలుగు అగ్రశ్రేణి నటులందరూ ఆమెతో నటించారు, భానుమతి తమ గురువు అన్నారు అక్కినేని, నందమూరి. చాలా రిజర్వ్‌డ్‌గా ఉండేది. ఎక్కడా సభ్యతా సంస్కారాలకు తేడా ఒచ్చినా సహించేది కాదు. అదే ఆమె గొప్పతనం. అందుకే అందరికీ అభిమానం. నటనకు చిరునామాగా, సభ్యతకు పర్యాయపదంగా, భక్తికి పరాకాష్టగా, ఆప్యాయతకు మరోపేరుగా స్నేహానికి, ఆదరణకు పెట్టింది పేరుగా ఉండేది.

ఒకసారి అంతస్తులు సినిమా షూటింగ్ అప్పుడు భానుమతికి హైదరాబాద్‌లో రిట్జ్ కార్లతాన్‌లో సూట్ బుక్ చేశాడు దర్శకుడు వి.బి.రాజేంద్ర ప్రసాద్. ఆమె అంత ఖర్చు నిర్మాత మీద పెట్టటం భావ్యం కాదని సారధి స్టూడియోలోనే ఉన్నది. అక్కడ పాములు తిరిగేవి. రాత్రి పడుకొంటే ఎలుకలు వేలిగోళ్ళు కొరికాయి. ఉదయాన్నే రాజేంద్ర ప్రసాద్ వచ్చి అయోడిన్

రాయించి షూటింగ్ కేన్సిల్ చేద్దామా అని అడిగాడు. "చిన్న చిన్న విషయాలకే షూటింగ్ కేన్సిల్ చేస్తే నేను భానుమతిని ఎలా అవుతాను?" అని చెప్పి యధా ప్రకారం చిత్రీకరణలో పాల్గొన్న సాహస చండీరాణి భాను. 1985 భర్త రామకృష్ణ మరణించారు. అయినా మొక్కవోని ధైర్యంతో తన కార్యక్రమాలను యధా ప్రకారం కొనసాగించిన ధీర వనిత.

తెలుగు చిత్ర పరిశ్రమలో అద్వితీయ నటనకు భానుమతి పేరు పొందింది. అందం చందం, అభినయం, చందమామ లాంటి గుండ్రని ముఖం, కాణీ కాసంత కుంకుమ బొట్టు, ఒంటినిండా చీరతో భానుమతి సాక్షాత్తు అపర సరస్వతిగా భాసించేది. భానుతేజం ఆమెలో ఉండేది. ఆమెను చూసి తల దించుకొన్నవారే కాని తల ఎత్తుకొన్న వారుండేవారు కాదు. అగ్ర నటులకూ ఆమె అంటే హడల్. నటనకు పెద్దబాల శిక్షగా ఉండేది. సంగీతానికి సరస్వతి అనిపించేది. దర్శకత్వానికి దార్శనికురాలనిపించేది. నిర్మాణానికి సమర్ధురాలనిపించేది. ఇన్ని విషయాలు ఆమెలో దాగి ఉండి అవసరమైనప్పుడు వెలువడి ప్రతిభను వ్యక్తం చేసేవి. కర్నాటక, హిందూస్తాని సంగీతాలలో ఆమె నిష్ణాతురాలనిపించుకొన్నది. నటికి బ్యాక్‌గ్రౌండ్ పాటపాడేవారు వేరుగా ఉండేవారు. కాని భానుమతి నటిస్తుంటే తన పాట తానే పాడుకొనేది. అదీ ఆమె ప్రత్యేకత. అలా కాకపోతే నటించేదే కాదు. హీరోయిన్‌గా చేసినా కేరెక్టర్ యాక్టర్‌గా ఉన్నా చిత్రంలో ఆమెదే సింహ భాగం. భానుమతి పాడిన "పిలచినా బిగువటరా", "కిలకిల నవ్వులు", "ప్రేమే నేరమౌనా", "ఎంత హాయి ఈ రేయి నిండెనో" "కోతీ బావాకు పెళ్ళంటా", జయదేవుని అష్టపదులు అన్నీ రసగుళికలే. ఆ పాత మధురాలే. మళ్ళీ మళ్ళీ వినాలనిపించేవే. ఎన్నిసార్లు విన్నా తనివి తీరనివే. "భక్త మార్కండేయ" చిత్రాన్ని అందరూ బాలలతో తీసి సంచలనం సృష్టించింది భానుమతి. పల్నాటి యుద్ధంలో బ్రహ్మనాయుడు పాత్ర రామారావుతో నాగమ్మ పాత్రలో భానుమతి అత్యద్భుతంగా నటించి అవార్డ్ పొందింది. రామినీడు దర్శకత్వ ప్రతిభకు అది దర్పణం. ఆమె పాడిన "ఒహోహో పావురమా" ఇంకా చెవుల్లో రింగుమంటూనే ఉంది. రజనీకాంత రావుతో పాడిన పాటలూ మధురాలే. భానుమతి చిత్రంతో తపాలా బిళ్ళను కేంద్ర ప్రభుత్వం వెలువరించింది. ఆమెతోబాటు అదే సమయంలో రామారావు, రంగారావు పేరా విడుదల చేసి ముగ్గురికీ గౌరవం కల్పించారు.

భానుమతికి అనేక సంస్థలతో అనుబంధం ఉండేది. రాష్ట్ర ఫిలిం అవార్డ్ కమిటీ సభ్యురాలుగా రెండేళ్ళు ఉంది. ఫిలిం ఇన్స్టిట్యూట్‌కు విజిటింగ్ ప్రొఫెసర్‌గా ఒక ఏడాది పని చేసింది. బాలల చలన చిత్రోత్సవ కమిటీకి అయిదేళ్ళు సభ్యురాలుగా 1965-70లో ఉన్నది.

భానుమతి ఎన్నో కథలు రాసింది. అందులో హాస్యం, అడుగడుగునా పండించింది. అత్తగారిని అడ్డం పెట్టుకొని ఎంతో సాహిత్యాన్ని సృష్టించి, సృజనాత్మక రచనకు సరిరారు తనకెవ్వరూ అనిపించింది. "నాలో నేను" అనే స్వీయ జీవిత చరిత్రను భానుమతి రాసుకొన్నది.

దీనినే ఇంగ్లీష్‌లో "మ్యూజింగ్స్"గా అనువాదం చేసి ప్రచురించారు. భానుమతి "అత్తగారి కథలు"కు రాష్ట్ర సాహిత్య అకాడెమి పురస్కారం లభించింది. ఆంధ్ర రాష్ట్ర లలిత కళా అకాడెమీకి అయిదేళ్ళు, సాహిత్య అకాడెమీకి పదేళ్ళు సభ్యురాలుగా సేవలందించింది. తమిళనాడు ప్రభుత్వ సంగీత కళాశాలకు ప్రిన్సిపాల్‌గా డైరెక్టర్‌గా నియమించి గౌరవించింది.

అనేక సాంఘిక సేవా సంస్థలతో భానుమతికి ప్రత్యేక స్థానం ఉండేది. చికాగోకి చెందిన "ఆల్ ట్రూసా ఇంటర్నేషనల్ సంస్థ"కు ప్రారంభం నుంచి (1963) జీవితాంతం వరకు సభ్యురాలు. ఇంటర్నేషనల్ రెడ్ క్రాస్ సొసైటీలో జీవిత సభ్యురాలు. చెన్నైలో సాలిగ్రాంలో "డాక్టర్ భానుమతీ రామకృష్ణ మెట్రిక్ స్కూల్"ను స్థాపించి పేదలకు ఉచిత విద్యా సౌకర్యం కలిపించింది.

భానుమతికి 1966లో పద్మశ్రీ, 2003లో పద్మ భూషణ్‌లను కేంద్ర ప్రభుత్వం ప్రదానం చేసి ఆమె సమర్ధతకు తగినట్లు గౌరవించింది. అంతస్తులు, పల్నాటి యుద్ధం చిత్రాలలో అసమాన నటనకు రాష్ట్రపతి అవార్డులు పొందింది. "నాలో నేను" అనే స్వీయ చరిత్రకు 1964లో ప్రభుత్వ జాతీయ ఉత్తమ రచనా పురస్కారం అందుకొన్నది. రఘుపతి వెంకయ్య పురస్కారం, నందీ పురస్కారం యెన్.టి. రామారావు జాతీయ పురస్కారాలను పొందింది. తమిళనాడు ప్రభుత్వం "కలైమణి" ప్రదానం చేసింది. ఆంధ్ర విశ్వవిద్యాలయం కళాప్రపూర్ణ ఇచ్చి సత్కరిస్తే వెంకటేశ్వర విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేట్ ప్రదానం చేసింది. రాజ్యలక్ష్మి ఫౌండేషన్ పురస్కారం ఆమెను వరించింది. 1956లో ఆంధ్రప్రదేశ్ అవతరణ జరిగినప్పుడు భానుమతిని ప్రత్యేక ఆహ్వానితురాలిగా ప్రభుత్వం ఆహ్వానించి సత్కరించి గౌరవించింది. ఇలా గౌరవం పొందిన తొలి నటి ఆమే. శృంగేరి శారదా పీఠాదిపతులు జగద్గురువులు శ్రీ అభినవ విద్యా తీర్ధస్వామి భానుమతికి "శ్రీ విద్యా ఉపాసక" బిరుదును నలభై ఏళ్ళ క్రితమే ప్రదానం చేశారు. అంతటి ఉపాసకురాలు భానుమతి.

తెనాలి రామకృష్ణ, బొబ్బిలి యుద్ధం, చింతామణి, అనురాగం, వివాహ బంధం, తోడూ నీడ, గృహలక్ష్మి, మట్టిలో మాణిక్యం, విచిత్ర వివాహం, అమ్మాయి పెళ్లి, మంగమ్మగారి మనవడు, బామ్మ మాట బంగారు బాట చిత్రాలలో భానుమతి నటనకు సంగీత మాధుర్యానికి, పరవశించిపోతాం. కారణ జన్మురాలు భానుమతి. భానుమతి నటన అన్నా, గానం అన్నా ఉవ్విళ్ళూరి, ఆరాధించే వారిలో సర్వేపల్లి రాధాకృష్ణన్, బెజవాడ గోపాలరెడ్డి, రాజమన్నార్, కొడవటిగంటి కుటుంబరావు, చక్రపాణి మొదలైన ప్రముఖులెందరో ఉన్నారు.

ఉయ్యూరు దగ్గర తోట్లవల్లూరులో శివలెంక బసవయ్యగారి శివాలయంలో ప్రతియేడు జరిగే మూడు రోజుల శివరాత్రి ఉత్సవాలకు భానుమతి స్వయంగా వచ్చి "అయ్యగారు" అని అందరి చేతా పిలువబడే బసవయ్యగారిని సందర్శించి ఆశీస్సులు పొంది వెళ్ళేది. 2005

డిసెంబర్ 24న 80వ ఏట ఆ సంగీత, సాహిత్య, నట సరస్వతి సత్యలోకం చేరింది.

మేము రెండవసారి 2005 నవంబర్‌లో అమెరికాకు మా అమ్మాయి విజయలక్ష్మి వాళ్ళింటికి వెళ్ళాం. భానుమతి చనిపోవటానికి ఒకవారం రోజుల క్రితం ఆవిడ మా ఆవిడ ప్రభావతికి కలలో ఉయ్యూరులో మా ఇంట్లో ఉత్తరం వైపు నుంచి వచ్చి దక్షిణం వైపుకు వెడుతూ తెల్లజరీ యెర్ర బార్డర్ పట్టుచీరెతో నుదుట నిలువు బొట్టుతో కనిపించి "వెళ్ళొస్తానని చెప్పటానికి వచ్చాను" అన్నదట. ఈ విషయం భానుమతి మరణవార్తను చెప్పగా జ్ఞాపకం చేసుకొంది. భానుమతి పాటన్నా, మాటన్నా, నటన అన్నా మా ఇద్దరికీ విపరీతమైన ఇష్టం. మాటల్లో చెప్పలేనంత అభిమానం. అందుకే కలలో కనిపించింది అనుకొన్నాం.

భారతీయ చలనచిత్ర బహుముఖ ప్రజ్ఞారాణి, స్వర్ణకంకణ ధారిణి, బహుకళా భారతి, ధీరతి, అష్టావధాని భానుమతి. ❁



# 15. గురువులకు గురువు – దేవీ స్వరూపిణి ఆనందమయీ మా

**ఆ**మె సన్నిధే దైవ సన్నిధి. ఆమె సమక్షం ఆనంద రసప్లావితం. ఆమె వాక్కు పరావాక్కు. ఆమె గురువులకు గురువు అనిపించుకొన్న దైవీ స్వరూపిణి అయిన ఆనందమయీ మాత. అసలు పేరు నిర్మలా సుందరి. తూర్పు బెంగాల్‌లో ఖౌరాలో 1896లో ఏప్రిల్ 30న సంప్రదాయ కుటుంబంలో జన్మించింది. పసితనంలోనే ముసిముసి నవ్వులతో ముంచేసేది. అందుకే "నవ్వుల తల్లి" అని "సంతోషీ మా" అని పిలిచేవారు. పుట్టిన తర్వాత యేదవనే లేదు. పరమ ప్రశాంతంగా ఉండేది. ఎప్పుడూ సమాధి స్తితిలో ఉన్నట్లు కనిపించేది. ప్రకృతి సౌందర్యానికి పరవశించేది. మాంసం, చేపలు తినేది కాదు. ప్రతి పని అతి శ్రద్ధగా, సంపూర్ణంగా చేసేది.

ఆనందమయికి పదమూడవ ఏట భోలానాధ అనే యోగ్యునికిచ్చి వివాహం చేశారు. అనేక తాత్కాలిక ఉద్యోగాలు చేస్తూ అనేక ఊర్లు తిరిగేవాడాయన. ఆయన బంధువులలోనూ ఈమె అణకువ, సంతోషం ఉన్న స్త్రీగా పేరు తెచ్చుకొంది. పద్దెనిమిదవ ఏట అస్టగ్రామానికి భర్తతో కాపురానికి వెళ్ళింది. ఆమెతో దాంపత్య సుఖానికి ప్రయత్నిస్తే భర్తకు కరెంట్ షాక్ కొట్టినట్లయింది. ఇంకా వ్యక్తిత్వం రాలేదని సరిపెట్టుకున్నాడు. ఆమె దైవీ స్వరూపం అని గ్రామస్తులు భావించారు. పూజలో, భజనలో ఆమె యిట్టె సమాధి స్తితికి వెళ్ళేది.

1916లో ఆరోగ్యం బాగుండక తలిదండ్రుల దగ్గరకు వెళ్ళింది. ఆరోగ్యం కుదుటపడిన రెండేళ్లకు మళ్ళీ భర్తను చేరింది. అంతకు ముందెన్నడూ వినని, చదవని వేదం మంత్రాలు ఆమె నోటి నుండి ఆశువుగా వచ్చేసేవి. విన్న వారందరూ ఆశ్చర్యం, ఆనందం పొందేవారు. అతి తేలికగా హఠయోగం చేసేది. అప్పుడు ఆమెకు "నువ్వే అన్నీ. నువ్వే శక్తివి" అన్న అంతర్వాణి వినిపించింది. తాను ఈ అనంతశక్తిలో ఒక శకలం అన్న భావన కలిగింది. ఇదొక శక్తి ప్రవాహంగా ఆమెకు సహకరించి ఎందరో రోగగ్రస్తులకు వరమై స్పర్శ చేతనే వ్యాధులను నయం చేసింది. నిరంతరం వేద మంత్రాలు నాలుక చివర నుండి పలికేవి.

1922 ఆగస్ట్ మూడున ఆంతరంగిక ప్రేరణతో గురువు, శిష్యుడు తానే అయి బీజాక్షరాలను అకస్మాత్తుగా పలికింది. ఆమె భర్తకంటే తాను కొంత ఉత్కృష్ట స్తితిలో ఉన్నట్లు గ్రహించింది. అయిదు నెలల తర్వాత భర్తకే మంత్రోపదేశం చేసి ప్రత్యక్ష గురువే అయింది. అతన్ని రెండు గంటలు సమాధి స్తితిలో ఉండేట్లు చేసింది. అప్పుడు భర్త భోలానాదకు తాను పూర్ణబ్రహ్మ నారాయణుడినని, దైవాన్ని అని ఎరుక కలిగింది. అప్పుడు ఆయనలో "ఇంతకీ ఈమె ఎవరు?" అనే జిజ్ఞాస కలిగింది. ఆమెలో దైవీ శక్తులు కేంద్రీకరించి ఉన్నాయని గ్రహించాడు. ఆమె క్రమంగా ఆహారం, నిద్రలకు దూరమవుతోంది. మా మూడేళ్ళు పూర్తి మూనంగా ఉండిపోయింది. కుటుంబం ఢక్కాలోని షాభాగ్ గార్డెన్స్‌కు మారింది. ఒక్కోసారి పన్నెండు గంటలు సమాధిలోనే ఉండిపోయేది మా. ఆమెలో అద్భుతమైన కాంతి పుంజం గోచరించేది. నిర్వికల్ప సమాధిలో ఉండిపోయేది.

ఢక్కా దగ్గర సిద్ధేశ్వరిలో ఉన్న పురాతన కాళికా దేవాలయానికి ఒకసారి వెళ్ళింది. అక్కడే చిన్న ఆశ్రమాన్ని ఏర్పరచుకొని రాత్రిళ్ళు గడిపేది. 1924-28 వరకు ఇక్కడే మా ఉండిపోయింది. అనుచరులేర్పడ్డారు. డజనుకు పైగా చోట్ల ఆశ్రమాలేర్పరచారు. 1925లో మౌనాన్ని వదిలి సంభాషించటం మొదలుపెట్టింది. ఆమెను దర్శిస్తే దివ్యానుభూతి కలుగుతుందనే అభిప్రాయం బాగా వ్యాపించింది. హిందూ, ముస్లిం, క్రిస్టియన్లు కూడా అదే అనుభవాన్ని పొందేవారు. కాళీ దేవాకి నిత్య పూజాదికాలు చేయబోతు పూలు తన శిరస్సునే ఉంచుకోవటం, అమ్మవారికి పూయాల్సిన చందనాన్ని తానే పూసుకోవటం పరవశ స్తితిలో చేసేది. వేలాది మంది చేరేవారు. వారూ అదే పరవశాన్ని అనుభవించేవారు. అందరి కష్టాలు తనవిగా భావించి తనలో ఆపాదించుకొనేది. అప్పుడు అందరూ ఆమెను "ఆనందమయీ మా" అని కీర్తించటం ప్రారంభించారు. ఆ పేరే స్థిరపడింది. భోలానాథ్‌ను "భాయీజీ" అని ఆప్యాయంగా పిలిచేవారు. ప్రార్ధన గీతాలను పారవశ్యంగా పాడి అందరిని భక్తిలో ఓలలాడించటం మా ప్రత్యేకత. ఈ సమయంలో ఆమె శరీరంలో అనేక వింత మార్పులు గోచరించేవి. భూమిమీద పడుకొన్నప్పుడు శరీరం విపరీతమైన పొడువు పెరిగేది. లేకపోతే అతి చిన్నదిగా కుంచించుకునేది. ఇంకోసారి రబ్బర్ బంతిలా గుండ్రంగా అయ్యేది. ఇవన్నీ మెరుపు వేగంతో జరిగిపోయేవి. మరోసారి మధ్యాహ్నం నుండి సాయం సంధ్య వరకూ విపరీతంగా ఏడుస్తూ కూర్చునేది. సిద్ధేశ్వరిలో ఒకసారి ఆమె శరీరం ఉన్నట్టుండి సంకోచించి క్షణాల్లో అదృశ్యమై, చీరలో ఒక చిన్న ముక్క మాత్రమే మిగిల్చింది. అంతే వేగంతో యదార్ధ స్తితి పొందింది.

1924లో ఆహారం తీసుకొనే శక్తినే కోల్పోయింది. ఒక భక్తురాలే తినిపించేది. అనేక గంటలు, రోజులు ఉపవాసం ఉండేది. ఆరు నెలలు రోజుకు ఆరుగింజలు మాత్రమే తినేది. చెట్టునుండి రాలిన పండ్లను ఒకటో రెండో తినేది. ఎనిది నెలలు మధ్యాహ్నం, రాత్రి

మూడేసి ముద్దలు మాత్రమే తినేది. అయిదు నెలలు వారానికి రెండుసార్లే అన్నం ముద్దలు తినేది. డాక్టర్ శశాంక మోహన ముఖోపాధ్యాయ ఆయన కూతురు ఖుక్ని మాతకు శిష్యులై అంతరంగికులైనారు. గురుప్రియ దేవిగా మారిన ఖుక్ని "మా"పై పదిహేడు గ్రంథాలను బెంగాలీ భాషలో, పందొమ్మిది గ్రంథాలను హిందీలో రాసి ఆనందమయీ మా లీలావిభూతిని ప్రపంచానికి చాటింది. 1950లో శిష్యులు "శ్రీశ్రీ ఆనందమయీ సంఘం" ఏర్పరచారు. మా పర్యటనలు జరుపుతూ వేదాంత విషయాలను బోధించేది. 1926లో ఉత్తర, మధ్య భారతాన్నంతా తిరిగి జ్ఞాన బోధ చేసింది. 1927లో కాశీ ప్రయాగ, రుషీకేష్ మొదలైన పుణ్యక్షేత్ర సందర్శనం శిష్యులతో సహా చేసింది. ఉత్తరప్రదేశ్‌లో వింధ్యాచలంలో ఒక ఆశ్రమాన్ని స్థాపించింది. వారణాసిలో మహా మహోపాధ్యాయ గోపీ నాథ కవిరాజ్‌ను కలిసింది. ఆయన వెంటనే శిష్యపరమాణువైనాడు. ఆమెలో భగవత్ ప్రేరణ కలిగింది. దీన్ని "ఖేయాల" అన్నారు. ఆమె 36వ పుట్టినరోజు వేడుకలను ఇరవై ఒక్కరోజులు ఘనంగా నిర్వహించారు. భార్యాభర్తలు డేహ్రాడూన్‌లో చేరి కొన్ని రోజులున్నారు. 1934లో సిమ్లాకు వెళ్ళగా రాజు దుర్గాసింగ్ శిష్యుడైనాడు. అక్కడ ఆనందమయీ సంఘాన్ని స్థాపించారు. నెహ్రూ భార్య కమలానెహ్రూ మాను దర్శించి అనుభూతి చెందింది. 1936లో పురుష సహకారం లేకుండా ఉత్తర భారత సందర్శనం చేసింది. టిబెట్‌లోని శివధామం కైలాస శిఖరాన్ని సందర్శించింది.

1938 మే నెల ఏడవ తేది మా భర్త భోలానాదకు మసూచికం సోకి చనిపోయాడు. అమ్మ శక్తి ప్రభావానికి అందరూ లోనయ్యారు. పెద్దవాళ్ళను అమ్మానాన్నా అని, పిల్లలను బిడ్డలారా, స్నేహితులారా అనీ సంబోధించేది. ఆస్ట్రేలియాకు చెందిన ప్రముఖుడొకడు వచ్చి అమ్మ ప్రభావం చూసి అంతే వాసి అయ్యాడు. "అంతా ఆయనదే నీది నాదీ ఏమీలేదు" అని అందరికీ చెప్పేది మా. "విచారం వద్దు సంతోషంగా ఉండండి" అని బోధించేది. జీవితాన్ని దైవలీలగా భావించేది. 1974 ఆగస్ట్ 27న మా మహాసమాధి చెందింది. పరమహంస యోగానంద మా జీవిత చరిత్ర "ఒక యోగి ఆత్మకథ" పేర రాశారు. వారణాసిలో పేదలకు ఉచిత వైద్య సేవలందించటానికి ఒక హాస్పిటల్‌ను నిర్మించారు. విద్యా సంస్థలను ఏర్పరచి ఉచిత విద్య బోధిస్తున్నారు. మధ్యప్రదేశ్‌లో ఓంకారేశ్వర్ దగ్గర ట్రైబల్స్ కోసం ఒక ఉచిత విద్యా కేంద్రాన్ని ఏర్పరచి వారి సర్వతోముఖాభి వృద్ధికి కృషి చేస్తున్నారు. ఇలా "మా" పేర ఎన్నో సేవా కార్యక్రమాలను అందిస్తూ ప్రజా పురోగతికి తోడ్పడు తున్నారు.

"మీ బాధలూ, విచారాలు నాకు తెలుసు. ఒకే ఒక ఆత్మ ఉంది. నువ్వు నేను ఆ ఆత్మలమే. మీరెవ్వరో నేనూ మీలాంటి దానినే. ఒకే ఒక చిదానందం యొక్క రూపాలే మీరూ నేనూ. ఈ చిన్నపిల్ల ఎప్పుడూ మీతోనే ఉంటుంది." అని మా బోధనలో సారాంశం. మాపై దాదాపు ఇరవై పుస్తకాలు వెలువడి ఆమె భావవ్యాప్తికి తోడ్పడ్డాయి. ❋



## 16. మహిళా శాస్త్రవేత్తలు– శ్రీమతి చింతల సీతాదేవి

మన రాష్ట్రానికి చెందిన శ్రీమతి చింతల సీతాదేవి వైద్య విద్యనభ్యసించారు. తర్వాత ఏం.డి. సాధించి F.I.M.S.A పొందారు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో బయోకెమిస్ట్రీలో ఉద్యోగంలో చేరి క్రమంగా అనేక హోదాలకు ఎదిగి ఆంధ్రా మెడికల్ కాలేజిలో ప్రిన్సిపాల్‌గా పదవీ విరమణ చేశారు. సీతాదేవి గొప్ప పరిశోధకురాలు. రోగ నిర్ధారణా, జీవ రసాయన శాస్త్రాలలో విశేషంగా పరిశోధన చేసి అంతార్జాతీయంగా గుర్తింపు సాధించారు. యాభైకి పైగా పరిశోధనా పత్రాలను రాసి ప్రచురించారు. "జర్నల్ ఆఫ్ అసోసియేషన్ ఆఫ్ క్లినికల్ బయో కెమిస్ట్స్ ఆఫ్ ఇండియా" అనే పత్రిక సంపాదక వర్గంలో పరిశోధనా వ్యాసాలను ప్రచురించటంలో కృషి చేశారు.

1975 LO F.A.M.S లో ఫెలోషిప్ పొందారు. ఇంటర్నేషనల్ మెడికల్ సైన్సు ఎకాడెమిలో "ఫౌండర్ ఫెలో" గౌరవాన్ని దక్కించుకొన్నారు. అసోసియేన్ ఆఫ్ క్లినికల్ బయో కెమిస్ట్స్ ఆఫ్ ఇండియా వారి గౌరవ సభ్యత్వం అందుకొన్నారు. ఇండియన్ అసోసియేట్స్ ఆఫ్ ఫిజియాలజిస్ట్స్ అండ్ ఫార్మకోలాజిస్ట్స్‌కు అధ్యక్షులైన అరుదైన గౌరవాన్ని పొందిన విదుషీమణి సీతాదేవి. అసోసియేషన్ ఆఫ్ క్లినికల్ బయో కెమిస్ట్స్ ఆఫ్ ఇండియా నిర్వహించిన నాల్గవ సదస్సుకు అధ్యక్షత వహించి మార్గ దర్శకత్వం చేశారు.

పూర్వ విద్యార్థిగా ఆంధ్రా మెడికల్ కాలేజికి ఎన్నో సేవలందించారు పూర్వ విద్యార్థుల చేత అపూర్వ సత్కారాన్ని పొందారు. త్రివేంద్రం మెడికల్ కాలేజివారి సిల్వర్ జూబ్లీ "ఆరేషన్ అవార్డ్" గ్రహీతగా ప్రతిభకు తగిన గౌరవం సాధించారు. రోగ నిర్ధారణలోను ఈవ రసాయన శాస్త్ర విషయాలలో విశేష పరిశోధనలు చేసిన మహిళా శాస్త్రవేత్త శ్రీమతి చింతల సీతాదేవి మహిళా మాణిక్యం.

## కే. ఇందిరా బాయ్

శిశురోగ నిర్ధారణలో, పరిశోధనలో ప్రఖ్యాతి పొందిన శాస్త్రజ్ఞులు కే. ఇందిరాబాయ్. 30-08-1927న శ్రీకాకుళం జిల్లాలో పుట్టింది. వైద్యంలో M.D; D.C.H; F.I.A.P; F.I.C.P లను పొందింది. యూనిసెఫ్, ప్రపంచ ఆరోగ్య సమస్తలలో ఫెలోషిప్ పొందింది. "అమెరికన్ అకాడెమీ ఆఫ్ పీడియాట్రిక్స్", "ఇంటర్నేషనల్ మెడికల్ సైన్సెస్ అకాడెమి", "నేషనల్ అకాడెమి ఆఫ్ మెడికల్ సైన్సెస్ ఆఫ్ ఇండియా" మొదలైన ఎన్నో సంస్థలలో ఫెలోషిప్ అందుకొన్నది.

విశాఖ కింగ జార్జి హాస్పిటల్ అసిస్టెంట్ సర్జన్‌గా, ఉద్యోగంలో చేరి ఆంధ్రా మెడికల్ కాలేజిలో పీడియాట్రిక్స్ అసిస్టంట్ ప్రొఫెసర్‌గా, ఎస్.వి.లో అధిపతిగా, ఉస్మానియాలో ప్రొఫెసర్‌గా రాజా ముత్తయ్య కాలేజి ప్రొఫెసర్‌గా పనిచేసి గొప్ప అనుభవం పొందింది.

1921లో "ఇండియన్ అకాడెమి ఆఫ్ పీడియాట్రిక్స్"కు అధ్యక్షురాలైనది. ఇండియన్ అసోసియేషన్ ఆఫ్ అడ్వాన్స్‌మెంట్ ఆఫ్ మెడికల్ ఎడ్యుకేషన్, ఇంటర్నేషనల్ సొసైటీ ఫర్ ట్విన్ స్టడీస్ సంస్థలలో అనేక హోదాలలో పనిచేసింది. డాక్టర్ బి.సి.రాయ్ నేషనల్ అవార్డ్‌ను పొందింది.

## కోలా రాజ్యలక్ష్మి

చిత్తూరు జిల్లా పుత్తూరులో జన్మించింది. ఆంధ్రా యూనివర్సిటీ నుండి డాక్టర్ పట్టా పొందింది. ఎండి. అయింది. గుంటూర్ మెడికల్ కాలేజిలో ఉద్యోగం ప్రారంభించి ఉస్మానియాలో చేరింది. "ఇన్స్టిట్యూట్ ఆఫ్ ప్రివేంటివ్ పబ్లిక్ హెల్త్ లాబ్ అండ్ ఫుడ్" అధారిటి డైరెక్టర్ అయింది. పద్మావతి మహిళా విశ్వవిద్యాలయానికి వైస్ ప్రిన్సిపాల్‌గా పనిచేసింది. వాక్సిన్ ప్రొడక్షన్ బోర్డ్, రాష్ట్ర టెక్నికల్ కమిషన్ ఫర్ రివెంషాన్ అండ్ వాటర్ ఫ్ల్యుషన్, మైక్రో బయాలజీ సంస్థలకు వివిధ హోదాలలో పని చేసింది. రాష్ట్ర ఫార్మసి కౌన్సిల్‌లో అనేక పరిశోధనలు చేసి వెలువరించింది.

45కు పైగా పరిశోధనా పత్రాలు ప్రచురించింది. దేశ విదేశీ వైద్య సంఘాలలో గౌరవ సభ్యత్వాన్ని పొందింది. "ఇండియన్ వాటర్ వర్క్స్ అవార్డ్", "కే.ఎస్.రావు అవార్డ్", "సుశ్రుత అవార్డ్"లను అందుకొంది రాజ్యలక్ష్మి.

## వినోదిని రెడ్డి

హైదరాబాద్‌లో 1934లో జన్మించింది. ఎం.డి, డి.సి.హెచ్, ఎఫ్.ఐ.పి కోర్సులను చేసింది. ఉస్మానియా అసోసియేట్ ప్రొఫెసర్‌గా ఉన్నది. పీదియాట్రిక్స్‌లో ఫెలోషిప్ పొంది వైద్య పరిశోధనలు చేసింది. ఏ విటమిన్ లోపంవల్ల వచ్చే వ్యాధులపై నేషనల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ న్యూట్రిషన్‌కు డైరెక్టర్ అయింది. Xeropthalmia జబ్బుకు కారణాలు కనుగొన్నది.

కమలా మీనన్ మెడికల్ అవార్డ్ పి.ఎస్.రాజు అవార్డ్ మొదలైన అవార్డులెన్నో పొందింది.

## మందవల్లి గౌరీదేవి

అనకాపల్లిలో పుట్టిన గౌరీదేవి మానసిక శాస్త్రవేత్తగా ప్రఖ్యాతి పొందింది. న్యూరాలజీలో డి.ఎం. డిగ్రీ పొందింది. ఉస్మానియాలో ప్రొఫెసర్‌గా చేరి, ఢిల్లీ యూనివర్సిటీకి చెందిన కాలేజ్ ఆఫ్ మెడికల్ సైన్సెస్‌లో, సఫ్దర్ జంగ్ హాస్పటల్‌లో న్యూరాలజీ ప్రొఫెసర్‌గా పనిచేసింది. కామన్ హెల్త్ అండ్ న్యూరో సైన్సెస్‌లో అధిపతిగా ఉంది. నేషనల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ మెంటల్ హెల్త్ అండ్ న్యూరో సైన్స్‌లో అసోసియేట్ ప్రొఫెసర్‌గా పనిచేసింది. ఇండియన్ మెడికల్ సైన్స్‌వారి ఫెలోషిప్ పొందింది. అనేక అంతర్జాతీయ సంస్థలలో విశిష్ట సభ్యత్వం పొంది దేశఖ్యాతిని ఇనుమడింప జేసింది. ❀



## 17. ఆడదై పుట్టటమే ఆమె నేరం అయింది - హిపాటియా

**ఆ**మె గొప్ప గణిత శాస్త్రవేత్త కుమార్తె. గణిత శాస్త్రంలో ప్రొఫెసర్, విజ్ఞాన శాస్త్రవేత్త. ఆమె స్వయం వ్యక్తిత్వం మగవాళ్ళకు అసూయ పుట్టించింది. ఆమెను ఏమీ చేయలేక నడి బజార్లో కిరాతంగా చంపేశారు. ఆమెయే హిపాటియా అనే గ్రీకు మేధావి. శాస్త్రీయ పరిశోధనలు చేసినందుకు హత్య గావింపబడ్డ మొదటి మహిళ హిపాటియా.

హిపాటియా తండ్రి తియాన్. ఆయన అలెగ్జాండ్రియాలోని అతిపెద్ద మ్యూజియంలో గణిత శాస్త్ర ఉపాధ్యాయుడు. అది గ్రీకు మేధావులకు గొప్ప కేంద్రం. సాంస్కృతిక కేంద్రం కూడా. మేధావులైన విద్యావేత్తలకు నిలయం. తియాన్‌ను అత్యంత సమర్ధుడైన వేదాంతిగా ఆకాలంలో భావించేవారు. మ్యూజియం అధికార సంఘంలో సభ్యుడు. ఖగోళం, జామెట్రీ, సంగీతంపై గొప్ప పరిశోధనలు చేసి వ్యాఖ్యానాలు రాశాడు. "టాలమీ టాబ్లెట్స్"పై వ్యాఖ్యానానికి పెట్టింది పేరు. యూక్లిడ్ మూల సిద్ధాంతాలను బోధించేవాడు. బైజాంటన్లు కూడా అతని మార్గదర్శకత్వంలో నడిచేవారు. అంత మంచి పేరున్నవాడు. "కాస్మిక్ కేయాస్"పై కవిత రాశాడు. "టాలమీ ప్రపంచం"పై కూడా వ్యాఖ్యానం రాసి మెప్పు పొందాడు. ఆయన్ను గొప్ప ఖగోళ శాస్త్రవేత్తగా, మజీశియన్‌గా చరిత్ర పేర్కొంది.

అలాంటి గొప్ప తండ్రికి హిపాటియా క్రీ.శ. 355లో గొప్ప కుమార్తెగా జన్మించింది. తండ్రి వద్దే విద్యనూ నేర్చింది. కొద్దికాలంలోనే తండ్రిని మించిన కూతురు అనిపించుకొంది. దయా ఫాన్టిస్ రాసిన "అరిత్ మాటికా"పై మంచి వ్యాఖ్యానం రాసి సెబాస్ అనిపించుకొంది. అలాగే అపోలినయాస్ రాసిన "కోనిక్స్" పైనా రాసింది. తండ్రి మొదలుపెట్టిన "అలమాజిస్ట్"

పుస్తకాన్ని సంపూర్ణంగా రాసి ప్రశంసలను పొందింది. ఇతర నగరాలలోని మేధావి వర్గంతో నిరంతరం సంప్రదింపులు జరిపేది. ఆమె అలెగ్జాండ్రియా మ్యూజియంలో నియో ప్లటానిక్ స్కూల్ ఆఫ్ ఫిలాసఫీలో ప్రొఫెసర్‌గా క్రీ.శ.400లో పనిచేసింది. ఖగోళం, గణితం, గ్రహాల కదలికపై పుస్తకాలు రాసి పేరు తెచ్చుకొంది. ఆమె క్లాస్‌లో కూర్చొని ఆమె బోధన వినాలని చాలామంది విద్యార్థులు ఆమెను వేడుకొనేవారు. సామ్రాజ్యంలో చాలా ప్రదేశాల నుంచి విద్యార్థులు వచ్చి అక్కడ చదివేవారు. రాజకీయంగా కూడా మంచి పలుకుబడి ఉండేది. ఆమెపై ఫోటో, ప్లోటినస్ ప్రభావం ఎక్కువగా ఉండేది. నిసియా అనే ఆమె స్నేహితుడు తాను రాసిన "ఆన్ డ్రీమ్స్" పుస్తకాన్ని ఈమెకు పంపి అభిప్రాయం కోరాడు. ఆ సబ్జెక్ట్‌లో ఆమెకే తగిన పాండిత్యం ఉందని అతని నమ్మకం. ప్లూటార్క్ కూడా ఆమెకు సహాధ్యాయి. సాధారణ స్త్రీలు ఆ రోజుల్లో కట్టుకొనే సాంప్రదాయ దుస్తులను ధరించేది కాదు. ఉపాధ్యాయులు వేసుకొనే బట్టలనే ధరించి బోధించేది. తన రథాన్ని తానే నడుపుకొనేది. ఆమె శాస్త్రవేత్త కూడా. Plane astrolobe, graduated glass hydrometer, hydroscope లను నిర్మించింది.

హిపాటియా క్రిస్టియన్ కాదు. ఆనాటి బిషప్ "సిరిల్" యూదులను తరిమి వేస్తుండేవాడు. దీన్ని ఆమె, ఆమెతోపాటు అలెగ్జాండ్రియా గవర్నర్ "ఒరేస్తేస్" కూడా వ్యతిరేకించాడు. అతను కూడా ఈమెలాగే నాన్ క్రిస్టియన్ (పాగాన్). ఇవన్నీ బిషప్‌కు నచ్చలేదు. ద్వేషంతో గవర్నర్ ఆరేస్తాస్‌ను చంపించాడు. హిపాటియా మగవారిలా దుస్తులు ధరించటం, లెక్కలు బోధించటం, సైన్స్ ప్రయోగాలు చేయుటం బిషప్ సిరిల్ సహించలేకపోయాడు. అతనిలో అసూయ నరనరానా వ్యాపించిపోయింది. వివేకం కోల్పోయాడు. ఆమె హద్దు మీరి ప్రవర్తిస్తోందని అందరి వద్దా వాపోయేవాడు. ఎవరు అతన్ని పట్టించుకోలేదు. దుష్ట పన్నాగం పన్నాడు.

క్రీ.శ.415లో బిషప్ సిరిల్ పీటర్ అనే కిరాతక అనుచరుడిని ఈమెను చంపటానికి ఏర్పాటు చేశాడు. హిపాటిస్ క్లాస్‌లో గణితం బోధిస్తుండగా, కిరాయి మూక క్లాస్‌లోకి ప్రవేశించి, వివస్త్రను చేసి, మంత్రగత్తె అని నిందమోపి, "సేసారియన్ చర్చి" వరకూ ఈడ్చుకొని వెళ్లారు. ఆమె సహాయం కోసం ఎంత అరిచినా ప్రయోజనం లేకపోయింది. ఎవరూ ముందుకు రాలేదు. మూగ రోదనే అయింది. అందరు చూస్తుండగా ఆమె కళ్ళు పీకేశారు. నాలుక కోసేశారు. ఆమె విలవిలలాడుతూ చనిపోతుంటే రాక్షసంగా నవ్వారు. చనిపోగానే అక్కసు ఇంకా తీరక ఆమె శవాన్ని "సినారాన్" అనే చోటికి తీసికొని వెళ్లి ముక్కలు ముక్కలుగా నరికారు ఆ నరరూప రాక్షసులు. అయినా వారికి తృప్తి కలగలేదు. ఆమె శరీరం లోపలి భాగాలన్నీ, ఎముకలతో సహా బయటికి తీసి, వీటినీ, ఆమెనూ తగులబెట్టారు. అంటే ఆమె

ఆడది అని గుర్తింపు నిచ్చేదాన్ని వాళ్ళు మిగలకుండా తగలబెట్టారు. ఇలా ఒక మహిళా శాస్త్రవేత్త హత్య గావింపబడటం చరిత్రలో ఇదే మొదటిది అని చరిత్రకారులు పేర్కొన్నారు. "థియోఫిలాస్" అనే చారిత్రకారుడు రాసిన "లైఫ్ ఆఫ్ ఇంసైడోర్" అనే పుస్తకంలో సిరిల్ చాలా అసూయతో హిపాటియా వల్ల క్రిస్టియన్ మతానికి ఏదో ఉపద్రవం కలుగుతుందని ద్వేషంతో ఒక శాస్త్రవిజ్ఞాని అయిన మహిళను చంపటం అతి కిరాతకం అని రాశాడు.

క్రీ.శ. 642లో అరబ్బులు అలెగ్జాండ్రియాను వశం చేసుకొనే వరకు "నియో ప్లటానిక్" విద్య కొనసాగింది. అరబ్బులు అలెగ్జాండ్రియాలోని అతి గొప్ప మ్యూజియంగా ఉన్న లైబ్రరీని తగులబెట్టారు. లక్షలాది పుస్తకాలు ధ్వంసమయ్యాయి. అందులో హిపాటియా రాసిన పుస్తకాలు కూడా ఉన్నాయి. అయితే ఆమె గురించి ఆమె శిష్యులు, స్నేహితులు చెప్పిన రాసిన దాన్నిబట్టే ఆమె చరిత్ర కొంత తెలిసింది. ❀

**('విహంగ' మహిళా వెబ్‌మేగజైన్‌లో ప్రచురితం)**



# 18. నల్ల వజ్రం నిక్కీ గివాని

**అ**మెరికాలో పౌరహక్కుల కాలంలో (అరవయ్యవ దశకం)లో వచ్చిన నల్లజాతి అంటే ఆఫ్రో అమెరికన్ రచయితల్లో నిక్కి గివాని అందర్నీ ఆకర్షించిన మంచి మహిళా రచయిత. ఉన్నదున్నట్లుగా మాట్లాడటం ఆమె పద్ధతి. స్వీయ వ్యక్తిత్వంతో ఆఫ్రికన్, అమెరికన్ యువతరాన్ని ప్రభావితం చేసి ఉత్తేజపరిచింది. నల్లజాతి విముక్తి పోరాటానికి నడుం బిగించింది. సాంఘిక దురన్యాయాలకు నెమ్మదిగా నిరసన తెలుపుతూ, క్రమంగా జాతి వివక్షతకు వ్యతిరేకంగా నిలిచి పోరాడింది. రెండవ నల్లజాతి రచయితల సమావేశం 1967లో పాల్గొని, ఆనాటి నేత అమిరీ బరాకా ప్రభావానికి లోనైంది. నల్లజాతి వారు విడిగా కొత్త సాహిత్యాన్ని, సర్వ స్వతంత్రంగా నిర్మించాలని నినదించింది. అప్పటివరకు ఉన్న అమెరికన్ ఇంగ్లీష్, యురోపియన్ సాహిత్య సంప్రదాయ పద్ధతులు శాశించే దారి వదిలి కొత్తదారి తొక్కాలని ఆలోచన చేసింది.

### బాల్యం – చదువు

ఆమె పూర్తిపేరు "యోలాందే గివాని జూనియర్". 1943 జూన్ ఏడున అమెరికాలో టెన్నిసి రాష్ట్రంలోని నాక్స్‌విల్లిలో జన్మించింది. బాల్యం సిన్సినాటిలో గడిచింది. మళ్ళీ నాక్స్‌విల్లి చేరి తాతయ్య ఇంట్లో ఉంది. ఫిస్క్ స్కూల్‌లో చేరింది. అనుమతి లేకుండా స్కూల్ మానేసినందుకు మొదటి సెమిస్టర్‌కు అనుమతించలేదు. సిన్సియాటి చేరి, అక్కడి యూనివర్సిటీలో రాత్రి తరగతులలో చేరింది. మళ్ళీ ఫిస్క్‌కు వచ్చి, సోషల్ సబ్జెక్ట్ తీసుకొని చదివింది. ఒక వర్క్ షాప్‌లో బ్లాక్ ఆర్ట్ ఉద్యమకారులైన బరాకా, జోన్స్‌లను చూసింది. అప్పటికే పౌరహక్కుల ఉద్యమం ఉధృతంగా నడుస్తోంది. నిషేధింపబడ్డ "స్టూడెంట్ నాన్

వయలెంట్ కో ఆర్డినేషన్ కమిటీ"ని పునరుద్ధరించింది. 1967లో ఆనర్స్ డిగ్రీ తీసుకొని సిన్సినాటికి వచ్చింది. 1968 ఏప్రిల్ నాలుగున పౌరహక్కుల నాయకుడు అమెరికన్ గాంధి మార్టిన్ లూథర్ కింగ్ జూనియర్ హత్య జరిగింది. గివాని హతాశురాలై అట్లాంటాలో జరిగిన ఆయన అంత్యక్రియలకు హాజరైంది. న్యూయార్క్‌లోని కొలంబియాలో ఉన్న స్కూల్ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్‌లో చేరింది. "సృజనాత్మక రచన" కోర్సు తీసుకొన్నది. కాని రాయలేనేమోనని భావించి డిగ్రీ తీసుకోకుండానే మానేసింది.

## ఉద్యోగం - రచనలు

ఆనర్స్ డిగ్రీ పొందగానే "బ్లాక్ ఫీలింగ్, బ్లాక్ టాక్" కవితా సంపుటాలను స్వయంగా ప్రచురించింది. విప్లవ జర్నల్ అయిన "కన్సేర్వేషన్" పత్రిక సంపాదకురాలైంది. సిన్సియాటిలో మొట్టమొదటి "బ్లాక్ ఆర్ట్స్ ఫెస్టివల్" నిర్వహించింది. డెలావర్‌కు మకాం మార్చి సెటిల్‌మెంట్ హౌస్‌లో పనిచేస్తుండగా, పెన్సిల్వేనియా వర్సిటి స్కూల్ ఆఫ్ సోషల్ వర్క్‌లో ఫోర్డ్ ఫౌండేషన్ ఫెలోషిప్ వస్తే చేరింది. కొంతకాలం చదివి మానేసింది. "బ్లాక్ జడ్జిమెంట్" అనే పుస్తకం రాయటంలో నిమగ్నమైంది. తర్వాత క్వీన్స్ కాలేజిలో విద్యాబోధన చేసింది. పుస్తకాలను స్వయంగా ముద్రించాలని ఆమె భావించింది. బర్డ్‌లాండ్‌లోని జాజ్‌క్లబ్‌లో కవిత్వం వినిపిస్తుంటే వందలాది మంది విని ఆనందించి ప్రోత్సహించేవారు. ఈ కథనం అంతా స్థానిక పత్రికలలో వస్తే పదివేల కాపీలు అమ్ముడయి రికార్డ్ సృష్టించింది. 1970 "బ్లాక్ జడ్జిమెంట్" పుస్తకాన్ని విడుదల చేసింది. చాలామంది చదివి మెచ్చారు. పెళ్లి చేసుకొని ఒక కొడుకును కన్నది.

## కవితా పఠనం - పాటల ఆల్బం

1970లో గివాని నికితాం ప్రెస్ ద్వారా నల్ల కవితలను మొదటి "ఆంత్రోపాలజీ"గా, "Night comes softly" పేర ప్రచురించి, తను ఎన్నాళ్ళ నుంచో అనుకొన్న కోరిక తీర్చుకొంది. తరువాత "సోల్" అనే టి.వి.ప్రోగ్రాం చేసింది. హార్లెంలో ప్రేక్షక సమూహాలకు కవితలను చదివి వినిపించి మెప్పు పొందింది. "స్పిన్ యే సాఫ్ట్ బ్లాక్ సాంగ్"ను ముద్రించి, రికార్డ్ చేసి మొదటి ఆల్బం "ట్రూత్ ఇస్ ఆన్ ఇట్స్ వే" పేర విడుదల చేసింది. దానికి మంచి ఆదరణ లభించింది. లండన్‌లో గివాని జేమేస్ బాల్డ్విన్‌కు ఇచ్చిన ఇంటర్వ్యూ స్క్రిప్ట్‌ను 1971లో ప్రచురించి ప్రాచుర్యం పొందింది. 1972లో ఆమె రాసిన "ట్రూత్" పాటల ఆల్బం "బెస్ట్ స్పోకెన్ వర్డ్ ఆల్బం"గా రికార్డు పొందింది. "మై హౌస్" అనే ఆమె పుస్తకం 1973 అమెరికన్ లైబ్రరి అసోసియేషన్‌వారి ఉత్తమ పుస్తకాల జాబితాలో చేరింది. ఆదర్శ కవి మార్గరేట్ వాకర్‌తో "టేప్డ్ డయలాగ్"ను ఇచ్చింది. "లేడీస్ హోం జర్నల్" "ఉమన్ ఆఫ్ ది యియర్" అవార్డ్ నిచ్చి సత్కరించింది. ముప్పైవ జన్మదివాన్ని న్యూయార్క్‌లోని లింకన్ సెంటర్‌లో కవిత్వం చదివి గడిపింది. ప్రభుత్వ ఆహ్వానంపై ఘనా, టాంజానియా, జాంబియా దేశాల్లో పర్యటించి

ఉపన్యాసాలనిచ్చింది. "Ego tripping and other poems for young readers"ను ప్రచురించింది. "Like a ripple on a pond" ఆల్బం విడుదల చేసింది.

## గౌరవాలు

కవిత్వంపై ఉదాహరణలతో మాట్లాడటం అంటే గివానికి చాలా ఇష్టం. ప్రత్యేక ప్రసారాలు, రికార్డింగులు అంటే మరీ ఇష్టం. అదే ఆమె వ్యాపకం అయింది. ప్రతి మాటను అర్ధవంతంగా ప్రయోగించటం, ప్రయోగాత్మకంగా, ప్రబోదాత్మకంగా రాయటం ఆమె ప్రత్యేకత. ఇంగ్లీషు భాష భావ వ్యక్తీకరణకు సరిపోదు అని ఆమె నిశ్చితాభిప్రాయం. "ఇంగ్లీష్‌లో అందరు మాట్లాడతారు కాని, ఇంగ్లీష్ మాట్లాడరు" అంటుంది. మరి తనకు సరైన భాష ఏది అని అడిగితే "ఆఫ్రికాలో మాట్లాడే భాష" అంటుంది (African oral tradition). నల్లజాతి స్త్రీలు అంటే అత్యంత అభిమానం. మగవారిని "బ్యూటిఫుల్ బ్లాక్ మెన్" అని అన్నా, వారి భావాలన్నా, మొరటు ప్రవర్తన అన్నా ఆమెకు కోపం. వారికి నల్లజాతి స్త్రీలంటే ఇష్టం ఉండదు అని గట్టిగా చెప్పింది. అందుకే "ఉమెన్" అనే కవితలో "It is a sex object if you are pretty and no love or no love and no sex if you are fat - get back fat black women be a mother - grand mother strong thing but no women" అని నిర్భయంగా నల్ల మగవారి ఆంతర్యాన్ని ఆవిష్కరించింది.

1970–80 కాలంలో రెండు వందల కవిత్వపు రీడింగులు, ఉపన్యాసాలు ప్రతి సంవత్సరం ఇచ్చింది. సంవత్సరానికో పుస్తకం, ఒక ఆల్బం విడుదల చేసింది. ఎన్నో సంస్థలు, కమీషన్లు, ప్రజా సంబంధ శాఖలు ఆమెను ఆహ్వానించాయి. అయినా విద్యాబోధన మానలేదు. ఒహాయో, మిన్నిసోటా, వర్జీనియా విశ్వవిద్యాలయాలలో విజిటింగ్ ప్రొఫెసర్‌గా పనిచేసి గౌరవం పొందింది. 1989లో "బ్లాక్ స్టడీస్"లో ఇంగ్లీష్ ప్రొఫెసర్‌గా పనిచేసి పదవీ విరమణ చేసింది.

90వ దశకంలో డజన్ల కొద్దీ డాక్టరేట్లు ఆమెను వరించాయి. ఎన్నో సాహిత్య, పౌర సంస్థలు ఆమెకు అవార్డులిచ్చి సత్కరించారు. ఒక డజన్ నగరాల తాళం చెవులను (కీస్)లను ఇచ్చి అత్యధిక గౌరవం చూపారు. ఒహాయో ఉమెన్స్ హాల్ ఆఫీస్‌కు ఎన్నుకోబడింది. టెన్నిసి రాష్ట్రం రాష్ట్ర ప్రముఖ మహిళా పురస్కారం ప్రదానం చేసింది. "రోజా పార్క్ ఉమెన్ ఆఫ్ కరేజ్" అవార్డు పొందింది. ఎబని, మాడే మోసిల్లి, ఎసెన్స్ పత్రికలూ ఆమెను "ఉమెన్ ఆఫ్ ది యియర్"గా ప్రకటించి గౌరవించాయి. N.A.A.P అవార్డ్‌ను మూడుసార్లు దక్కించుకొన్న అరుదైన నల్లజాతి సాహితీ మూర్తి ఆమె. ఎన్నో పిల్లల పుస్తకాలు రాసింది. స్వీయ చరిత్రను రాసుకొన్నది. అది ఒకరకంగా నల్లజాతివారి చరిత్రే. నేషనల్ బుక్ అవార్డ్‌కు నామినేట్ అయింది. ఆమె వ్యాసాలను "సేక్రెడ్ కౌస్ అండ్ అదర్ ఎడిబుల్స్"గా ప్రచురించింది. లంగ్

కేన్సర్ వ్యాధికి గురి అయినా విజయవంతమైన ఆపరేషన్‌తో జీవించింది. 2005లో staan ford తో కలిసి "బ్రేకింగ్ ది సైలెన్స్", "ఇన్స్పిరేషన్ స్టోరీస్ ఆఫ్ బ్లాక్ కాన్సర్ సర్వైవర్స్" పుస్తకాలను సంపాదకత్వం వహించి విడుదల చేసింది.

నల్లజాతి అని పిలువబడే ఆఫ్రో అమెరికన్లు సామాజికంగా, ఆర్థికంగా, రాజకీయంగా చైతన్యవంతులు కావాలని, వారిలో ఈ భావదీప్తి ప్రజ్వలించాలని అహరహం శ్రమించిన అలుపెరగని పోరాట యోధురాలు గివాని. అందుకోసం కొత్త ఆలోచనలను, కొత్త పోకడలను ఆహ్వానించింది, అమలు జరిపింది. మాటలు కాక చేతల్లో సత్తా చూపించింది. నల్లవారి శక్తిని నిరూపించింది. నలుపులో అందం ఉందని తెలియజెప్పింది. నల్లవారినందర్నీ ఏకోన్ముఖులను చేసి బ్లాక్ పాన్థర్స్‌ను ఏర్పాటు చేసి తమ అస్తిత్వాలను మేల్కొల్పింది. తమ జాతిలోని వారి త్యాగాలను, కష్టాలను, అంకిత భావాన్ని వెలుగులోకి తెచ్చే రచనలు చేసి జాగృతి నింపింది. మాండలికాన్ని ప్రోత్సహించి, తానూ ఆ బాటలో నడిచి ఆదర్శవంతురాలై "నల్ల వజ్రం"గా వెలిగింది నిక్కిగివాని. ❀



## 19. ప్రజా కవయిత్రి – ఫీలిస్ మెక్ గిన్లీ

"నేను బాగా ఉపయోగపడేదానిని అని నా నిశ్చితాభిప్రాయం. యూనివర్సిటిలకు మాత్రమే కవిత్వం పరిమితమైపోయిఇజీ, సామాన్యులకు సంబంధం లేకుండాపోయిన కాలంలో, నేను నా కవిత్వం వల్ల లక్షలాది చదువరులకు చేరువైనాను. కవిత్వ ద్వారాలు తెరిచి, గొప్ప కవిత్వం వైపుకు మార్గదర్శకత్వం చేసి, వారిని నడిపించాను" అని సగర్వంగా ప్రఖ్యాత టైం మేగజైన్‌కు ఇంటర్వ్యూలో చెప్పిన ప్రముఖ అమెరికన్ ఆధునిక కవయిత్రి "ఫిలిస్ మెక్ గిన్లి".

ఆధునిక అమెరికా సాహిత్య చరిత్రలో నలభై ఏళ్ళకు పైగా లలిత కవిత్వాన్ని (light verse) రాసి ప్రజాభిమానాన్ని పొందిన కవయిత్రి ఆమె. రెండవ ప్రపంచ యుద్ధానికి దశాబ్దం ముందే కవిత్వ రచన ప్రారంభించి, ఆ తర్వాత మూడు దశాబ్దాలు పాటు అప్రతిహతంగా రాసి, విజయ బావుటాను ఎగరేసిన గొప్ప రచయిత్రి. సమకాలీన కవులందరి కంటే ముందుకు దూసుకుపోయింది. హాస్యం, వ్యంగ్యం జోడించి సమకాలీన విషయాలను వెలుగులోకి తెచ్చింది. ప్రజా జీవితానికి అద్దం పట్టింది. మేటి పత్రికలైన "న్యూయార్కర్", "సాటర్ డే ఈవెనింగ్ పోస్ట్" పత్రికలలో ఆమె రచనల చోటు చేసుకొన్నాయంటే ఎంత గొప్ప రచనలు చేసిందో తెలుస్తుంది.

### బాల్యం – విద్య

1905 మార్చ్ 11న గిన్లి అమెరికాలోని ఓరిగాన్ రాష్ట్రం ఒంటారియాలో జన్మించింది. తండ్రి రియల్ ఎస్టేట్ వ్యాపారాన్ని చేసి నష్టపోతూ తరచుగా వూళ్ళు మారుస్తుండేవాడు. అందుకని ఆమె బాల్యం ఒక ఊరికే పరిమితం కాలేదు. చివరికి కొలరేడాలోని ఐలిఫ్ అనే మారుమూల ప్రాంతానికి కుటుంబాన్ని మార్చాడు. అక్కడ తమ్ముడితో వంటరిగా ఉండాల్సి

వచ్చింది. పన్నెండవ ఏటే తండ్రి మరణం. తల్లి "ఊతా"కు వీరిని తీసుకొని వెళ్లి ఉంది. అక్కడి యూనివర్సిటిలో చేరింది కాని తానేమీ పెద్దగా నేర్చుకొన్నదేమీ లేదని చెప్పింది. కవిత్వం, కథ, వ్యాస రచన పోటీల్లో పాల్గొని రెండుసార్లు నగదు బహుమతి సాధించింది. అప్పటికే ప్రసిద్ధ పత్రికలకు రాసేది. న్యూయార్కర్ పత్రిక వాటిని స్వీకరిస్తూనే "మీ స్త్రీలందరూ రాసే ఏడుపుగొట్టు కవిత్వాన్నే, నువ్వూ ఎందుకు రాసి ఏడిపిస్తావు? ఏదైనా కొత్తగా రాయటానికి ప్రయత్నించు" అని సున్నితంగా సలహా కూడా ఇచ్చాడు సంపాదకుడు. అది మనసులో పడి, నచ్చి కొత్తగా రాయటం ప్రారంభించింది.

గిన్లి న్యూయార్క్ చేరింది. రాయటం, ప్రచురించటం ప్రారంభించి కొనసాగించింది. హాస్యం, వ్యంగ్యం కలిపి జోడించి మనసులకు చేరువైంది. జూనియర్ స్కూల్‌లో టీచర్ ఉద్యోగమూ చేసింది. ఆమె హాస్యం ఆ ప్రిన్సిపాల్ వంటికి పడలేదు. మానేసి "టౌన్ అండ్ కంట్రి" పత్రికలో చేరింది. బెల్ టెలిఫోన్‌లో పనిచేస్తున్న చార్లెస్ హేడెన్సుకు చేరువై పెళ్లిచేసుకొన్నది. ఇద్దరు కూతుళ్ళు పుట్టారు. చిన్నప్పటి నుంచి స్వంత ఇల్లు ఉండాలని కలలు కనేది. ఆ కలను భర్త సాఫల్యం చేశాడు. న్యూయార్క్ దగ్గర్లో ఇల్లు కొని సంతోషం కలిగించాడు. అక్కడ రచనా వ్యాసంగాన్ని అప్రతిహతంగా సాగించింది.

### పేరు ప్రఖ్యాతలు

అప్పుడు ప్రపంచాన్ని ఆర్థిక డిప్రెషన్ కుంగదీస్తున్న కాలం అది. ఆమె తెలివిగా, తమాషాగా నిత్య జీవిత విషయాలను హాస్యంతో రంగరించి రాసింది. ఆ టెన్షన్ నుంచి తట్టుకోవటానికి అవి బాగా ఉపయోగపడ్డాయి. పేరు ప్రఖ్యాతలు బాగా వచ్చాయి. ఎగబడి చదివారు జనం. కుటుంబ బంధాలు, కష్ట సహిష్ణుత, సాధారణ తెలివితేటలు మొదలైన వాటిపై రచనలు చేసి మెప్పించింది. 1934లో మొదటి కవితా సంకలనం "ఆంది కాంట్రరి" తెచ్చింది. ఆ తర్వాత మూడు సంకలనాలు ప్రచురించింది. ఇల్లాలి ముచ్చట్లు, ఇంటి గుసగుసలు లాంటి గృహ సంబంధ విషయాలు రాసి అందరికి చేరువయింది. వ్యంగ్యం ఆలంబనగా ఆమె కవిత్వం ఉండటంతో జన హృదయాలను పట్టుకొన్నాయి. ఆనంద సంతోషాలను కల్గించాయి.

కుటుంబ వ్యవహారాలే కాదు సాంఘిక కార్యక్రమాలలోను పాల్గొంది. ఆనాడు bright young అనిపించుకొన్నా ఆడెన్ వంటి యువకవులు యుద్ధ నినాదాలతో లెక్చర్లతో రాజకీయాలను చెరిగి పారేస్తున్నారు. వారంతా హాయిగా ఉన్నత ఉద్యోగాలు చేస్తూ, కుర్చీలకే పరిమితమైనవారు. వారిపై "stones from the glass house", "Small wonder" వంటి మ్యూజికల్ లిరిక్స్ రాసి ప్రచురించింది. ఆమె ప్రతిభకు తగ్గ పురస్కారాలు లభించాయి. గౌరవాలు దక్కాయి. National academy of arts and letters కు ఎన్నిక అయింది.

లైట్‌వేర్స్‌లో పులిట్జర్ బహుమతి ఒందిన మొదటి మహిళగా గుర్తింపు పొందింది. బాలల కోసం డజనుకు పైగా పుస్తకాలు రాసింది. అమెరికా, అమెరికన్ స్కాలర్, రీడర్స్ డైజెస్ట్ వంటి పేరున్న పత్రికలలో ఆమె రచనలు చోటు చేసుకొని ఆమెకు గౌరవాన్ని కల్గించాయి. ఆనాటి ప్రసిద్ధ చర్చి బిషప్పులతో ప్రముఖ రచయితలైనా జూన్ అప్డైక్ వంటి వారితో, మెకార్డీ, రాక్ ఫెల్లర్ వంటి రాజకీయ నాయకులతో థియేటర్ ఆర్టిస్టలతో ఆమె ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపింది. 1968లో వచ్చిన న్యూయార్క్ అబార్షన్ యాక్ట్ పానెల్ కమిటీలో సభ్యురాలైంది.

1965 జూన్ 18 టైం మేగజైన్ ఫిలిస్ మెక్ గిన్లి ముఖచిత్రం వేసి ప్రచురించి ఆమె ఖ్యాతికి నీరాజనం పట్టింది. గృహానికి పరిమితమైనా ఆమె తనపై విమర్శలు చేసినవారిని దృష్టిలో ఉంచుకొని సమాధానంగా "సిక్స్ పెన్స్ ఇన్ హర్ షో"లో ఎంత చదువుకొన్న వారికైనా సుఖ సంతోషాలు ఇంటిలోనే సాధ్యం అని చెప్పింది. ఆడవారు ఇంట్లోనే ఉండటం వారికే కాక సమాజానికీ మంచిది అని తెలియజేసింది. గృహిణి మిగిలిన వారికంటే విచక్షణ జ్ఞానం ఎక్కువగా కలిగి ఉంటుందని, రాజకీయాలకు చక్కని భాష్యం చెప్పగలదని, పేపర్లో వచ్చే విషయాలను బాగా విశ్లేషించగలదని, భర్తల వ్యాపార లావాదేవీలలో స్పష్టమైన సలహా ఇవ్వగలరని, వారికి సహాయకారిగా ఉండగలరని స్పష్టం చేసింది. పిల్లలకు వినోదాన్ని గృహిణి మాత్రమే పంచగలదని ఆమె నిశ్చితాభిప్రాయం. ఇప్పటికే పుస్తకాలు, సంగీతం, నాటకం, చిత్రలేఖనం మొదలైన రంగాలలో స్త్రీలు గొప్ప సాంస్కృతిక వినియోగదారులుగా చెలామణిలో ఉన్నారని కుండ బద్దలుకొట్టింది. "మహిళలుగా, ఇల్లాండ్రుగా మేము రాబోయే తరాలను ప్రభావితం చేయగల శక్తి సంపన్నులం. ఆడ, మగ తమ పరిధుల్లో తాము పని చేసుకొనిపోతూ ఉంటే ఎవరికి ఏ ఇబ్బంది ఉండదు. గృహ ధర్మానికి భంగం కలుగనంత వరకు ఇంటికి, బయట సాంఘిక సేవ చేయటం మంచిదే". అని తన సిక్స్ పెన్స్ రచన ముగించింది. ఉన్నది ఉన్నట్లుగా మాట్లాడటం చెప్పటం రాయటం గిన్లి ప్రత్యేకత. అందుకే ఆమెకు అందరు అభిమానులున్నారు. ఆ పుస్తకం ఒక లక్ష కాపీలు అమ్ముడుపోయింది అంటే ఆమె పాప్యులారిటి ఎంత గొప్పదో, ఆమె ప్రభావం ఎందరి మీద ఉందో అర్థం అవుతుంది.

గిన్లి రాసిన వచన రచనలు Province of the heart, ìWonderful timeî, Saint watching పుస్తకాలు విశేష ఆదరణ పొందాయి. 1972లో భర్త చనిపోయే వరకు రాస్తూనే ఉంది. 1978 ఫిబ్రవరి 22న గిన్లి ఇహ జీవితాన్ని చాలించింది. ❁



# 20. హిల్డా దూ లిటిల్

**H.D.**గా అని అందరికి సుపరిచితమైన రచయిత్రి, కవి హిల్డా దూ లిటిల్. ప్రముఖ ఇమేజిస్ట్ కవులు ఎజ్రాపౌండ్, మూర్‌ల చేత ఇమేజిస్ట్ ముద్ర పడినకవి. అమెరికా కవయిత్రి ఆమె రచనలు సూటిగా గ్రీకువారి మాటల్లా ఉంటాయని ప్రశంస పొందింది. ప్రయోజనాత్మక కవిత్వం రాసి మెప్పు పొందింది. ఇమేజిస్ట్‌ల ప్రభావం నుంచి క్రమంగా దూరమైనా, ఇంకా ఆమెను అలాగే భావిస్తారు.

హిల్డా అమెరికాలోని పెన్సిల్వేనియాలో బెతేల్హాంలో 1886 సెప్టెంబర్ పదిన జన్మించింది. తండ్రి ఆమెకు ఖగోళం, గణితం బోధించాడు. పెన్సిల్వేనియా యూనివర్సిటీలో ప్రొఫెసర్‌గా, ఫ్లవర్ అబ్సర్వేటరి డైరెక్టర్‌గా పనిచేసింది. తల్లి ప్రొటెస్టంట్ మతంలో అసమ్మతి వర్గానికి చెందిన మొరోవియన్ బ్రదర్‌హుడ్‌లో సభ్యురాలు. దేవునితో ప్రత్యక్ష అనుభవం ఉన్నట్లుగా తల్లి భావించేది. కూతురు కూడా తన కవితా ప్రతిభ దైవీకృతం అన్నది. క్వేకర్ స్కూల్‌లో, బ్రియాన్ మార్ కాలేజిల్లో విద్య నేర్చింది. మిరియాన్ మూర్ అనే ఆర్టిస్ట్‌తో పరిచయం కలిగింది. ఎజ్రాపౌండ్‌తో సరస సల్లాపాలు సాగించింది. తర్వాత విలియమ్స్ కవితో క్లోజ్‌గా ఉంది. కాలేజిలో కొద్దికాలమే చదివింది. పౌండ్, గ్రెగ్‌ల ప్రవర్తనతో మానసికంగా కుంగిపోయి, డిప్రెషన్‌లో పడింది. ఈ విషయాన్ని స్వీయచరిత్ర Hermioneలో రాసుకొన్నది. గ్రెగ్, అతని తల్లితో యూరప్ పర్యటనకు వెళ్ళింది. లండన్‌లో పౌండ్ ఆమెను ప్రముఖులకు పరిచయం చేశాడు. అప్పటికి ఇంకా జేమ్స్ జాయిస్ వెలుగులోకి రాలేదు. లారెన్స్‌తో స్నేహం చేసింది. ఈ విషయాన్ని పుస్తకంలో ఆలింగన్ రాశాడు. పౌండ్ ఒంటెత్తు పోకడలకు విసిగిపోతుంది. ఆలింగన్ ఆమెను ఫ్రెంచ్ సింబాలిజం అధ్యయనం చేయమని

ప్రోత్సహించాడు. దానిపై దృష్టి పెట్టింది.

1913లో ఆలింగన్‌ను పెళ్ళాడింది. పౌండ్, భర్తల సహకారంతో 'ది ఈగోయిస్ట్' పత్రికా సంపాదకురాలు అయింది. 1917లో భర్త "గ్రేట్ వార్"లో పనిచేయటానికి వెడితే, సిసిలీ గ్రే అనే సంగీత కళాకారుడితో వ్యవహారం నడిపింది. న్యూ మోనియా వచ్చి బాధపడింది. బ్రిహర్ అనే నవలా రచయితతో పరిచయం పొంది, చివరిదాకా కొనసాగించింది. అతడు ఇంకో అమ్మాయి మెక్ ఆల్మన్‌తో ప్రేమాయణం సాగిస్తే వారితో పాటే పారిస్ చేరింది. ఆమె రచనలను సరిదిద్ది ప్రచురించింది. 1921లో "హైమెన్" అనే కవితా సంకలనాన్ని ప్రచురించింది హిల్డా. ఆ తర్వాత 'హిప్పోలిటస్ టంపొరైజెస్, ది రెడ్ రోజెస్ ఫర్ బ్రాంజ్ ' కవితా సంకలనాలను విదుదల చేసింది.

బ్రిహర్ భార్యకు విడాకులిచ్చాడు. కెన్నెత్‌ను కళ్యాణం ఆడాడు. ఆమె సినీ నిర్మాత. భార్యాభర్తలు "క్లోజప్" అనే జర్నల్ నడిపారు. హెచ్.డి. మూడు సినిమాల్లో కన్పించింది. ఫిలిం డైరెక్టర్లతో పరిచయం పెంచుకొంది. బ్రిహర్ ఆమెను ఇటలి తీసుకొని వెళ్లి సిగ్మండ్ ఫ్రాయిడ్‌కు పరిచయం చేశాడు. ' ట్రిబ్యూట్స్ టు ఫ్రెండ్స్' అనే విశ్లేషణాత్మక రచన 1956లో చేసింది. అందులో ఫ్రాయిడ్ జబ్బులు కనిపెట్టే విధానం తప్పు అని తేల్చింది. తర్వాత బ్రిహర్ కుటుంబంతో స్విట్జెర్లాండ్ వెళ్ళి:ది. నాజీల ఘోర కృత్యాలకు బలైపోతున్న యూదులను, వామపక్షీయులను తప్పించటానికి బ్రిహర్ సరిహద్దు దాటి వారిని తప్పించుకోనేట్లు సాయం చేశాడు.

రెండవ ప్రపంచ యుద్ధం కాలంలో లండన్ నగరంలోని హైడ్ పార్క్ దగ్గర్లో కాపురం ఉండేవారు. అతను Life and letters today అనే మాగజైన్ ప్రచురించేవాడు. కొత్త వచనం కవిత్వం మీద డూ లిటిల్ శ్రద్ధ వహించింది. The walls do not fall అనే కవితలో యుద్ధ సమయంలో లండన్ వణికిపోతున్న స్తితిని కళ్ళకు కట్టినట్లు వర్ణించింది. ఆ తర్వాత Tribute to angels, Flowering of the rod కవితా సంకలనాలను తెచ్చింది. ఈ మూడిటిని Triology అంటే త్రయం అంటారు. ఆ తర్వాత ఆమె ఆధ్యాత్మిక భావనలో మునిగిపోయింది. తంత్ర శాస్త్రం, Tarot cards వంటి వాటి మీద దృష్టి ఎక్కువైంది. యుద్ధానంతరం నరాల బలహీనత బాధించింది. స్విస్‌లో చికిత్స చేయించుకొన్నది. అయినా ఆమెలోని కవితావేశం ఆగలేదు. నిత్య శ్రోతస్విని ప్రవహిస్తూనే ఉంది. 1957లో "సెలెక్టడ్ పోయెమ్స్" ప్రచురించింది. 1960, 61లలో Bid me to live, Helen in Egypt అనే నవలలను రాసింది. చివరిసారిగా 1960లో అమెరికా వచ్చి వెళ్ళింది. అప్పుడామెకు American academy of arts and letters మెడల్ బహూకరించారు. 1961లో జూరిచ్ వెళ్ళింది. అక్కడే తీవ్రమైన గుండెపోటు వచ్చి మరణించింది.

ఆమె మరణించిన తర్వాత ఆమె కవిత్వాన్ని అధ్యయనం చేయటం ఎక్కువైంది. సాహిత్య చరిత్రకారులు దృష్టిని కేంద్రీకరించారు. Her self defined అనే జీవిత చరిత్ర రాశారు. The poet HD and her world 1984లో వచ్చింది. ప్రముఖ విమర్శకులందరూ ఆమె సాహిత్యంపై పరిశోధనలు చేస్తూ గ్రంధాలు రాస్తూనే ఉన్నారు. ఆమె పేరు "Doo Litil" అయినా "Did a great job" అనిపించుకొన్నది హిల్డా డూ లిటిల్. మచ్చుకు ఆమె కవిత ఒక్కటి చూద్దాం.

Walls do not fall
an accident here and there-and rails gone (for guns) - from your (and my) old town square
must and must gray not colour - still the luxor bee - chick and hare - pursure un alterable purple
for I know how the lord god - is about to manifest when I - the industrious worm - spin my own shroud.❀



## 21. మార్గదర్శి మార్గరెట్ అట్‌వుడ్

**క**వి, రచయిత, సమాజ సేవకురాలు, సాంస్కృతిక చరిత్రకారిణి, పత్రికా సంపాదకురాలు, బాల సాహిత్య సృష్టికర్త, అన్నిటికి మించి మంచి అధ్యాపకురాలు మార్గరేట్ అట్‌వుడ్. సృజనాత్మక సాహిత్య రచనలో నలభై ఏళ్ళు ప్రజలను ప్రభావితం చేసి సమకాలీన రచయితల్లో అన్నిటా అగ్రగామిగా నిలిచింది అట్‌వుడ్. అన్ని సాహిత్య ప్రక్రియలను సుసంపన్నం చేసింది. మేటి విమర్శకుల మెప్పు పొందిన విదుషీమణి. మహిళోద్యమ నాయకురాలు. పర్యావరణ రక్షకురాలు. మానవ హక్కుల పోరాటంలో అగ్రగామిగా నిలిచిన ధీరవనిత. ఆమె జీవితంలో అధికారం ఆమెకు గొప్ప వరమే అయింది. జీవన పోరాటంలో ఎదుర్కొంటున్న అనేక సమస్యలపై కవిత్వము, రచనలు చేసి తరాలను ప్రభావితం చేసిన మాననీయురాలు. బహుముఖ ప్రజ్ఞాశాలి.

ఫిక్షన్‌లో పేరు పొందినా ఆమె సాహితీ జీవితం కవిత్వంతో ఆరంభమైంది. అద్భుత కవిత్వాన్ని వర్షించింది. నవలలు, కథలు, మానవ జీవిత చరిత్ర (Anthropology) అనేక సాహిత్యేతర అంశాలు, విమర్శ రాసి పుంఖాను పుంఖంగా పుస్తకాలను విడుదల చేసింది. ఆమె రచనలు చాలా భాగం ప్రజాపక్షమే అయినా, కవిత్వం మాత్రం ఆమె స్వంతమే. సాంద్రంగా, భావస్ఫోరకంగా, సూటిగా ఆమె కవిత్వం ఉండటంతో మనసును ఇట్టే ఆకర్షిస్తాయి. వాటిల్లో మానవులు ప్రకృతికి దూరమైన వాదాలతో, వివేకంతో, ఆలోచనా ధోరణితో, ఇతిహాసాల కథలను ఆధారంగా చేసుకొని ఆమె రచనలు చేసింది. నాటకీయ ముగింపులు, మాటల్లో అమిత శక్తి ఆమెకు పెద్ద వరాలైనాయి.

## బాల్యం - విద్యాభ్యాసం

అసలు పేరు మార్గరేట్ ఎలినార్ అట్‌వుడ్. అమెరికాలో ఒంటారియా రాష్ట్రంలో అట్టావాలో 1939 నవంబర్ పదిన జన్మించింది. తండ్రి జంతు శాస్త్రవేత్త. అరణ్య ప్రాణులపై పరిశోధన కోసం ఉత్తర క్యుబెక్ అడవులకు తరచుగా వెళ్ళేవాడు. కుటుంబం ఆయనతోనే ఉండటం వల్ల ఎనిమిదవ తరగతి వరకు మాత్రమే చదువు సాగింది. అయితేనేం అందిన ప్రతి పుస్తకం చదివింది. క్లాసిక్స్ నుంచి కామిక్స్ దాకా దేన్నీ వదలకుండా చదివేసింది. కెనడా దేశం మీద అభిమానం పెరిగింది. Wilderness tips qnd other storiesలో తన అనుభవాలన్నిటిని రాసేసింది. కుటుంబం తర్వాత కెనడాలోని torento చేరింది. అక్కడి యునివర్సిటిలోని విక్టోరియా కాలేజిలో చదివింది. అక్కడి అధ్యాపకులు సాహిత్యకారులు, సాహితీ విమర్శకులు అయిన ఫెయిర్, మాక్ ఫెర్సన్‌ల దృష్టిని ఆకర్షించింది. వారి ప్రభావం ఆమెపై గాఢంగా పడింది. మొదటి పుస్తకం "డబల్ పెర్స ఫోన్" స్వంతంగా ప్రచురించింది. ఇది గ్రీకు మైథాలజీలోని స్త్రీలను ఉద్దేశించి రాసిన కవితలు. దీనికి E.J.Pratt మెడల్‌ను మొదటిసారిగా అందుకొంది. ఉడ్రో విల్సన్ ఫెలోషిప్‌తో హార్వర్డ్ ఉమెన్స్ కాలేజిలో చదివి, ఆ తర్వాత విక్టోరియన్ సాహిత్య పరిశోధన కోసం పి.హెచ్.డి. కోర్సుకు చేరి పూర్తి కాకుండానే ఆ డిగ్రీ పొందకుండానే మానేసింది. కాని ఆ తర్వాత డజన్ల కొద్దీ గౌరవ డాక్టరేట్లను అందుకొన్న విద్యారాణి అనిపించుకొంది.

## ఉద్యోగం - రచనా వ్యాసంగం

టోరంటోలో "అనంసి ప్రెస్"లో ఎడిటర్‌గా చేరి "Survival - S thematic guide to cannadian literature" రచన చేసి జాతీయ స్థాయి గుర్తింపు పొందింది. కెనడా స్వాతంత్ర పోరాటం, జాతీయ అస్తిత్వం, శతాబ్దాల బ్రిటీష్ పాలకుల అకృత్యాలు, అన్యాయాలు దాష్టీకం అణచివేతలను అద్భుతంగా చిత్రించిన రచన ఇది. దీనితో కెనడా సాహిత్య స్వతంత్ర రచనా వారసత్వానికి ఆద్యురాలు అనిపించుకొంది. తాను ఆక్స్‌ఫర్డ్‌లో చేసిన ఉపన్యాసాలను ఆధారంగా "The strange thing - The melovelent North in Canadian literature" పుస్తకాన్ని రాసి జన జాగృతి చేసింది.

తర్వాత రెండు చిన్న కవితా సంకలనాలు మొదటి నవల మొత్తం అయిదింటిని అతి తక్కువ కాలంలో రాసి ప్రచురించింది. తన తరం ప్రసిద్ధ రచయితగా గుర్తింపు లభించింది. "The animals of that country", "The journals of susannaa", "moodee" రచనలు ఆమెకు గొప్ప పేరు తెచ్చాయి. రెండోది కెనెడియన్ పయనీర్ చరిత్ర. అంటే ఆ దేశాన్ని మలుపు తిప్పిన మహనీయుల చరిత్ర. తరువాత నవలలు రాసి మెప్పుపొంది నవలా రచయితగా చిరస్థాయి పొందింది. వాటిలో ముఖ్యమైనవి - Procedures for under

ground, power politics, you are happy, lady oracle, suffering, Edith women. ఆమె రాసిన The handa maidís tale ఆర్థర్ సి.క్లార్క్ అవార్డ్ పొందింది. అది సినిమాగా కూడా తీశారు. ఇప్పటికే లబ్ధ ప్రతిష్ఠురాలైన నవలా రచయిత అని గుర్తింపు వచ్చింది. కవిత్వం వెనకడుగు వేసింది. ఆమె కవిత రాసినా, నవల రాసినా జీవన పోరాటం అందులో ఉంటుంది. అంటే సర్వైవల్‌ను దృష్టిలో పెట్టుకొనే ఏదైనా రాసింది. ఆమె నవలలోని నవలామణులు అధికార పోరాటంలో నలిగిపోవటం సర్వసాధారణం. వ్యంగ్యాన్ని మేళవించి రచనకు జీవం పోస్తుంది. మార్గరేట్ బ్రిటీష్ కొలంబియా, మాంట్రియల్, ఆల్బెర్తాలలో బోధన చేసింది. టోరంటోలోని న్యూయార్క్ వర్సిటిలో అధ్యాపకురాలైంది. న్యూయార్క్, ఆస్ట్రేలియా, అలబామాలలో "రైటర్ ఇన్ రెసిడెన్స్"గా పని చేసింది. గ్రీన్ గిబ్బన్ అనే నవలా రచయితను పెళ్ళాడింది. 1982లో "సెకండ్ వర్డ్స్", "సెలెక్టెడ్ క్రిటికల్ ప్రోస్" రాసింది. "ది న్యు ఆక్స్‌ఫర్డ్ ఆంథాలజి ఆఫ్ కెనెడియన్ వెర్స్"కు ప్రధాన సంపాదకురాలి గౌరవం పొందింది. ప్రతిభకు తగ్గ ప్రతిఫలం లభించింది.

ఎనభైవ దశకంలో అట్‌వుడ్ రాసిన నవలలన్నీ కెనడా, బ్రిటన్ దేశాల బహుమతులను సాధించినవే. "కాట్స్ ఐ" అన్నది 1988లో రాసింది. ఇదీ బహుమతి పొందింది. 1970-2006 మధ్యకాలంలో తొమ్మిది సంపుటాల షార్ట్‌స్టోరి ఫిక్షన్, మూడు ఆంత్రోపాలజీలు ఎడిట్ చేసింది. అందులో రెండు ఆక్స్‌ఫర్డ్ కోసం చేసినవి ఉన్నాయి. అరడజన్‌కు పైగా బాల సాహిత్య పుస్తకాలు రాసింది. Negotiating with dead, a writer on writing with intent, essays, reviews, personal prose వంటివి ఎన్నో రాసింది. రాసినవన్నీ వన్నె, వాసి గలవే. నవలమీద దృష్టి ఎక్కువ అవటంతో కవిత్వం పలచబడింది. అయితేనేం 2007లో "ది డోర్" కవితా సంకలనంతో తానేమీ వెనకపడి లేదని సామర్థ్యాన్ని రుజువు చేసుకొంది. అభిమానం కూడా పెంచుకొంది. కవిగా తన స్థానం ఎప్పుడు అగ్రభాగమే అని రుజువు చేసింది.

"రైటర్స్ యునియన్ ఆఫ్ కెనడా"కు ఆఫీసర్ అయింది. "P.E.N."కు ప్రెసిడెంట్ అయి, రాజకీయ ఖైదీలుగా బందీలైన రచయితలను విడిపించే అవకాశాన్ని పొందింది. వారి తరపున తీవ్ర పోరాటమే చేసింది. మార్గరేట్ రాసిన "బ్లైండ్ అస్సాసిన్" అనే నవలకు 2000 సంవత్సరంలో "బుకర్ ప్రైజ్" వస్తే వారు అందజేసిన 50,000 డాలర్ల భారీ నగదు పారితోషిక ధనాన్ని "Environmental group"కు ఉదారంగా ఇచ్చిన త్యాగమూర్తి ఆమె. మాటల్లోనే కాదు చేతల్లోను తనకు సాటిలేరని నిరూపించుకొంది. గత పాతిక ఏళ్లుగా ఆమె సాహిత్యంపై నిరంతర అధ్యయనం జరుగుతూనే ఉంది. ఎన్నో పరిశోధనాత్మక గ్రంథాలను వెలువరించారు. వెలువరిస్తూనే ఉన్నారు. అందులో ముఖ్యమైనది "The cambridge companion to

M.Atwood" అనేది రెండు వేల సంవత్సరంలో ప్రచురితమైనది. ఇంకో పుస్తకం "అట్‌వుడ్ ఎ. క్రిటికల్ కంపానియన్". మార్గరేట్ కవితా సంకలనాలన్ని నిత్య నూతనంగా ఉంటాయి. ఆమెలోని ధైర్యం, నిబ్బరంగా చెప్పే భావాలు ఎంచుకొన్న భాషా, పదజాలం అందర్ని ఆకర్షిస్తాయి. పురాతన విషయమైనా, ఆధునిక విషయమైనా "ఒక లాండ్ స్కేప్"గా మన ముందు చిత్రించి నిలబెట్టటం ఆమె ప్రత్యేకం. హింసాత్మక సంఘటనలను రాయాల్సిన అవసరం వచ్చినా, ఎక్కడా బాలన్స్ తప్పకపోవటం ఆమెకున్న గొప్ప రచనా లక్షణం. కోపాన్ని, ద్వేషాన్ని చాలా అదుపులో ఉంచుకొని రాసి, ఆ భావాలను నిండుగా ఆవిష్కరించే నేర్పు ఆమెది. అందుకే అట్‌వుడ్ అన్నిటా అగ్రగామి అంటారు. మార్గదర్శి మార్గరేట్ అని గౌరవిస్తారు. ❁



## 22. కల్లోల కెరటం డొరోతి పార్కర్

ఉరకలెత్తే కవితా ప్రవాహం, ఆవేశం, దానికి తగ్గ ఆలోచన, కొత్త పదాల సృష్టి, విశృంఖలత, వీర విహారం, సెక్సు, కలహాల కాపురం, వ్యసన పంకిలం, విపరీతమైన తాగుడు, ఆందోళన, డిప్రెషన్, అలజడి, అస్తిత్వ నిరూపణలతో ఒక కల్లోల కెరటంగా, జాతి వజ్రంలా మెరిసే రచయిత డొరోతి పార్కర్. వ్యక్తిగా స్నేహశీలి, పదునైన మేధస్సు, హాస్యం, రిపార్టీ ఆమె కవితాభరణాలు. 1920-30 కాలంలో ఆమె యువకుల ఆశాజ్యోతి, ఐకాన్. ఎంత అభిమానాన్ని పొందిందో, అంత నిరాశా చవిచూసింది. ఆమె తరం కవుల్లో స్వయం విచ్ఛేదక కవి అయింది. పడి లేచే ఉత్తుంగ తరంగం పార్కర్. ఎంత ఘాటుగా చెప్పినా, కవిత్వాన్ని ఆదరించటం విశేషం. కథలు, సమీక్షలు, దశాబ్దాల పాటు రాసి అక్షరాలకు వన్నె తెచ్చింది. ఒకరకంగా కలం కింద పెట్టని రచయిత. ఆమె కవితా పంక్తులు తీర్చిదిద్దినట్లుండి, పలకరింపజేస్తాయి.

డొరోతి రోశీల్ద్ పార్కర్ 1893 ఆగస్ట్ 22న అమెరికాలో న్యూజెర్సీ రాష్ట్రం, లాంగ్ బ్రాంచ్‌లో జన్మించింది. సాంప్రదాయకంగా ధనికులైన ఆ కుటుంబానికి ఆ గ్రామం వేసవి విడిది. మాన్‌హట్టన్‌లో పెరిగింది. పుట్టిన అయిదేళ్లకే తల్లి చనిపోయింది. తండ్రి దుస్తుల ఉత్పత్తిదారు. మళ్ళీ పెళ్లి చేసుకొన్నాడు. పార్కర్‌కు సవతి తల్లిమీద అయిష్టం. ఇరవై ఏళ్ళకే తండ్రి పోయాడు. జ్యూ అయినా ఆమె కేథలిక్ గ్రామర్ స్కూల్‌లో చేరింది. అప్పటికే మంచి కవితలు రాసి పేరు తెచ్చుకొంది. పియానో బాగా వాయించేది. "టీనేజిలోనే టీజ్ చేసే"

హాస్యం రాసింది. అది పండి పేరు వచ్చింది. oge వానిటి ఫెయిర్ పత్రికలు ఆమె కవితలను ప్రచురించి ఉత్సాహపరిచాయి. ఆ రెండు పత్రికలు ఆమెను సంపాదకత్వ బాధ్యత తీసుకోమని కోరాయి. స్టాఫ్ రైటర్గా వానిటి ఫెయిర్లో చేరి డ్రామా క్రిటిక్ అయింది. మాగజైను స్పాన్సర్ చేసేవారి నాటకాలనే చీల్చి చెండాడేది. తప్పక ఉద్వాసన పలికారు. ఎడ్విన్ పాండ్ పార్కర్ను వివాహం చేసుకొన్నది. అతను గ్రేట్ వార్లో పాల్గొనటానికి వెళ్ళాడు. విపరీతమైన తాగుడుతో, ఆక్సిడెంట్ చేసి, మార్ఫిన్కు అలవాటు పడి, కొంపకు చేరాడు. విడాకులు తీసుకున్నారు. అయినా ఈమె zew సాంప్రదాయం ప్రకారం పార్కర్ ట్యాగ్ను వదలకుండా అట్టే పెట్టుకొంది.

1919లో Dramatist అయిన రాబర్ట్ Shervud, హాస్యనటుడు రాబర్ట్ బెరాచ్లీలతో కలిసి "రౌండ్ టేబుల్" అనే ప్రసిద్ధ సంస్థను న్యూయార్క్లోని ఒక హోటల్లో ఏర్పాటు చేసింది. గిట్టని వాళ్ళు దీన్ని విష వలయం (విషస్ సర్కిల్) అన్నారు. కామిక్ రచయిత జేమ్స్ టర్బర్, సినీ రచయిత రింగ్ లార్డేనర్ మొదలైన వారినీ దీనిలో సభ్యులుగా చేర్చింది. ప్రఖ్యాత రచయిత ఎర్నెస్ట్ హెమింగ్వేతో, స్కాట్ ఫిట్జెరాల్డ్తో ప్రేమాయణం సాగించింది. 1925లో న్యూయార్కర్ పత్రిక స్థాపన దగ్గర్నుంచి 30 ఏళ్ళ దాకా అందులో పనిచేసి తనకు, పత్రికకు పేరు తెచ్చింది. ఎన్నో విలువైన కవితలు, కథలు, రివ్యూలు రాసింది ఆ కాలమ్లో. 1927లో మొదటి కవితా సంకలనం "Enough rope" వచ్చింది. అది బెస్ట్ సెల్లర్గా నిరూపించుకొంది. తర్వాత సన్సెట్ గన్, డెత్ అండ్ టాక్సెస్ రాసి అంతే పేరు పొందింది. లామేంట్ ఫర్ ది లివింగ్, ఆఫ్టర్ సచ్ ప్లెజర్, హియర్ లైస్ – ఫిక్షన్ పుస్తకాలతో విశేష ప్రాచుర్యం పొందింది. "పార్కర్ రచనలన్నీ నిక్షిప్త స్వీయ చరిత్రలు" అన్నాడు ప్రముఖ విమర్శకుడు బ్రిన్డాన్ గిల్. పేరు, ప్రఖ్యాతి డబ్బు వచ్చి మీద పడుతున్నాయి. తాగుడుకు బానిసై డిప్రెషన్కు గురైంది. ఈ జబ్బు ఆతరం రచయితలందరికీ సర్వసాధారణంగా ఉన్నదే. ఎంత విశృంఖలత జీవితంలో ఉన్నా, సాహిత్యంలో మాత్రం చెలియలి కట్టదాటకుండా రాసిన సంస్కారి. నగ్న సత్యాలతో, గుండెల్లో గునపాల్లా గుచ్చే మాటలతో, అత్యంత సంక్షిప్తతతో, ఆమె కవిత్వం సాగిపోతుంది.

న్యూయార్కర్ రచయితలందరూ హాలీవుడ్ గుమ్మం తొక్కి బాగుపడ్డవాళ్ళే. పార్కర్ కూడా హాలీవుడ్ సినిమాలకు పనిచేసింది. ఎన్నో సినిమాలకు రాసినా పేరేమీ రాలేదు. అలాన్ కాంప్ బెల్ అనే నటుడిని పెళ్ళాడింది. ఇద్దరు కలిసి చాలా సినిమాలకు స్క్రిప్ట్ రాశారు. అందులో "ఏ స్టార్ ఈజ్ బార్న్" అనే సినిమా వీరిద్దరి సృష్టి. అకాడెమి అవార్డ్కు 1937లో నామినేట్ అయింది. పెళ్లి మళ్ళీ పెటాకులైంది. అమెరికా వ్యతిరేక కార్యక్రమాలు చేస్తోంది అన్న ఆరోపణలతో ఆమె విచారణకు గరైంది. ఆ కాలంలో ఇది రచయితలకు

మామూలే. సినీ జగత్తులో ఆమె పేరును బ్లాక్ లిస్టులో పెట్టారు. స్క్రీన్ రైటర్స్ గిల్ట్ ఏర్పాటుకు సాయపడింది. ఈ సందర్భంగా ఆమె ఒకసారి "Unemployment office"కు వెళ్ళింది. ఆమెను వందలాది మహిళలు ఆనందంతో చుట్టుముట్టి ఆమె రాసిన కప్లేట్ "Men seldom make passes - at girls who wear glasses" అనే కవితను పాడి ఆమెకు అభినందనలు తెలిపారు.

సినీ రచయితగా చేతులారా సంపాదించింది. కాని తన రంగం అయిన ఫ్రీ లాన్స్ జర్నలిజంకు మళ్ళీ వచ్చింది. "Esquire" పత్రికకు సినీ సమీక్షలు రాసింది. తాగుడు విపరీతం అయింది. అడపా, దడపా కవితలు రాస్తూనే ఉంది. మళ్ళీ స్క్రిప్ట్ రైటింగ్‌కు మళ్ళింది. ఇంత అస్తవ్యస్తంగా జీవితం ఉన్నా, పార్కర్‌కు 1959లో అమెరికన్ ఎకాడెమి ఆఫ్ ఆర్ట్స్ అండ్ లెటర్స్‌కు ఎంపికైంది. అది తీసుకొని మళ్ళీ నూయార్కర్ చేరింది. 1967 జూన్ ఆరున తీవ్ర గుండెపోటుతో న్యూయార్క్ హోటల్‌లో మరణించింది. ప్రఖ్యాత "పార్కర్" అనే కలం ఆగిపోయింది. ఆమె అస్తికలను కావాలని అడిగిన వారెవ్వరూ లేకపోవటం బాధాకరం. "Excuse my dust" అనేది ఆమె తరచూ వాడే మాట. అలానే జరిగింది. తన సాహితీ సర్వస్వాన్ని మార్టిన్ లూథర్‌కింగ్‌కు చెందేట్లు చేశారు. కింగ్ ఈమె మరణం తర్వాత పది నెలలకు హత్యగావింపబడ్డాడు. ఆమె రచనలు చాలాసార్లు పునర్ముద్రణ పొందాయి. ఎంతోమంది ఆమె జీవిత చరిత్ర రాశారు. ఎందరెందరో ఆమె కవితా వాక్యాలను పాటలతో నాటకాల్లో, టి.వి. ప్రోగ్రామ్స్‌లో తరచు వాడుతూనే ఉంటారు. అంటే ఆమె కవిత్వం సజీవంగా ఉంది. ప్రజల నాలుకమీద నాట్యం చేస్తూనే ఉందన్న మాట. 1995లో "Mrs. Parker and the vicious Circle" చిత్రాన్ని తీశారు. పార్కర్ పాత్రను జెన్నిఫర్ జసన్ లీ అద్భుతంగా పోషించింది. పార్కర్ మన పార్కర్ పెన్నులా విలువైన సాహితీవేత్త. ❀



## 23. రచయితల రచయిత – కేథరిన్ మాన్స్ ఫీల్డ్

**ఒ**కసారి బెంగాలి నవలా రచయిత శరత్‌ను కొందరు అభిమానులు "మీ రచనలు మాకు బాగా అర్థమవుతున్నాయి. కాని రవీంద్రుని రచనలు అర్థం చేసుకోవటం కష్టంగా ఉంది" అన్నారట. దానికి ఆ మహా నవలా రచయిత "నేను మీ కోసం రాస్తున్నాను. టాగూర్ నా వంటివాళ్ల కోసం రాస్తున్నారు" అని సమాధానం చెప్పాడట. అలాగే ఆంగ్ల సాహిత్యంలో 19వ శతాబ్దపు ఉత్తరార్థంలో Stream of consciousness అంటే చైతన్య స్రవంతి అనే ప్రక్రియకు బీజం వేసి, అసలు రచనలు ఎలా ఉండాలో రాసి చూపించిన రచయితలకే రచయిత అనిపించుకొన్న మహిళా రచయిత కేతలీన్ మాన్స్ ఫీల్డ్.

న్యూజిలాండ్‌లోని సంపన్న కుటుంబంలో 1888 అక్టోబర్ నాలుగున కేథరిన్ పుట్టింది. చిన్నప్పటి నుండి రచయిత కావాలనే తపన ఉండేది. లండన్‌లో చదువుకొన్నది. సంగీతం కూడా బాగానే నేర్చింది. స్కూల్ న్యూస్ పేపర్లలో చాలా రాసింది. ఆస్కార్ వైల్డ్‌లాంటి ప్రముఖ రచయితలనందర్నీ చదివి జీర్ణించుకొంది. మూడేళ్ళ తర్వాత మళ్ళీ న్యూజిలాండ్ చేరింది. మంచి కుర్రాణ్ణి చూసి పెళ్లి చేయాలని తల్లిదండ్రులు భావించారు. కాని ఆమెలో తిరుగుబాటుతనం ఎక్కువ. Artistic adventurous societyతో అనుబంధం పెంచుకొన్నది. ఆస్ట్రేలియా మాగజైన్స్‌కు రాస్తూ ఉండేది. మళ్ళీ లండన్ చేరింది. విశృంఖలత ఆమె లక్షణం అయింది. కడుపు వచ్చిందని తెలిసి మూడు వారాల పరిచయం మాత్రమే ఉన్న జార్జి బౌడెన్‌ను పెళ్లి చేసుకొంది. ఆమె కడుపులోని బిడ్డకు అతడు తండ్రి కాదు. పెళ్లి రోజున నల్ల డ్రెస్ వేసుకొని పెళ్లి చేసుకొన్నది. ఆ రాత్రే అతన్ని వదిలేసింది. తల్లి ఈమెను భరించలేక ఆర్టిస్ట్‌లకు

దూరంగా ఉంచాలనే కోరికతో లండనుకు తీసుకొని వచ్చింది. జర్మనిలో "స్పా"లో బోహీమియన్ ఆర్టిస్ట్‌లకు దూరంగా చేర్పించింది. అయినా ఆమె తిరుగుళ్ళు మానలేదు. మళ్ళీ కడుపు వచ్చి పోయింది. లండన్ తిరిగి వచ్చి రచనలో నిమగ్నమయింది.

In a German Pension అనే కథా సంకలనాన్ని 1911లో విడుదల చేసింది. జూన్ ముర్రే అనే అతనితో పరిచయం పెంచుకొంది. అతను లిటరరీ మాగజైన్ ఎడిటర్. పెళ్లి అయినా ఆమె అఫైర్‌లకు అడ్డూ, ఆపు లేదు. ఇద్దరు కలిసి "బ్లూ రివ్యు" పత్రిక నడిపారు. మూడేళ్ళ తర్వాత పత్రిక పడకేసింది. డి. హెచ్ లారెన్స్ లాంటి ప్రముఖులతో బాగా పరిచయమేర్పడింది. పాత భర్త బాడెన్‌తో విడాకులు పొంది ముర్రేను పెళ్లి చేసుకొంది. 1917లో క్షయ వ్యాధి సోకింది. అయినా రచన చేస్తూనే ఉంది. Bliss and other stories ప్రచురించింది. మంచి పేరొచ్చింది. Garden party and other stories రాసి ప్రచురించి మంచి ఆదరణ పొందింది. ఆరోగ్యం మీద ఇప్పుడు శ్రద్ధ కలిగింది. ఫ్రాన్స్ చేరింది. భర్త ముర్రేకు దూరంగా ఉన్నా, ఆమె ఉత్తరాలు, కథలను ప్రచురిస్తూనే ఉన్నాడు. 1923లో 34 ఏళ్లకే కేథరిన్ టి.బి.తో అల్పాయుర్దాయంతో మరణించి సాహితీ లోకానికి తీరని లోటు కల్గించింది.

## కేథరిన్ ప్రత్యేకతలు

Gardenలో అత్యాధునిక శైలితో రచన చేసింది. అదే ఆ తర్వాత "Impressionanistic style of stream of consciouness" చైతన్య స్రవంతిగా పేరు వచ్చింది. ఈ విధానంలో జార్జి ఇలియట్, వర్జీనియా ఉల్ఫ్‌లాంటి వారు రాశారు. తెలుగులో నవీన్ ఈ ధోరణిలోనే "అంపశయ్య" నవల రాసి "అంపశయ్య నవీన్" అయిపోయాడు. అంతకు ముందు గోపీచంద్ లాంటివాళ్ళు ప్రయత్నించారు. ఆంగ్ల రచయితలు ఉల్ఫ్, రిచర్డ్ సన్‌లు కూడా ఇలానే రాశారు. 1920 కేథరిన్ లాంటి రచయితలు, కళాకారులు పాశ్చాత్య సంస్కృతి నుండి దూరమైపోయారు. జాతీయ స్రవంతికి దూరమైన వారందరికి " Generation x" అనే పేరు 1990లో వచ్చింది.

మాన్స్ ఫీల్డ్ ముఖం చూస్తే ధైర్యం, వ్యతిరేక భావం, స్వీయ వ్యక్తిత్వం, ఆత్మ స్థైర్యం, ఒకే భావానికి కట్టుబడటం, వాదనా సామర్థ్యం ఎల్యూసివ్‌నెస్ కనిపిస్తాయి. ఇవన్నీ ఆమె రచనలలోను ప్రతి ఫలిస్తాయి. బెర్ట్రాండ్ రసెల్ ఆమె మేధస్సును మెచ్చి వశపరచుకోవాలని ప్రయతిస్తే ఆమె వలలో పడలేదు. వర్జీనియా ఉల్ఫ్ తనకు సాహిత్యంలో ఎవరు పోటీ కాని, సాటి కాని లేరని అన్నది. కాని కేథరిన్ విషయంలో "Stank like a ciret cat that has taken to street walking" అంటూ "I suppose her in my own way" అని మెచ్చింది. కేథరిన్ రచనలపై మాత్రమే అసూయ అని, ఆమెపై కాదని చెప్పింది ఉల్ఫ్. ఆల్డస్ హక్స్లీ,

క్రిస్టఫర్ కొలంబస్‌లు కేథరిన్ వాడిన అనేక మాటలనే తమ రచనలలో వాడారు. లారెన్స్ తన "women in love" నవలలో gudrem అనే పాత్రను కేథరిన్‌ను దృష్టిలో పెట్టుకొనే రాశాడనే అంటారు. అందులోని గుడ్రేన్ ఎవరో కాదు – మాన్స్ ఫీల్డ్. ఇద్దరు రచయితలకు సయోధ్య బానే ఉన్నా ఒకసారి ఆమెను "You are a loathe so me reptile, I hope you will die" అని శపించాడట. కేథరిన్‌కు తన అస్తిత్వం మీద నమ్మకం లేదు. తళుక్కుమని మెరవాలనే ఆరాటమే ఎక్కువ. జపాన్ బొమ్మలాగా హెయిర్‌తో ఉండేది. కాని ఆమె కాలంలో స్త్రీలు అందరు ఎడ్వర్డియన్ ఫాషన్‌లో ఉండేవారు. వారికి ఈమె పూర్తి విరుద్ధం. ఆకర్షణగా ఉండే ప్రత్యేక దుస్తులను ఆర్డర్ ఇచ్చి తయారు చేయించుకొనేది. ఆమె రచనలన్నిటిలో సంస్కృతి విహీనత కన్పిస్తుంది. "Life and work are one thing, indivisible" అనేది ఆమె సిద్ధాంతం. ఎలా ఉండేదో అలానే రాసేది. రెంటికి తేడా ఉండకూడదని భావించేది. విశృంఖలతతో వీర విహారం చేసిది. ఆడ, మగా అనే తేడా లేకుండా తిరిగింది. దాని ఫలితమూ అనుభవించింది. ఎంత బాధలో ఉన్నా, చాలా ధైర్యంగా "డేర్ డెవిల్"లా రచనలు చేసింది. ఆమె విమర్శకుల దృష్టిని ఆకర్షించిన రచయిత అవటం గొప్ప విషయం. అందుకే ఆమెను "రైటర్స్ రైటర్" అని విమర్శక లోకం గౌరవించింది. ఆమె రాసింది అంతా "Post modernism" భావజాలంతో రాసింది. అప్పటికి ఆమె దానికి బీజాలు వేసిన రచయిత్రి. ఆమె చనిపోయినప్పుడు ఆమె సమకాలీన రచయితలందరూ "Our missing cotemporary" అని కితాబు ఇచ్చారు.

వర్జీనియా ఉల్ఫ్‌కు కేథరిన్‌తో పరిచయం లేకపోతే, "Mrs. Dollway" నవల రాసి ఉండేది కాదు అని విమర్శకుల అభిప్రాయం. "Process of writing" మీద అద్భుత రచనలు చేసి మార్గదర్శకత్వం చేసింది. ఆమె రాసిన ఉత్తరాలు, నోట్‌బుక్స్ అన్నీ సాహిత్య స్థాయిని పొందాయి. అంత వరకు యే రచయితకు ఇది దక్కలేదు. తన స్వీయ అపజయాలతో విశ్వబోధన చేసిన మహా రచయిత్రి కేథరిన్. పోస్ట్ ఇంప్రెషన్ భావాలు, ఆ పెయింటింగ్స్ ఆమెకు అధిక ప్రేరణ కల్గించాయి.

1923లో Gurdjeffలో మానసిక ప్రశాంతత కోసం చేరింది. మనసు సరిగ్గా పనిచేస్తే శరీర ఆరోగ్యం బాగా ఉంటుందని ఇప్పటికి తెలిసింది "హెమరేజ్" వచ్చింది. కుటుంబ డాక్టర్ జేమ్స్ యంగ్ చేతుల్లో ప్రాణాలు విడిచింది. తాను చూపించినంత ప్రేమ భర్త ముర్రే తనపై చూపించలేదని మనోవ్యథ చెందింది. తన ఆస్తినంతా తనకు సహాయంగా ఉండి సేవ చేసిన "ఇడా బెకర్"కు ఇచ్చేసింది. భర్త ముర్రే ఆమె మరణం తర్వాత ఆమె రచనలన్ని ప్రచురించి కాష్ చేసుకొన్నాడు. ఆమె మరణానికి స్పందిస్తూ ముర్రే "Catherineís Love Survived her own Physical Death" అన్నాడు. ❀



## 24. అభాగిని - సిల్వియా పాత్

**డి**ప్రెషన్ కాలమ్‌లో అమెరికాలని మాసా చూసేట్స్‌లో ఉన్న జమైకా కాప్లేయిన్ నైబర్ హుడ్‌లో 1932 అక్టోబర్ 27న జన్మించింది సిల్వియా పాత్. తల్లి ఆస్ట్రియన్ అమెరికా మొదటి తరానికి చెందిన స్త్రీ. తండ్రి జర్మన్. ఆయన బోస్టన్ వర్సిటిలో జువాలజి ప్రొఫెసర్‌గా పనిచేస్తూ బంబుల్ బీస్ మీద పుస్తకం రాశాడు. మూడేళ్ళ వయసులో ఈమె కుటుంబం విన్‌త్రాప్‌కు మారింది. ఆమె రాసిన మొదటి కవిత బోస్టన్ హెరాల్డ్‌లో పడింది. పైంటింగ్‌లో అవార్డ్ గెల్చుకొంది. Unitreriyan క్రిస్టియన్‌గా ఉండేది. ఎనిమిదవ ఏట తండ్రి మరణించాడు. కాలేజిలో చేరింది. "పుచ్చుకాయ పండి విచ్చుకొన్నట్లుగా ప్రపంచం కనిపిస్తోంది" అని రాసుకొంది. ది స్మిత్ రివ్యూకు ఎడిటర్ అయింది. న్యూయార్క్ సిటిలో ఉండి విశ్లేషణాత్మక వ్యాసం రాసి అనుభవాలను "బెల్ జార్" అనే నవలలో పొందు పరిచింది. హార్వర్డ్ రైటింగ్ స్కూల్‌లో ప్రవేశానికి ప్రయత్నిస్తే తిరస్కరించారు.

దీనితో డిప్రెషన్‌కు లోనైంది. ఎలక్ట్రో కన్వల్సివ్ తెరపి జరిపారు. బాధ భరించలేక 1953లో మందులు మింగి ఆత్మహత్యకు ప్రయత్నం చేసింది. పాపం మళ్ళీ చికిత్స చేయించుకొన్నది. ఒక సైకియాట్రిక్ కేర్‌లో ఉంచాల్సిన స్థితి ఏర్పడింది. ఇన్సులిన్ షాట్లు ఎక్కువ ఇవ్వాల్సి వచ్చింది. కొంత నయం అయింది. మళ్ళీ కాలేజిలో చేరింది. 1955లో దాస్తో విస్కీ నవల మీద "మాజిక్ మిర్రర్" అనే పేర థీసీస్ సమర్పించింది. అంత అనారోగ్యంగా ఉన్నా ఆమెలో సాహిత్య సృజన ఆగలేదు. గ్రాడ్యుయేట్ అయింది. ఫుల్ బ్రైట్ స్కాలర్‌షిప్‌తో కేంబ్రిడ్జి కాలేజిలో చేరి రచన కొనసాగించింది. "వర్సిటి" అనే కాలేజి మాగజైనుకు విపరీతంగా రాసేది.

1960లో టేల్ హఘ్ అనే ముజిసియన్‌ను పెళ్లి చేసుకొంది. ఇప్పటి నుంచి జ్యోతిషం మీద, అతీత శక్తుల మీద నమ్మకం బాగా పెరిగింది. 1958లో దంపతులు బోస్టన్ చేరారు. అక్కడ సైకియాట్రిక్ కాలేజిలో రిసెప్షనిస్ట్‌గా పనిచేసింది. ఈ విషయం చదివితే మనకు రామినీడు తీసిన సినెమా "చివరికి మిగిలేది"లో సావిత్రి పాత్ర గుర్తుకు వస్తుంది. క్రియేటివ్ రైటింగ్ సెమినార్‌లో పాల్గొంది. మహిళా పక్షపాతిగా రాసేది. తన అనుభవాలన్నిటిని ఎప్పటికప్పుడు రాసేది. జంట కెనడా మొదలైనవి తిరిగి బ్రిటన్ చేరారు. 1960లో మొదటి

కవితా సంకలనం "కలోస్సస్" ప్రచురించింది. తన ఆత్మకథను అంతా నిక్షిప్తం చేసి, "The Bell jar" నవలను పూర్తి చేసింది. భర్తకు తేనెటీగల పెంపకంపై ఆసక్తి ఎక్కువ. దానిపై కవితలు రాసి మెప్పు పొందింది. భర్త ఇంకో అమ్మాయితో అఫైర్ సాగించాడు. ఈమెకు కార్ ప్రమాదం జరిగింది. 1962లో ఆమె కవితా ప్రవాహం ఉధృతంగా ఉంది. ఒంటరిగా పిల్లలతో లండన్ తిరిగి వచ్చింది. అద్దె ఇంట్లో కాపురం. ఆ ఇంట్లోనే ఒకప్పుడు w.బి.యేట్స్ కవి ఉన్నాడు అని సంబరపడింది. ఆ సంవత్సరం శీతాకాలంలో వందేళ్ళలో ఎప్పుడు లేనంత చలి విపరీమై, నీటి గొట్టాలలో నీరు గడ్డ కట్టేసింది. పిల్లలకు జబ్బులు. టెలిఫోన్ సౌకర్యం లేదు. ఇవన్నీ మళ్ళీ డిప్రెషన్‌కు దారి తీశాయి ఆ అభాగ్యురాలికి. మరుసటి ఏడాది బెల్జార్ నవల విడుదల అయింది. ఈ నవలను "విక్టోరియా లూకాస్" అన్న పేరుతో రాసింది. డాక్టర్ జాన్ హోర్డర్ ఆమె దయనీయ స్థితిని గమనించి హాస్పిటల్‌లో చేర్పించటానికి తీవ్ర ప్రయత్నం చేశాడు. ఆమె ఒప్పుకోలేదు. తప్పనిసరి పరిస్థితులలో ఒక నర్సును తానే ఏర్పాటు చేశాడు. డాక్టర్లలోను మానవత్వం ఉంటుందని రుజువు చేశాడు. ఆమెకు "ఆంటీ డిప్రెషన్" మందుల్ని వాడాడు. అంతకు పూర్వం ఆమెకు జరిగిన చికిత్సలో డాక్టర్లు ఇంక ఏ పరిస్థితుల్లోను ఆ మందులు వాడకూడదని సలహా ఇచ్చారు. కానీ ఈ డాక్టర్లు ఆ విషయం తెలిసో తెలీకో వాడేశాడు. 1963 ఫిబ్రవరి పదకొండున, సిల్వియా పాత్ తన పిల్లల్ని రాకుండా తలుపులు బంధించుకొని గాస్ స్టవ్ ఓవెన్‌లో తలను ఉంచుకొని కార్బన్ మొనాక్సిడ్ వాయువు పీల్చి చనిపోయింది. పాపం తానేం చేస్తోందో ఆ అభాగినికి తెలీదేమో?

పాత్‌ను అందరు "Symbol of blighted female genius" అని ప్రస్తుతించారు. ఆమె కవిత్వం అంతా చంద్రుడు, రక్తం హాస్పిటల్స్ fetues, పుర్రేలే. ఆమె ఇంట్లో పూర్వం కాపురం ఉన్న ఈట్స్ కవి కూడా ఇలానే రాసేవాడు. "పోఎమ్స్ ఫర్ బర్త్‌డే"లో ఏడు భాగాలున్నాయి. కలోస్సస్ కవితల్లో ఆమె చావు ప్రయత్నాలన్నిటినీ రాసింది. "Ariel" కవితల్లో విలియన్స్ ప్రభావం ఉందని అంటారు. తన మానసిక వ్యాధిని Tulips, Doddy, Lady, Lazarus కవితల్లో పొందుపరచింది. ఆమె రాసిన కవిత్వాన్ని "Confessional Poetry"గా భావిస్తారు. ఆమెమీద సినిమా తీద్దామని ప్రయత్నిస్తే ఎదిగిన ఆమె కూతురు తిరస్కరించింది. ఆ విషయాన్ని ఆమె ఒక కవిత రూపంలో రాసింది. అది చదివితే మనకు కన్నీళ్లు వస్తే, ఆ అభాగిని కవయిత్రిపై సానుభూతి కలిగి, ఆమె పిల్లలను అనాథలను చేసినందుకు బాధా మెలిబెడుతుంది.

"Now they want to make a film - for any one lacking the ability - to imagine the body head in oven - orphaning children
they think- i should give them my motherís words - to fill the mouth of their mother - their sylvia suicide doll" ❀



## 25. మహిళోద్యమ నాయకురాలు - సుసాన్ ఆంథోని

### జననం - విద్యాభ్యాసం

**సు**సాన్ బ్రౌనేల్ ఆంథోని 15-02-1820లో మసాచుసెట్స్ రాష్ట్రం ఆడమ్స్ టౌన్‌లో జన్మించింది. తండ్రి డేనియల్ ఆంథోని. తల్లి లూసి. తండ్రికి క్వేకర్ ఉద్యమంతో మంచి సంబంధాలుండేవి.

ఈ ఉద్యమం 1600లో ఇంగ్లాండ్‌లో పుట్టి ఆ తరువాత అమెరికాకు చేరింది. క్వేకర్ సభ్యులు చాలా నిదానస్తులు, మర్యాద కలవాళ్ళు. ప్రార్థనలలో గట్టిగా పాడరు. నిశ్శబ్దానికే ప్రాధాన్యత. రంగు దుస్తులు ధరించరు. తెల్లవే. భగవంతునికి భక్తునికి మధ్య ప్రీస్ట్ అనవసరం అనే తత్త్వం వారిది. ప్రతి వారికి లోపల వెలుగు ఉంటుందని, అదే దివ్య సత్యాన్ని వెలువరిస్తుందని నమ్ముతారు. మనుష్యులలో ఆడ, మగా తేడాలుండరాదనీ మొట్టమొదట వ్యాప్తి చేసింది క్వేకర్లే. యుద్ధానికి, బానిసత్వానికి వీరు వ్యతిరేకులు. తండ్రికి పత్తి మిల్లుండేది. ఆర్థిక మాంద్యం వచ్చి దివాలా తీసాడు. సుసాన్ క్వేకర్ స్కూల్‌లో చేరి చదివి, ఉపాధ్యాయ వృత్తిలో చేరింది. సరైన జీతాలు లేక మానేసింది. పెళ్లి చేసుకొనే ఆలోచన రాలేదు. 1848లో స్టాంటన్, మాట్ అనే స్త్రీలతో పరిచయమైంది. వీరు బానిసత్వ వ్యతిరేక ఉద్యమంలో ఉన్నారు. మాట్ ఇంగ్లాండ్ వెళ్లి ప్రపంచ బానిసత్వ వ్యతిరేక సభలో పాల్గొనటానికి లండన్ వెళ్తే ఆమెను స్టాంటన్‌లను అనుమతించలేదు. మగవారికి తప్ప స్త్రీలకే ప్రతినిధ్యం లేదు పొమ్మన్నారు. దీనితో వారికి మహిళోద్యమం మీద దృష్టి పడి, Seneca falls womenís rights convention అనే సంస్థను 19-07-1848లో ప్రారంభించారు. స్త్రీలకూ సామాజిక పౌర, మత హక్కుల కోసం పోరాడటానికి ఏర్పడిన సంస్థ ఇది. మగవారు అనుభవిస్తున్న అన్ని

హక్కులు ఆడవారికి లభించాలని కోరారు. Declaration of anti sentiments అనే పత్రాన్ని విడుదల చేశారు. మహిళలకు మగవారితో పాటు ఆస్తిహక్కు ఉండాలని, స్త్రీలు సంపాదించుకొనే జీతం వాళ్ళకే దక్కాలని, బహిరంగ ప్రదేశాలలో మాట్లాడే స్వేచ్ఛ కావాలని, పిల్లల్ని తమ వద్దే ఉంచుకొనే హక్కు ఉండాలని, మగవారితో సమానంగా వోటు హక్కు కావాలని ప్రతిపాదించి, ప్రపంచానికి తెలియజేశారు. Philadelphia ledger and daily transcript

"A women is nobody. a wife is every thing. a pretty girl is equal to ten thousand men. a mother is next to God all powerful. the women of philadelphia are resolved to maintain their rights as wives belles, virgins and not as women" అని వారి మాటలుగా రాసింది.

## ఉద్యమ భాగస్వామ్యం

కనజోహారిలో ఆంథోని Daughters of temperence అనే ఉద్యమకారులతో చేరింది. వీరంతా తాగుబోతుల వల్ల కుటుంబాలు దెబ్బ తింటున్నాయని, కనుక లిక్కర్ మీద కఠిన చట్టాలు చేసి అమలు జరపాలని కోరుకొనేవాళ్ళు. 1849లో ఆంథోని మొట్టమొదటి ఉపన్యాసాన్ని ఈ వేదిక మీద నుంచి చేసి అందర్ని ఆకర్షించింది. అందర్లో ఆలోచన రేకెత్తించి కర్తవ్య పాలనకు సిద్ధం చేసింది. క్రమంగా బానిసత్వ వ్యతిరేక సభల్లో, సారా వ్యతిరేక సభల్లో పాల్గొని గొంతు వినిపించింది, అందరి దృష్టిలో పడింది. ఈమె మాటలు, వాగ్ధాటి, నిబ్బరం, ధైర్యం చూసి అందరు ఆంథోనిని "లేడీ నెపోలియన్" అన్నారు. సాంఘిక సంస్కరణల మీద ఈమె దృష్టిని ప్రసరింపజేసింది. వివాహిత మహిళల ఆస్తిహక్కు చట్టంను ప్రభుత్వం తెచ్చింది. దాని ప్రకారం పెళ్లి అయిన స్త్రీకు డబ్బు హక్కుగా వస్తుంది. అయితే దురదృష్టం ఏమిటి అంటే, ఆ డబ్బు, ఆస్తి ఆమె చేతికి రాదు. భార్య ఉద్యోగం చేసి సంపాదిస్తే ఆ రోజే జీతాన్ని భర్త చేతుల్లో పోసి కృష్ణార్పణం అనుకోవాల్సిందే. ఇలాంటి సమస్యలెన్నో ఉన్నాయి. వీటికన్నిటికి సంస్కరణ రూపంలో హక్కులు సాధించాలని తీవ్రంగా భావించింది. అప్పటికే Abolitionism అనేది ఒకటి ఉంది. వీరు బానిసత్వాన్ని రూపు మాపాలి అని కోరేవారు. యజమానుల నుండి దొంగతనంగా పారిపోయే బానిసలకు వీరు అండగా నిలబడతారు. ఆ రోజుల్లో ఫ్రెడరిక్ డగ్లాస్ వీరలో ప్రముఖ నాయకుడు. ఇలాంటి వారంతా ఆంథోని తండ్రి ఇంట్లో సమావేశం అయ్యేవారు. వీరితో ఆమెకు పరిచయం కలిగింది.

1849లో సుసాన్ The lily అనే పత్రికా సంపాదకురాలు అమీలియ బ్లూమార్‌తో పరిచయం పొందింది. అదే అమెరికాలో మొదటి మహిళా పత్రిక. ఆ పత్రిక మహిళాభ్యుదయానికి చాలా కృషి చేస్తోంది. స్టాన్‌టన్‌తో కలిసి ప్రపంచాన్ని మార్చాలనే అభిప్రాయం వచ్చింది. ఒకసారి సారా వ్యతిరేక సభలో మాట్లాడబోతే మగవారు

మాట్లాడనివ్వలేదు. ఆమెకు కోపం వచ్చి బయటికి వచ్చేసింది. Womenís state temperence society అనే మహిళా సంస్థను ప్రారంభించి మహిళలే నడిపేట్లు చేసింది. స్టాన్ టన్‌ను మొదటి ప్రెసిడెంట్‌ను చేసింది. బ్లూమార్ ఆడవాళ్ళ డ్రెస్‌కు కొత్తరూపం ఇచ్చింది. ఎలా ఉందంటే "Turkish trousers to the ankle with a skirt reaching four inches below the knee" ఇది ఆకర్షణీయంగా ఉండటంతో స్త్రీలు ధరించటం ప్రారంభించారు. దీనికి the bloomer అనే పేరొచ్చింది. అయితే ఆంథోని కొద్ది రోజులు వేసుకొని, తర్వాత ఇబ్బందిగా ఉండటంతో మానేసింది. ఇలా మహిళలు కొత్త వస్త్రధారణతో కొంత మార్పు తెచ్చారు.

1852లో కొత్తగా ఏర్పడిన సంస్థ రాష్ట్ర మహాసభ న్యూయార్క్‌లోని రోచెస్టర్‌లో నిర్వహించారు. అందులో తాగుబోతు తండ్రి సమాజానికి అనర్థం అని స్త్రీలు దయాదాక్షిణ్యాలపై మాత్రమే చదువుకొనే స్థితి పోయి, అవగాహనతో చదువుకోవాలని ఆంథోని గంభీరోపన్యాసం చేసింది. 1852లో మొదటి మహిళా హక్కుల సమావేశానికి వెళ్లి కాలేజీలో స్త్రీలకూ ప్రవేశం కల్పించాలని, మగవారితో సమానంగా స్త్రీలను గౌరవించని చర్చలకు వెళ్ళరాదని, చెబుతూ "We do not stand up here to be seen, but to be heard" అని తీవ్ర స్వరంతో మహిళా భేరి మ్రోగించింది. 1853లో Newyork state teacherís conventionలో పాల్గొని తన అభిప్రాయాలను నిర్భయంగా చెప్పింది. "You chose this teacherís profession that you have no more brains than a women" అని తీవ్రస్వరంతో తనను అడ్డుకొన్న వారిని అదలించింది. తన పత్రికలో మహిళా సంపాదన ఆమెదే. దానినే వారు ఆశించరాదని ఘాటుగా రాసింది. 1854 February 14-15 తేదీలలో న్యూయార్క్‌లోని ఆల్బనిలో రాష్ట్రీయ మహిళా హక్కుల సమావేశం జరిగింది. న్యూయార్క్ అసెంబ్లీలో స్టాన్‌టన్ మొదటిసారిగా ఉపన్యసించింది. ఆమె ఉపన్యాసాన్ని యాభైవేల కాపీలు తీయించి ఆంథోని రాష్ట్రమంతటా పంచింది. ఆ తర్వాత న్యూయార్క్ పర్యటించి ఉపన్యాసాలు చేసింది. జనం తండోప తండాలుగా వచ్చి విన్నారు. 1856లో ఆంథోనిని న్యూయార్క్ స్టేట్ బానిసత్వ వ్యతిరేక సంఘానికి ప్రతినిధిని చేశారు. చలికాలంలో దేశంలో చాలా ప్రాంతాలు పర్యటించి మహిళా వోటు హక్కు కోసం ప్రచారం చేసింది. స్వంత డబ్బు ఖర్చు చేసుకొని తిరిగింది.

1857లో తెల్లవారి పిల్లలతో బాటు నల్లవారి పిల్లలను ప్రక్కప్రక్క కూర్చోబెట్టి చదివించాలని కోరింది. వర్ణ వివక్ష కూడదని చెప్పింది. Mixed race education అవసరాన్ని ప్రచారం చేసింది. కాలేజీలలో సహవిద్య ఉండాలని డిమాండ్ చేసింది. క్రమంగా ఆమె మాటల ప్రభావం వల్ల నల్లజాతి వారిపట్ల ద్వేషం తగ్గింది. యూనివర్సిటిలలో, కాలేజిలలో స్త్రీలకు ప్రవేశం కల్పించారు. 1860లో Married womenís property act అనేక

ఉద్యమాల ఫలితంగా వచ్చింది. Judiciary committeeలో స్టాన్‌టన్ మాట్లాడే అవకాశం వచ్చింది. ఆమె అమోఘ వాక్కులకు ఫలితం లభించింది. కొత్త చట్టం వచ్చింది. దాని ప్రకారం స్త్రీ తన జీతాన్ని తానే అనుభవించవచ్చు. వ్యాపార లావాదేవీలలో పాల్గొనవచ్చు. కోర్టులకు వెళ్ళవచ్చు. పిల్లలను తమ దగ్గర ఉంచుకోవచ్చు. ఈ చట్టం మహిళలకు గొప్ప వరమే. మహిళోద్యమ ఫలితాలే ఇవన్నీ.

1862లో ప్రెసిడెంట్ లింకన్ దేశాన్ని, యూనియన్ని రక్షించటానికి బానిసత్వ నిర్మూలన తప్పదని భావించాడు. బానిసత్వ నిర్మూలనకు తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. ముప్పై ఏళ్ళలో బానిసత్వాన్ని క్రమక్రమంగా నిర్మూలిస్తానని తెలిపాడు. ఆంథోనికి లింకన్ మాటలమీద నమ్మకం కలుగలేదు. వ్యతిరేకించింది. ఒక సభలో మాట్లాడుతూ ఆమె "మనదేశంలో అన్ని దేశాలవారికి చదువుకొనే హక్కుంది. కాని నల్లవారికి ఆ అవకాశం లేకపోవటం సిగ్గుచేటు. వారికి ఉచిత విద్య కల్పించాలి. వారికి సమాన హక్కులు కల్పించాలి" అని తీవ్రస్వరంతో గర్జించింది. 1862 జూలై పదమూడున ప్రెసిడెంట్ లింకన్ Emanicipation proclamationను జారీ చేసి బానిసత్వ నిర్మూలనకు ధైర్యంగా మొదటి అడుగువేశాడు.

1863లో Womenís national leagueలో బానిసత్వాన్ని చట్ట వ్యతిరేకమని తెలియజేసే పిటీషన్ వేయటానికి ఆంథోని, స్టాన్‌టన్ను పంపింది. సంపూర్ణ బానిసత్వ విమోచన జరగాలన్నదే ఆంథోని ధ్యేయం. నాలుగు లక్షల సంతకాలతో పిటీషన్ తయారు చేసి చరిత్ర సృష్టించింది ఆంథోని. వీటి అన్నిటి ఫలితంగా 1865 December 6న పదమూడవ రాజ్యాంగ సవరణతో సంపూర్ణ బానిసత్వ నిర్మూలన జరిగింది. బానిసలు స్వాతంత్ర్యాన్ని నిజంగానే పొందారు, విముక్తులైనారు. ఆ తర్వాత ఆఫ్రో అమెరికన్లకు వోటు హక్కు లభించింది. దీనినే చరిత్రకారులు "నీగ్రో అవర్" అన్నారు. కాని నిజంగా అది "నీగ్రో మాన్ అవర్" మాత్రమేనని తరువాత తెలుసుకొని మహిళోద్యమ నాయకులు మండిపడ్డారు.

మహిళలు మళ్ళీ సంఘటితమై American equal rights associationను ఏర్పరచి ఉద్యమించారు. అప్పటికే ఆంథోనికి డబ్భై ఏళ్ళు వచ్చాయి. ఇంతవరకు పెళ్లి చేసుకోలేదు. స్వంత ఇల్లు ఏర్పరచుకోలేదు. సోదరిల ఇళ్లల్లోనే ఉంటోంది. తండ్రి చనిపోయిన తర్వాత ఆయన ఇంట్లో నివశించింది. అంతటి అంకితభావంతో పనిచేసిన మహిళా మాణిక్యం ఆంథోని. తర్వాత Working womenís అసోసియేషన్ ఏర్పరచి వారిని ఆదుకుంది. పదిహేనవ రాజ్యాంగ సవరణలో కూడా మహిళా వోటు హక్కు గురించి ఏమీ లేకపోవటం స్త్రీలకు ఆగ్రహం కల్గింది. 1869లో National womenís Suffrage Association ఏర్పరచి లింగ, జాతి వివక్ష లేకుండా అందరికి వోటు హక్కు కలిపించాలని తీర్మానించింది. క్రమంగా ఉద్యమాలతో, పర్యటనలతో ఆమె జీవితం అంతా గడచిపోయింది. అలసిపోయింది.

యువతరానికి బాధ్యతలు అప్పగించి వెనుక నుండి సూచనలు చేస్తూ ఉద్యమానికి ఊపిరులు ఊదుతూనే ఉంది. 1872లో ఆమె తన సోదరిలతో కార్యకర్తలతో కలిసి హక్కు లేకపోయినా ప్రెసిడెంట్ ఎన్నికలో వోటు వేసింది. దీనికి ప్రభుత్వం ఆమెను అరెస్ట్ చేసింది. అయిదు వందల జరిమానా విధించారు. కట్టను పొమ్మంది. కోపం వచ్చి దాన్ని వెయ్యికి పెంచారు. ససేమిరా అంది. ఆమె అటార్నీ ఆ డబ్బు కట్టి బెయిల్ ఇప్పించాడు. తన కేసు సుప్రీం కోర్టుకు వెళ్ళకుండా అటార్నీ చేశాడని మండిపడింది. అప్పుడతను సౌమ్యంగా "I could not see a lady I respected put in jail" అని చెప్పి ఆమె యెడల ఉన్న గౌరవాన్ని తెలిపాడు. ఆమె జీవిత చరిత్రను "I da husted Haarpar" రాసింది. 1902లో మహిళా వోటు హక్కు కోసం సెనేట్ సెలెక్ట్ కమిటీలో చివరి సారిగా మాట్లాడింది. అవిశ్రాంతంగా మహిళా హక్కుల సాధన కోసం పోరాడి అలసిన ఆ మహోన్నత మహిళ సుసాన్ ఆంథోని. 13-03-1906న ఎనభై ఆరవ ఏట తుది శ్వాస విడిచింది. ఆమె గృహాన్ని జాతీయ స్మారక చిహ్నంగా ప్రభుత్వం చేసింది. ఆమె శిలా విగ్రహాన్ని వాషింగ్టన్‌లో నెలకొల్పి గౌరవం కలిపించారు.

సుసాన్ బి.ఆంథోని శత సంవత్సరం నాడు అంటే 1920 august 18 పందొమ్మిదవ రాజ్యాంగ సవరణ చేసి అమెరికా ప్రభుత్వం స్త్రీలందరికి వోటు హక్కును కల్పించింది. దాన్ని "సుసాన్ బి.ఆంథోని అమెండ్‌మెంట్"గా ప్రభుత్వం పేర్కొని ఆమె సేవలకు నీరాజనాలిచ్చింది. యాభై రెండేళ్ళ పోరాట ఫలితం ఇది. 1920 నవంబర్‌లో 26 మిలియన్ల అమెరికన్ మహిళలు వోటు హక్కును వినియోగించుకొన్నారు. ధన్యజీవి సుసాన్ బ్రౌనేల్ ఆంథోని. ❁



# 26. వాయురాణి ఎమీలియా ఎర్హార్ట్

## జననం - విద్యాభ్యాసం

**ఆ**మె అట్లాంటిక్, ఫసిఫిక్ మహా సముద్రాల మీదుగా విమానాన్ని నడిపిన మొదటి మహిళ. అమెరికా దేశం అంతా స్వంత విమానంలో చుట్టి వచ్చిన మొదటి మహిళా పైలెట్, ఆకాశంలో అధిక ఎత్తులో రికార్డు స్థాయిలో విమానాన్ని నడిపిన మొదటి మహిళ. ఇన్ని రికార్డులను నెలకొల్పి, ప్రపంచం అంతా చుట్టి వచ్చిన మొదటి మహిళ కావాలనే ధ్యేయంతో బయల్దేరి గమ్యానికి కేవలం వంద మైళ్ళ దూరంలో ఉండగా, ఆమె విమానం కనిపించకుండా పోయి, మిస్టరీగా మారి, అమెరికా వాయురాణి అనిపించుకొన్న మహిళా పైలెట్ అమీలియా ఎర్హార్ట్ హిస్టరీ ఇది.

అమీలియామేరీ ఎర్హార్ట్ 24-07-1897న అమెరికాలోని కాన్సాస్ రాష్ట్రంలో ఆచిన్సన్‌లో జన్మించింది. ఆమె పుట్టినప్పుడు పెద్ద తుఫాను వచ్చి వెలిసింది. తల్లి అమీ ఓటిస్ 14,1120 అడుగుల ఎత్తున్న రాకీ పర్వతాలలోని పైకేస్‌ను అధిరోహించి రికార్డు నెలకొల్పిన మొదటి మహిళ. తండ్రి ఎడ్విన్ స్టాంటన్ చిన్నప్పుడే తాత అమ్మమ్మల ఇంటికి వెళ్లి అక్కడి గుర్రాలను ఎక్కి స్వారీ చేయటం, కొండ గుహల్లో తిరగటం అలవాటు చేసుకొంది. అయితే ఆమెను రోలర్ కాస్టర్ ఎక్కి తిరగటాన్ని ఒప్పుకోలేదు. బాస్కెట్ బాల్ ఆడేది. స్లెడ్జిలపై చక్కగా నడిచేది. గుర్రపు కాళ్ళ మధ్య నేర్పుగా స్లెడ్జిపై జారటం నేర్చింది. తండ్రి రైల్ కంపెనీలో ఉద్యోగి. అందుకని ఫ్రీగా వీలైనప్పుడల్లా కుటుంబంతో ప్రదేశాలు తిరిగి చూసే

అవకాశం వచ్చింది. ఆయనకు ఉన్న కార్‌లో కిచెన్, భోజనాల గది, వంటవాడు ఉండేవారు. తండ్రి బాగా తాగుబోతు. అందువల్ల ఉద్యోగ భద్రత ఉండేది కాదు. ఈమె అమ్మమ్మ, తాత చనిపోవటంతో తల్లికి ఆస్థి బానే సంక్రమించింది. తండ్రి మిన్న సోటలో రైల్ క్లెర్క్‌గా పని చేయాల్సి వచ్చింది. కుటుంబం మిస్సోరిలోని మిన్నే సోటాకు మార్చాడు. అక్కడి నుంచి చికాగో వెళ్లి ఉన్నాడు. అక్కడ ఎమీలియా బేస్ టీంలో చేరి ఆడింది. కుటుంబం పెన్సిల్వేనియాకు చేరింది. అక్కడ రైడాల్‌లోని Ogantz school లో చేరి చదివింది. ఇట్లా ఊళ్లు తిరగటమే సరిపోయింది చిన్నతనం అంతా. అక్కడ హాకీ నేర్చింది. అక్కడి Alphaphi టీం ఈమెను తమ టీంలోకి ఆహ్వానించి ఆడమన్నారు. ఈమెకు మొదటి నుంచి సంప్రదాయ విధానాలు నచ్చేవి కావు. స్థానిక రెడ్‌క్రాస్‌కు సెక్రెటరిగా పనిచేసింది.

1917లో టోరంటోలోని సోదరి దగ్గరకు వెళ్ళింది. అప్పుడే యుద్ధ భీభత్సాన్ని కళ్ళారా చూసింది. రెడ్‌క్రాస్‌లో ఉన్న ఎమీలియా సైనికుల కోసం స్వెట్టర్లు అల్లి అందజేసింది. గాయపడిన సైనికులకు సాయం చేసింది. ఇదంతా మనసును కలచివేసింది. అందుకని మళ్ళీ స్కూల్‌లో చేరి చదవటానికి మనసు అంగీకరించలేదు. ఒక నర్సు దగ్గర సహాయకురాలిగా పనిచేసింది. ఆంబులెన్స్ బ్రిగేడియర్‌లో వాలంటరీ చేసింది. తర్వాత స్పాడినా మిలిటరి హాస్పిటల్‌కు వచ్చి యుద్ధంలో అసహాయులైన వారికి సేవలందించింది. అందులో "షెల్ షాక్"తో బాధపడ్డవాళ్ళు ఉండేవారు. వారి మానసిక పరిస్థితి వింతగా ఉండేది. రోజుకు పన్నెండు గంటలు పనిచేసేది. ఉదయం యేడు నుండి రాత్రి యేడు వరకు ఆమె డ్యూటి. సోదరితో ఖాళీ సమయాన్ని గడిపేది. అక్కడ గుర్రపు సవారీని ఇద్దరు బాగా చేసి ఆనందాన్ని పొందేవారు. అమీలియా గుర్రం పేరు "డైనమైట్". వీరున్న చోటికి దగ్గరే విమానాలు నడిపే ట్రెనింగ్ సెంటర్ ఉంది. అక్కడి ఆఫీసర్ ఈమె ఉత్సాహాన్ని చూసి విమానాలు ఎగరటం వచ్చి చూడమన్నాడు. అలా చూస్తూ విమానయానంపై అభిమానం బాగా పెంచుకొంది. ఈమెకు సైనస్ బాధ ఉండేది. దానికి ఆపరేషన్ చేయించుకొంది. టోరంటో వదిలి మాసాచుసెట్స్‌లోని నార్త్ ఆంప్టన్‌కు చేరింది. అక్కడ తల్లి సోదరి ఉన్నారు. ఆటోమోటివ్ మేషిన్ ట్రెనింగ్ పొందింది. డాక్టర్ కావాలన్న ఆలోచన కలిగింది. న్యూయార్క్ వెళ్లి కోంబియా వర్సిటిలో చేరింది. అక్కడి సంగీత కచేరీలకు వెళ్ళేది. గుర్రపు స్వారి చేసేది. యూనివర్సిటిలోని ఎత్తైన బిల్డింగ్ టాప్ ఎక్కి అందర్ని ఆశ్చర్యపరిచింది. అకస్మాత్తుగా వర్సిటి చదువు మానేసి కాలిఫోర్నియాలోని తల్లిదండ్రుల దగ్గరకు చేరింది.

## విమాన యానం

కాలిఫోర్నియాలో అప్పటికే విమానయానం బాగా ప్రాచుర్యం పొందింది. అక్కడి లాంగ్ బీచ్ దగ్గరున్న Daughter field లోని ఎయిర్ మీట్‌కు హాజరైంది. అప్పుడే పైలెట్

కావాలి అన్న ఆశయం మనసులో మెదిలింది. అక్కడి అధికారులతో మాట్లాడి ఆమె తండ్రి ఈమెను విమానం ఎక్కించి చక్కర్లు కొట్టించే ఏర్పాట్లు చేశాడు. అది అద్భుతం అనిపించిన్దామెకు. పైలెట్ శిక్షణ తీసుకోవాలనుకొంది. చాలా ఖర్చుతో కూడిన పని అది. ఒక చిన్న ఉద్యోగం చేస్తూ నేర్చుకోవాలనుకొంది. మహిళా పైలెట్ అయితే బాగా నేర్పుతుందని భావించింది. అక్కడ ఇరవై నాలుగేళ్ల "నేతా స్నూక్" అనే ఆమె నేర్పటానికి అంగీకరించింది. 1920 Decemberలో గ్లేన్డేల్‌లోని కిన్నెర్ ఎయిర్‌పోర్ట్‌కు చేరుకొంది. స్నూక్ దగ్గరుండి నేర్పాలి గాలిలో ఉన్న ప్రతి నిమిషానికి ఒక డాలరు ఆమెకు ఇవ్వాలి. అప్పటికే యుద్ధంలో దాచుకున్న Liberty బాండ్లను ఉపయోగించి ఆమె బిల్లు చెల్లించింది. 1921 January 3న మొదటి లెసన్. ఏరో డైనమిక్స్ మీద పుస్తకాన్ని తన దగ్గర ఉంచుకొంది. ముందు భూమిమీద విషయాలన్నీ నేర్చింది. ఆరు నెలల శిక్షణ తర్వాత స్వంత విమానాన్ని రెండు వేల డాలర్లు పెట్టి కొనుక్కొన్నది. అదే ఎల్లో కిన్నెర్ ఐర్స్టేర్. దాన్ని ఆమె "ది కానేరి" అని ముద్దుగా పిల్చుకొన్నది. ఒక టెలిఫోన్ కంపెనిలో కూడా పనిచేసింది. లక్ష్య సాధనానికి ఎన్ని తంటాలు పడాలో అన్నీ పడింది. ఇంకా ఒంటరిగా విమానం నడపటం సాధ్యం కాలేదు. స్టంట్ ఫ్లైయింగ్, బ్యాంక్స్, బారెల్ రోల్స్, లూపస్‌లలో ప్రాథమిక విషయాలన్నీ నేర్చింది. అన్నీ నేర్చిన తర్వాత మొదటిసారిగా ఒంటరిగా విమానం నడిపి 5000 అడుగుల ఎత్తుకు యెగిరి దిగింది.

## మొదటి రికార్డు

ఎమీలియాకు నేర్పిన స్నూక్ వివాహం చేసుకొని ఉద్యోగం మానేసింది. ఇక బాధ్యత అంతా ఈమెమీదే పడింది. ఆమెను గురించి స్థానిక పత్రికలన్నీ పెద్ద పెద్ద ఫోటోలతో గొప్పగా రాశాయి. 1922 October 22న తన ఐర్స్టేర్ విమానం ఎక్కి ఒంటరిగా ఆకాశంలో విహరించి వీలైనంత ఎత్తుకు ఎగిరింది. బారోగ్రాఫ్‌ను సీల్ చేయించింది. చివరికి చూస్తే తాను 14,000 అడుగుల ఎత్తున ఉన్నట్లు గమనించింది. ఇది అంతకుముందు యే మహిళా పైలెట్ కూడా చేరని ఎత్తు. అంటే అమీలియా రికార్డు స్థాపించిందన్న మాట. వీరి కుటుంబం నవేడాలోని జిప్సం మైనింగ్లో పెట్టుబడి పెట్టిన డబ్బుకు ప్రతిఫలం లభించలేదు. ఇదో నిరాశ.

సోషలిస్టు భావాలున్న Industrial workers of the worldకు మిత్రులతో హాజరైంది. అక్కడ అరవై ఏళ్ళు దాటిన వారందరికి పెన్షన్‌ను ప్రభుత్వం ఇవ్వాలని తీర్మానం చేశారు. 1923 may16న ఎమీలియాకు ఫ్లయింగ్ సర్టిఫికేట్ చేతికి వచ్చింది. తన విమానాన్ని అమ్మేసి ఉద్యోగ ప్రయత్నాలు చేసింది. ఒక ఫోటోగ్రాఫ్ స్టూడియోలో ఉద్యోగంలో చేరింది. తర్వాత తానే స్వంతంగా ఫోటోలు తీయటం, అమ్మటం నేర్చింది. మళ్ళీ కొత్త విమానాన్ని కొనుక్కొంది. మళ్ళీ సైనస్ ఆపరేషన్ చేయించుకోవాల్సింది పాపం. విమానాన్ని అమ్మేసి

ఇంకోటి కొంది. దీనికి కిజేల్ (ఎల్లో పెరిల్) అని పేరు పెట్టింది. తల్లితో 7000 మైళ్ళు విమానంలో ప్రయాణం చేసి బోస్టన్ చేరింది. మళ్ళీ సర్జరీ అవసరమై, చేయించింది. తర్వాత న్యూయార్క్ వగైరాలు తిరగటంతో చేతిలో డబ్బు ఖాళీ. బోస్టన్ చేరి హార్వర్డ్ సమ్మర్ స్కూల్‌లో లెక్కల కోర్సులో చేరింది.

## సాంఘిక సేవా కార్యక్రమాలు

విమానం నడిపే దానిలో ఎక్కడా ఉద్యోగాలు రాలేదు. పొట్ట గడవాలి. డేనిసాన్ హౌస్‌లో సోషల్ వర్కర్‌గా పనిచేసింది. అక్కడే Syrian motherís club స్థాపించి, సిరియా నుంచి వచ్చిన వలసదారుల పిల్లలకు చదువుకొనే వీలు కల్పించింది. చైనీస్ ఆడపిల్లలతో బాస్కెట్ బాల్ ఆడించింది. ఆ హౌస్‌కు డైరెక్టర్ అయింది. బోస్టన్‌లో జరిగే జాతీయ బోస్టన్ సెటిల్‌మెంట్స్ సమావేశానికి ఎమీలియా ప్రతినిధిగా ఆహ్వానాన్ని పొందింది. 1927లో బోస్టన్ నగరంపై విమానంలో ఎగురుతూ మెమోరియల్ డేకు ఫ్రీ పాసులును వెదజల్లింది.

## వెతుక్కొంటూ వచ్చిన అవకాశం

హరాల్డ్ డెన్నిసన్ అనే ఆయనకు మాసాచూసెట్స్‌లో ఒక విమానాశ్రయాన్ని నెలకొల్పే ఆలోచన కలిగింది. అమీలియాను సంప్రదించాడు. ఈమె బోస్టనియన్ పత్రికలో మహిళా పైలట్ల గురించి మంచి వ్యాసం రాసింది. ఇంకా ఎక్కువ మంది విమానాలు నడపటానికి ముందుకు రావాలని కోరింది. చార్లెస్ లిన్డెర్ బెర్గ్ మొదటిసారి అట్లాంటిక్‌ను దాటినప్పటి నుండి అమీలియాకు తానూ దాన్ని సాధించాలన్న కోరిక పెరిగింది. 1928 april 7న ఆమెకో ఫోన్ వచ్చింది. అందులో ఆమె అట్లాంటిక్ సముద్రాన్ని దాటే విమానం నడపటానికి ఆహ్వానం వచ్చింది. వెంటనే న్యూయార్క్ వెళ్లి జార్జి పుట్నం, డేవిడ్ లెమన్‌లను కలిసింది. ఆ ప్రయాణానికి స్పాన్సర్ అయిన Amy phipps guest కు బదులు ఈమె ప్రయాణం చేయాలి. పుస్తక రూపంలో లెక్చర్ల రూపంలో వచ్చిన ధనాన్ని గెస్ట్‌కు ఇచ్చేయాలి. అదీ ఒప్పందం. సరేనంది అమీలియా. ఫ్రెండ్‌షిప్ అనే విమానాన్ని నడపాలి. జూన్ మూడున బోస్టన్ నుంచి న్యూ ఫౌండ్‌లాండ్, కెనడా మీదుగా నోవా స్కాతియాలోని హాలిఫాక్స్ విమానాశ్రయం చేరింది. అక్కడి నుంచి వేల్స్‌లోని బారీ పాయింట్ చేరి ప్రయాణాన్ని విజయవంతంగా ముగించింది. పేపర్లన్నీ విజయ గీతికలు పాడాయి. ఆమెను “లేడీ లిండెర్ బెర్గ్” అని చెప్పింది. అట్లాంటిక్‌ను దాటిన మొదటి మహిళగా రికార్డు సాధించింది. వేల్స్‌లో చాలాకాలం ఉన్న తర్వాత ఇంగ్లాండ్‌కు వెళ్ళింది. అందరు తనను పొగుడుతుంటే “నేను ఒక ప్రయాణీకురాలను మాత్రమే” అని చెప్పింది. అమెరికాకు తిరిగి వచ్చి ఎంతో అభిమానాన్ని సంపాదించింది. ఆమెను "Lady Lindy", "the queen of the air" అని గౌరవంగా పిలిచారు. ప్రెసిడెంట్ రూజ్ వెల్ట్ ఆమెకు విరోచిత స్వాగతం పలికాడు. న్యూయార్క్ సిటి తాళం చెవిని ఇచ్చి గౌరవించారు.

ఆమె అమెరికన్ హీరోయిన్ అయిపోయింది. ఇది చారిత్రాత్మక సత్యం. అనేక సభలు సమావేశాలలో మాట్లాడి ఎందరికో స్ఫూర్తి కలిగించింది. ఎంతో దబ్బు చేతికి వచ్చింది. అప్పులన్నీ తీర్చేసింది.

## రికార్డులే రికార్డులు

పుట్నంను వివాహమాడాలని నిర్ణయించింది. లేడీ హిత్ నుండి విమానాన్ని కొని న్యూయార్క్ నుంచి అతనితో బయల్దేరింది. కాని పిట్స్ బర్గ్‌లో అది దొర్లిపోయింది. ఇంగ్లాండ్ నుంచి తగిన పరికరాలు తెప్పించి బాగు చేయించాడు పుట్నం. 19314లో పుట్నంను పెళ్లి చేసుకొంది. ఆ తర్వాత 19000 అడుగుల ఎత్తుకు విమానాన్ని నడిపి రికార్డు నెలకొల్పింది. తాను మొదటిసారి అట్లాంటిక్‌ను దాటినా స్వంతంగా స్వంత విమానంలో దాటలేదనే బాధ ఆమెలో ఉంది. ఆ కోరిక 1932లో తీరింది. ఒంటరిగా అట్లాంటిక్‌ను నాన్‌స్టాప్‌గా దాటి రికార్డు సాధించింది. అమెరికా కాంగ్రెస్ ఆమెకు అత్యంత విలువైన The distinguished flying cross ను ప్రదానం చేసి గౌరవించింది. 1932లో ఫసిఫిక్ మహా సముద్రాన్ని ఒంటరిగా దాటి రికార్డు నెలకొల్పింది. ఈ రెండు సముద్రాలను దాటిన వారిలో మొదటి స్థానం ఆమెదే. హనోలూలు నుండి కాలిఫోర్నియాలోని ఓక్‌లాండ్‌కు చేరింది ఫసిఫిక్ మీదుగా. అంతకు ముందే అమెరికా అంతా తన విమానంలో చుట్టివచ్చి మరో రికార్డు నెలకొల్పింది. మహిళల స్పీడ్ రికార్డు 2100 మైళ్ళను సాధించింది. మెక్సికో నుండి వాషింగ్‌టన్‌కు 14 గంటల్లో చేరి లిండ్‌బెర్గ్ రికార్డును బద్దలుకొట్టింది. విమానయాన చరిత్రనే తిరగ రాసింది రికార్డులతో. అడిగిన చోటికల్లా వెళ్లి ఉపన్యాసాలు చేసి మొత్తం మీద సుమారు లక్షమందిని ఆనందింపజేసింది. ఒక్కో సమావేశానికి మూడు వందల డాలర్లు వసూలు చేసింది.

## ప్రపంచం చుట్టాలనే తీరని కోరిక

1935లో Purdue university మహిళల ఉద్యోగ విషయాల డిపార్ట్‌మెంట్‌లో లెక్చరర్ ఉద్యోగం పొందింది. సాలుకు రెండు వేల డాలర్లు. ఆమెకు ఎయిరో నాటిక్స్‌లో రిసెర్చ్ చెయ్యాలనే సంకల్పం కలిగింది. దానికి విరాళాలు కావాలి. జనానికి తెలియజేసింది. విరాళాల వెల్లువే వచ్చింది. దానితో ఒక విమానాన్ని కొని "Tlying laboratory"గా మార్చాలనుకొంది. ఆమె "Ameelia Earhaart fund for aeronautical research" అనే సంస్థను నెలకొల్పింది. "ఎలెక్ట్రా" అనే రెండు ఇంజన్ల విమానాన్ని కొన్నది. దాని వేగం గంటకు 210 మైళ్ళ అత్యంత వేగం. దాదాపు 27000 అడుగుల ఎత్తుకు ఎగిరే సామర్థ్యం దానిది. అప్పటికి అలాంటి విమానాలు ప్రపంచంలో ఇద్దరి వద్దనే ఉన్నాయి. ఒకటి అమీలియా దగ్గర రెండోది ఏవియేషన్ గురు అని పిలువబడే Howard hughes దగ్గరా మాత్రమే ఉన్నాయి. ఈ విమానంతో ప్రపంచ యాత్ర చేస్తూ విమానంలోని విషయాలను తెలుసుకొంటూ,

దేశకాల పరిస్థితులకు అది ఎలా నిలబడుతుందో గ్రహిస్తూ పర్యటన చేయాలని ఆమె ఆశ. కాలిఫోర్నియాలోని ఓక్‌లాండ్‌లో 1937 february 12 ప్రపంచ యాత్రకు శ్రీకారం చుట్టింది. తూర్పు పడమరలను కాలిఫోర్నియా నుండి హవాయికి ప్రయాణించి రికార్డు నెలకొల్పింది. మియామి నుండి రెండో దశ ప్రారంభించింది. ఇండియా పాకిస్తాన్ ఐరోపా దేశాల్ని చుట్టింది. ఫసిఫిక్ సముద్రంలోని "హౌలాండ్ ఐలాండ్"కు చేరితే ప్రపంచయాత్ర సంపూర్ణం. అశేష జనం ఆమెకు స్వాగతం పలకటానికి ఆ ద్వీపం చేరారు. ప్రభుత్వం సర్వ సన్నాహాలు చేసింది. కానీ దురదృష్టవశాత్తు ఇంకా వంద మైళ్ళు గమ్యస్థానానికి దూరంగా ఉన్న సమయంలో అప్పటిదాకా వచ్చిన రేడియో సంకేతాలు ఆగిపోయాయి. ఆమె విమానం ఎక్కడ ఉందో తెలీలేదు. అందుకు కంగారుపడ్డారు.

ఎంత ప్రయత్నించినా విమానం జాడ లభించలేదు. అమెరికా ప్రభుత్వం 2,50,000 చదరపు మైళ్ళ విస్తీర్ణం అంతా వెదికించింది. 65 విమానాలు పర్యవేక్షణ జరిపి వెతికాయి. 10 నౌకలు 4000 మంది జనం అడుగడుగు గాలించి జల్లెడ పట్టినా విమానం మిస్టరీగా అదృశ్యమైంది. బ్రిటన్, జపాన్ దేశాలు కూడా సహకరించాయి. 1937 july 18న అన్వేషణను నిలిపివేశారు. ఆమెను రష్యావాళ్ళు హైజాక్ చేసి తీసుకొని వెళ్లారనే ఊహాగానాలున్నాయి. కాని ఏదీ నిర్ధారణ కాలేదు. ప్రపంచ యాత్ర చేయాలన్న అమీలియా ఎర్హార్ట్ సంకల్పం చివరి క్షణాల్లో విఫలమైనా ఆమె చరిత్ర సంకల్పానికి, ధైర్య సాహసాలకు, పట్టుదలకు, సేవా నిరతికి ఆదర్శంగా నిలిచిపోయింది. సమాజంలోని మౌఢ్యాలను తిరస్కరించిన మహిళ ఆమె. "వాయు రాణి" అని అందరి చేతా ఆప్యాయంగా పిలిపించుకొన్న గగన విహారిణి. ప్రాణవాయువు అనంత గగనంలో కలిసిపోవటం బాధాకరం.

"Though she may gone from this world, the spirit of Amelia Earhart lives on in any a person who looks out to the horizon and dreams that, despite their circumstances, they can fly higher."❀

**(విహంగ మహిళా వెబ్ మాసపత్రికలో ప్రచురితం)**



## 27. చారిత్రక నవలా రచయిత్రి - ఈస్టర్ ఫోర్బ్స్

**అ**మెరికా కాలనీ వాసుల కాలంలో జరిగిన అనేక సంఘటనలపై స్పందించి, ఆ చరిత్రను నేపథ్యంగా తీసుకొని గొప్ప నవలలు రాసిన రచయిత్రి ఈస్టర్ ఫోర్బ్స్. ఆ నవలల్లో గొప్ప ఖ్యాతి పొందిన నవల "జానిట్రేమేన్". ఆమె మాసాచూసెట్స్ రాష్ట్రంలో బోస్టన్ నగరానికి దగ్గరలో ఉన్న వెస్ట్ బోరోలో 28-06-1891లో జన్మించింది. మాసాచూసెట్స్‌ను "న్యూ ఇంగ్లాండ్" అంటారు. చిన్నప్పటి నుండి అక్కడ యుద్ధ వాతావరణమే. తలిదండ్రులు బాగానే విద్యావంతులు. తండ్రి ఆమ్‌హెర్స్ట్ కాలేజి గ్రాడ్యుయేట్. ఆయన కాన్‌స్టాంటి నోపుల్, టర్కీలకు వెళ్లి గణితం బోధించేవాడు. ఆయన గ్రీకు నగరం "ట్రాయ్" వెళ్లి అక్కడి త్రవ్వకాలు చూసి ఆ విషయాలన్నీ వచ్చిన తర్వాత ఇంట్లో పిల్లలకు చెప్పాడు. అది వారిమీద పెద్ద ప్రభావమే కల్గించింది. ఆయన ప్రోబేట్ కోర్టులో జడ్జి అయ్యాడు. తల్లి హారిఎట్ మెర్రి ఫీల్డ్ ఆనాటి మొదటి విద్యా సంస్థ అయిన "Oread academy in worsester" చదువుకొంది. మంచి చరిత్రకారిణి. రెండు మూడు పుస్తకాలు రాసి ప్రచురించి, కూతురికి ప్రేరణ కల్గించింది. కాలనీల చరిత్ర రాయటంలో తల్లి కూతుళ్ళు కలిసి పనిచేశారు.

తలిదండ్రులకు ఉన్న సంతానంలో అయిదవ అమ్మాయి ఈస్టర్. పైవాళ్ళంతా బాగా చదువుకొన్నారు. చిన్నప్పటి నుండి ఈమెకు కథలు చెప్పి చెల్లెలు కతేరిన్‌తో కాలక్షేపం చేసేది. ఎనిమిళ్ళకే పక్కపిల్లలతో కలిసి ఒక సామాజిక మేగజైన్ తయారు చేసింది. తల్లి ఈమెను చదవమని, రాయమని, బొమ్మలు వేయమని ప్రోత్సహించేది. హైస్కూల్ చదువు అయిన తర్వాత బోస్టన్‌లోని Worester Art Museumలోను బ్రాడ్‌ఫోర్డ్ లోని జూనియర్ కాలేజిలోను చదివింది. తన రచన కొనసాగిస్తూనే ఉంది. 1912లో బ్రాడ్‌ఫర్డ్ నుండి

గ్రాడ్యుయేట్ అయింది. మళ్ళీ బోస్టన్‌లో రచయితల ట్రెయినింగ్‌లో చేరింది. చెల్లెలు కేథరిన్ విస్కాన్సిస్ వర్సిటిలో టీచింగ్‌లో చేరితే ఈమె కూడా వెళ్ళింది. గుర్రపుస్వారీ చేసేది. ఆమె కథకు బహుమతి వచ్చింది. విస్కాన్సిస్ లిటరరీ మేగజైన్‌లో ఆమె కథ పడింది. దాన్ని వో. హెన్రీ అవార్డుకు పంపారు.

1917లో మొదటి ప్రపంచ యుద్ధంలో వాలంటరీగా పనిచేసింది. వెస్ట్ వర్జీనియాలోని ఒక వ్యవసాయ క్షేత్రానికి ఈస్టర్‌ను పంపారు. అక్కడి రైతు ఈమెకున్న ఉత్సాహాన్ని గమనించి గుర్రాలను ఆమెకు అప్పగించాడు. వాటితో బాగా గడిపింది. విస్కాన్సిన్‌లో చదువుతూ రచనకు మెరుగులు దిద్దుకొంది. విస్కాన్సిన్ లిటరరీ మేగజైన్ ఎడిటోరియల్ బోర్డులో పనిచేసింది. అక్కడే రౌలింగ్ అనే మహా రచయితతో పరిచయం ఏర్పడింది. ఆయన రాసిన "Yearling" పుస్తకం బాగా ప్రాచుర్యం పొందింది. తను విస్కాన్సిన్ రావటానికి కారణం గొప్ప నవల రాయటానికే అని చెప్పేది ఫోర్బ్స్. 1919లో ఇంటికి తిరిగి వెళ్ళింది. అక్కడ ఒక పబ్లిషింగ్ కంపెనిలో అసిస్టెంట్ ఎడిటర్ అయింది. ఆమె స్పెల్లింగ్ మిస్టేకులు ఎక్కువగా చేసేది. అందుకనే హోదా తగ్గింది. లేకపోతే చీఫ్ ఎడిటర్ అయి వుండేది. అక్కడ ఆమె ఎంతో మంది రచయితలు పంపే రాతప్రతుల్ని శ్రద్ధగా చదివేది. అందులో పదార్థం ఉంటే తప్పక ప్రచురించేది. ఫ్రెంచి విప్లవ నేపథ్యంలో వచ్చిన ఒక నవలను అవసరం మేరకు తగ్గించి ఎడిట్ చేసి పత్రికలో ప్రచురితం అయ్యేట్లు చేసింది. అది "Rafael sebatini" రాసిన "Scaramouche" ఆ నవల చారిత్రక నేపథ్యంతో రాయబడి ఉండటంతో బాగా పాప్యులర్ అయ్యింది. సినిమాగా కూడా తీశారు. ఇది ఈస్టర్ పుణ్యమే.

తాను పనిచేస్తున్నా, నిరంతరం రాస్తూనే ఉంది. బోస్టన్ ఈవెనింగ్ ట్రాన్స్క్రిప్ట్‌కు తరచూ రాసేది. అందులో మెసాచూసెట్స్‌లోని రచయితల జీవిత చరిత్ర ఆ రాష్ట్ర చరిత్ర రాసేది. అవి బాగా పేరు పొందాయి. కేంబ్రిడ్జి అపార్ట్‌మెంట్‌లో మిగిలిన యువ స్నేహితులతో కలిసి ప్రతివారం డిన్నర్ పార్టీని చేసుకొంటూ కొత్త అతిథిని ఆహ్వానిస్తూ ఆయన చెప్పింది తెలుసుకొంటూ ఉండేది. అప్పుడే హార్వర్డ్ లా కాలేజి విద్యార్థి ఆల్బర్ట్ హాస్కిన్స్‌తో పరిచయమైంది. అయితే అదేమీ ప్రేమగా చిగురించి పూలు పూయలేకపోయింది. కారణం ఆమెకు దీని గురించి ఆలోచించే సమయం తీరికా లేకపోవటమే. కాని 1926లో అతన్నే పెళ్లిచేసుకొంది. పెళ్లి అయిన తర్వాత కొన్ని నెలలకు "o genteel lady" అనే విక్టోరియా పాలనలోని ఒక స్త్రీ గురించి నవల రాసింది. దీనికి తనకు ప్రేరణ "Goodies ladyís books" అని తెలియజేసింది. ఎప్పుడో ఇంగ్లాండ్‌లో జరిగిన చారిత్రక విషయాల నేపథ్యంలో ఆమె అంత విషయ సేకరణ చేసి అద్భుతంగా రాసిందని మెచ్చారు. Newyork time book review ìmiss forbes has caught and kept through out the charm of the by gone days she describes. she has captured the elusive lace and lavender

element without its mustiness అని పొగిడింది. ఒక్క నెలలో ఈ పుస్తకం అమ్మకాలు విపరీతంగా పెరిగాయి. హనీమూన్‌కు దంపతులు యూరప్ వెళ్లి వచ్చారు. న్యూయార్క్‌లో నివాసం. భర్త లా ఫారంలో పని చేస్తున్నాడు. ఈమె కొత్త నవల "A mirror for witches" పై దృష్టి పెట్టింది. తన తల్లి కుటుంబం సేకరించిన ఎన్నో విషయాలను అధ్యయనం చేసింది. అందులో తల్లి చెప్పిన ఒక యదార్ధ గాధ ఆమెను బాగా కదిలించింది. Rebeca chamberlain అనే ఆమె ఒక దెయ్యం అని జైల్లో విచారణ ఎదుర్కొంటుండగానే చనిపోయిన కథ అది. దీని ప్రభావం ఈమెమీద బాగా ఉంది. కేంబ్రిడ్జిలో ఉండగా కూడా దెయ్యపు కథలు చాలా విన్నది. ఒక అభాగ్యురాలైన యువతీ మాంత్రికురాలు అని నిందమోపిన ఏడవ శతాబ్దిలో "సేలం"లో జరిగిన కథ ఆధారంగా 1928లో "A mirror of witch craft" నవల రాసి ప్రచురిస్తే అద్భుతమైన అప్లాస్ వచ్చింది. విమర్శకులూ మెచ్చారు. అందులో డాల్ బిల్లీ అనే ఇంగ్లీష్ అమ్మాయిని హీరోయిన్‌ను చేసింది. ఇది గొప్ప సృజనాత్మక నవల అన్నారు. ఇలా మంత్రగత్తెలు, దెయ్యాల కథలు చివరిదాకా రాస్తూనే ఉంది. ఫోర్బ్స్ భర్తకు తనకంటే భార్యకు పేరు ఎక్కువగా రావటం అసూయ కలిగించింది. ఆమెను రాయవద్దు అని ఆంక్ష పెట్టాడు. అతను ఇంట్లో ఉన్నంతసేపు రాసేది కాదు. ఆ తర్వాత రాసేది. చివరికి ఇద్దరు విడాకులు తీసుకొన్నారు. ఈమె మళ్ళీ స్వంత ఊరు వోర్సెస్టర్ చేరింది. తన ఇంటికి కొద్దిదూరంలోనే సోదరి కేథరిన్ ఉండేది. ఆమెకు అప్పుడు అర్థమైంది రచయిత రాసుకోవటానికి ఏకాంతం అవసరం అని. అమ్మా చెల్లెలు సోదరి కర్నిల్లా ఉన్న ఇంట్లో మూడో ఫ్లోర్‌లో ఏకాంతంగా రాసుకొనే ఏర్పాటు చేసుకొంది.

షార్ట్‌హాండ్ రాసినంత వేగంగా రాసేది, మళ్ళీ తిరిగి చదువుకొని సాపు చేయటం అలవాటు. మెసాచూసెట్స్‌లోని కాలనీల జనాన్ని గురించి నవల రాయాలని సంకల్పించింది. ఈలోపునే "మిస్ మర్వేల్" అనే నవలను కేవలం పది రోజుల్లో రాసేసింది. ఇదివరకు అనుకొన్న ప్లాట్ ఆధారంగా "Paradise"పై ఆలోచన పెట్టి ఆరు నెలల్లో పూర్తి చేసి 1937లో పబ్లిష్ చేసింది. ఇది విపరీతంగా అభిమానం సంపాదించింది. తర్వాత ఏడాది "The genteel lady" విడుదలై విజం సాధించింది. ఇది "బాత్ సీబా స్పూనేర్" అనే ఆమె తన భర్తను మరో ముగ్గురిని చంపిన నేరం కింద ఉరి తీయబడింది అనే కథ. మంచి పాత్రలు, నిర్వహణ ఆమెకు పేరు తెచ్చాయి. ఉరి తీయబడ్డ ఆవిడకు బ్రిటీష్ ఆఫీసర్‌తో అనైతిక సంబంధం ఉందనేది తరువాత తెలుస్తుంది. ఇందులోని చారిత్రక యదార్ధం అందర్నీ ఆశ్చర్యపరచింది. ఆమె పరిశీలనా దృష్టికి జేజేలు పలికారు. పులిట్జర్ బహుమతి పొందిన స్టీఫెన్ విన్సెంట్ బెనేట్ అనే ఆమె గొప్ప రివ్యూ రాసింది. ఈ నవల విడుదల అయిన తర్వాత గొప్ప పార్టీ కూడా ఇచ్చింది ఫోర్బ్స్.

"Paul revere and the world he lived in" అనేది 1943 పులిట్జర్ బహుమతి పొందింది. న్యాయంగా ఆ బహుమతి తన తల్లికి చెందాలని అంటుంది ఈస్టర్. మంచి విమర్శలతో ఈ పుస్తకం దూసుకుపోయింది. పులిట్జర్ సాధించిన తర్వాత మరో విజయవంతమైన నవల రాసి చరిత్రలో స్థిర స్థానం సంపాదించాలని మనస్ఫూర్తిగా కోరుకొన్నది. అప్పుడే అమెరికన్ రివల్యూషన్ నాటి యదార్ధ గాధ "Johney tremain" జీవితాన్ని నవలగా రాయాలనిపించింది. అంతే దీక్షగా దానిపై పరిశోధన చేసి నవలను సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దింది. 1943లో ప్రచురితమై గొప్ప విజయం సాధించింది. దీనికి న్యూ బేరి అవార్డు పొందింది. ఆ తర్వాత నాలుగేళ్ళు నాన్ ఫిక్షన్ రాసింది. 1948లో "The running of the tide" రాసింది. దీనికి m.g.m.వాళ్ళు సినిమాగా తీశారు. దీనికి ఆమెకు ఒక లక్షా యాభై వేల డాలర్ల పారితోషికం లభించింది. వాల్ట్ డిస్నీ జానీ ట్రేమన్‌ను సినిమాగా తీశాడు. దీని మూవీ హక్కుల కింద ఆమెకు దక్కింది కేవలం అయిదు వేల డాలర్లే.

1954లో చివరి నవల "Rainbow on the road" రాసి విడుదల చేసింది. ఇది 1830 కాలంనాటి జానపద కళాకారుని యదార్ధ కథ. పదిహేనవ శతాబ్దంలోని మాసాచూసెట్స్ "విచ్ క్రాఫ్ట్"పై రాయాలని మొదలు పెట్టింది. కాని పూర్తి చేయలేకపోయింది. "American Antiquarian Society in worester"కు 1960లో ఎన్నిక అయిన మొదటి మహిళా రచయిత్రి ఫోర్బ్స్. ఆ సంస్థ అరుదైన విషయాలను సేకరించి భద్రపరచి ప్రజలకు అందుబాటులోకి తెస్తుంది. డెబ్భై ఆరేళ్ళు జీవించి అమూల్యమైన చారిత్రాత్మక నవలలు రాసిన ఈస్టర్ ఫోర్బ్స్ 12-08-1967లో మరణించింది. ఆమె నవల జానీ ట్రేమేన్ పదికి పైగా భాషల్లోకి అనువదించబడింది. ఎన్నో సార్లు పునర్ముద్రణ పొంది లక్షలాది కాపీలు అమ్ముడు పోయాయి. ఆమెను గురించి "newyork time" పత్రిక గొప్ప ప్రశంసను కురిపించింది. "Forbes is a novelist who wrote like a historian, and a historian who wrote like a novelist, achieved a reputation as one of the most exciting and knowledgeable authors on the revolutionary era."❀



## 28. ఎమిలి బ్రాంట్

**1**847లో ఇంగ్లాండు దేశంలో వచ్చిన పారిశ్రామిక విప్లవం వల్ల సంప్రదాయ జీవన విధానం దెబ్బతిన్న తీరును, సాంఘిక వర్గ భేదాలను, భూమిపై యాజమాన్యం పోవటాన్ని దానివల్ల అప్పటిదాకా వచ్చిన సాంఘిక హోదా మారిపోయి ధనిక సంపన్న వర్గాలకే హోదా రావటాన్ని వారే "జెంటిల్ మెన్"గా చెలామణి అవటాన్ని ఎమిలీ బ్రాంట్ అనే ఇంగ్లాండ్ రచయిత్రి "Wuthering heights" అనే తన నవలలో అద్భుతంగా ఆవిష్కరించింది. ఆమె జీవిత విశేషాలను తెలుసుకొందాం.

1818లో ఎమిలి బ్రాంట్ జూలై 30న లండన్ దగ్గర Thornton - Yarkshire లో జన్మించింది. తండ్రి పాట్రిక్ బ్రాంట్, తల్లి మెరియా. ఆరుగురు సంతానంలో అయిదవ పిల్ల ఎమిలి. మూడేళ్ళకే తల్లిని కోల్పోయిన అభాగిని. ఆ తల్లి సోదరి ఎలిజబెత్ వీరందర్నీ సాకి, పెద్దవాళ్ళను చేసింది. ఏడేళ్ళ తర్వాత స్కూల్‌లో చదువుతున్న అక్కలు మెరియా ఎలిజబెత్‌లు అంటు వ్యాధితో మరణించారు. ఎమిలీని వేరుగా హావర్త్‌లో ఉంచారు. ఇక్కడ ఆమె పదేళ్లు ఉంది. తండ్రి పిల్లల కోసం కొయ్య సైనికుల బొమ్మలు కొని ఇచ్చాడు. వీటితో ఈమె ఆడుకొంటూ వాటి గురించి ఊహతో కథలు రాసింది. అవే "గొందాల్" కథలుగా ప్రసిద్ధి చెందాయి. అవి ఆమె భావోద్వేగాలే అంటారు విశ్లేషకులు. చార్లెట్ అనే సోదరి టీచర్‌గా చేరి ఎమిలిని తన శిష్యురాలిగా చేసుకొంది. తర్వాత ఎమిలీ కూడా అసిస్టెంట్ టీచర్ అయింది. ఆమెకున్న సిగ్గు, బిడియం కలిసిపోని తనం, ఆమెను టీచర్‌గా రాణించటానికి ఉపయోగపడలేదు.

ఇరవై ఏళ్ళ వయసులో ఎమిలి "హావర్త్"కు తిరిగి వెళ్ళింది. తండ్రి పెయింటింగ్ చేస్తూ కొంత సంపాదిస్తున్నాడు. సోదరిలు అంతా కలిసి ఒకస్కూల్ పెడదామనుకొన్నారు. డబ్బు లేక ఆగిపోయారు. ఇతర భాషలు నేరిస్తే కాని బడి పెట్టటం కుదరదని తెలిసి ఎమిలి, చార్లేట్లు బ్రసేల్సుకు వెళ్లారు. అక్కడ ఫ్రెంచ్, జర్మన్ భాషలు నేర్చారు. వీరిని పెంచిన పెదతల్లి చనిపోయింది. ఆమె వీరికి కొంత ధనం ఇచ్చి చనిపోయింది. దాన్ని ఎలా బాగా ఉపయోగించాలా అని ఆలోచిస్తూ తండ్రి దగ్గరే ఉంది ఎమిలి. తాను ఇది వరకు రాసిన

కవితలన్నీ కాపీ చేసి "గోదాన్ పోయెమ్స్"గా పేరు పెట్టింది. వీళ్ళ సోదరుడు బ్రాన్వేల్ సరిగ్గా పనిచేయకపోవటం ఉద్యోగం పోగొట్టుకొని నెత్తిన కుంపటిలాగా ఉన్నాడు. చార్లేట్ బ్రాంట్ రాసిన "Jane eyre" నవలా ఎమిలీ రాసిన "Wuthering heights" నవల ఒకేసారి ప్రచురితం అయాయి. చార్లేట్ నవల బాగా ఆకట్టుకొంది. కాని ఎమిలి నవల ఆశ్చర్యాన్ని కల్గించింది. ఈమె రాసిందా అనుకొన్నారు అందరు. సోదరుడు బ్రాన్వేల్ చనిపోయడు. మిగిలిన ముగ్గురు సోదరులు చాలా ఆందోళనకు గురైనారు. తండ్రి కూడా అంతకు ముందే పోయాడు. చివరికి ఎమిలీ కూడా క్షయ వ్యాధితో 1948 డిసెంబర్ 19న మరణించింది. ఆమెను హోవార్త్ స్మశాన వాటికలో సమాధి చేశారు. 32 ఏళ్ళకే ఆమె తనువు చాలించింది. సోదరి చార్లేట్ Shirley అనే పుస్తకాన్ని ఎమిలీ అన్నేలకు అంకితమిచ్చింది. 1850లో ఎమిలీ రాసిన wuthering heights నవలను పునర్ముద్రణ చేస్తూ ఎడిట్ చేసి ఉపోద్ఘాతం రాసింది చార్లేట్. ఈ నవలను సినిమాగా కూడా అదే పేరుతో తీశారు. చార్లేట్, ఎమిలీలు ఇద్దరు అక్కచెల్లెళ్ళు. నవలా సాహిత్య రచనలో నవలామణులనిపించుకొన్నారు.

ఈ నవలలో ఎమిలీ తాను చూసిన పల్లె ప్రాంతాలను, జనుల్ని కథలో చేర్చింది. తన ఊహా శక్తిని జోడించింది. ఆమెలోని బిడియాన్ని పాత్రలలో ప్రవేశపెట్టింది. అందులోని Eath cliff పాత్రకు ఆమె ప్రేరణ. సోదరుడు బ్రాన్వేల్ పాత్రను అందులో చొప్పించి చెడుకు సమాజంలో స్థానం లేదని తేల్చింది. ఈ నవలలో వర్గపోరాటం ఉంది. దాని ప్రతిభావంతంగా చిత్రించింది. ఇంగ్లాండులోని పారిశ్రామీకరణ విప్లవం వల్ల సమాజంలో వచ్చిన కొత్త సామాజిక అధికారాలను, హోదాలను పారిశ్రామీకరణతో మధ్య తరగతి కుటుంబాలు పొందిన ఆటుపోట్లను తెలియజెప్పింది. వర్గ శత్రుత్వాలను వివరించింది. సమాజంపై దీని ప్రభావం ఎలా ఉందో, దానివల్ల వచ్చిన కొత్త విధానాలేమిటో తెలుస్తాయి. సహజ విలువలకు, సామాజిక విలువలకు మధ్య ఉన్న విభేదాలు తెలుసుకొనేలా చేసింది. ఒకరకంగా సమాజ ఐక్యతను బోధించిందని చెప్పవచ్చు. కాపిటలిజం పెరుగుతున్న తీరును చూపించింది. వర్గ పోరాటం తప్పదన్న మార్క్సిస్టు భావనా కనిపిస్తుంది. మనుష్యులు అప్పటిదాకా అనుభవిస్తున్న స్వాతంత్రం పోతోంది అనే భావన కల్పించింది నవలలో. కొందరు విశ్లేషకుల భావనలో డార్విన్ సిద్ధాంతానికి ఈ నవల ఒక వ్యాఖ్యానం. వారసత్వ అధికార కేంద్రీకరణను నిరసించింది. బీదవారు బ్రతకటానికి సమర్ధవంతులు అని చాటి చెప్పింది ఎమిలీ. మనిషి ఈ విశ్వానికి కేంద్రం కాదని చెప్పింది అన్నారు ఒకరు. సంపదను కేంద్రీకరించేవారిని ఎదిరించి నిలవాలనేది సిద్ధాంతంగా కనిపిస్తుంది. అనేక సాంఘిక సమస్యలకు ఈ నవలలో చర్చించి తన భావనా బలాన్ని రచనా శక్తిని అధ్యయన స్వభావాన్ని జోడించి ఎమిలీ బ్రాంట్ రాసిన ఈ నవల ఇప్పటికీ అందర్నీ చదివిన్చేట్లు చేస్తూనే ఉంది. ❀



## 29. జలగామి సిల్వియా ఎర్లీ

**అ**ంతరిక్ష శకటాలలో అంతరిక్షాన్ని పరిశోధించేవారిని వ్యోమగాములు – ఆస్ట్రోనాట్లు అంటారు. సముద్రాల వంటి జలాలపైనా, లోపలా పరిశోధించేవారిని జలగాములు లేక ఆక్వానాట్లు అంటారు. సముద్రాన్వేషణలో అనేక సాహసాలు చేసి, అరుదైన రికార్డులు సాధించి, ఎన్నో అవార్డులు, రివార్డులు అందుకొన్న ఆక్వానాట్, అమెరికా మహిళా మాణిక్యం సిల్వియా ఎర్లీ జీవితం ఎందరికో ఆదర్శం, ప్రేరణ.

### బాల్యం – విద్యాభ్యాసం

సిల్వియా ఆలిస్ ఎర్లీ అమెరికాలోని న్యూ జెర్సీ రాష్ట్రంలో గిబ్బన్‌టౌన్‌లో 30-08-1935న జన్మించింది. అమెరికన్ ఒషనోగ్రాఫర్, ఆక్వానాట్‌గా, రచయితగా ఆమె చిర కీర్తినార్జించింది. 1955లో ఫ్లోరిడా యూనివర్సిటీ నుండి డిగ్రీ పొందింది. మరుసటి ఏడాది ఎం.ఎస్ సాధించింది. 1966లో డ్యూక్ వర్సిటీలో పి.హెచ్.డి చేసింది. 1979-86 మధ్య కాలంలో కాలిఫోర్నియా అకాడెమి ఆఫ్ సైన్సెస్‌లో క్యూరేటర్ ఫర్ ఫైకాలజిగా పనిచేసింది. తరువాత కాలిఫోర్నియాలోని బెర్కిలీ వర్సిటీలో రిసెర్చ్ అసోసియేట్‌గా 1969-81లో ఉద్యోగం చేసింది. రాడిఫ్ ఇన్స్టిట్యూట్‌లో స్కాలర్‌గా కొంతకాలం ఉదంఇ. 1967-81 మధ్య కాలంలో హార్వర్డ్ యూనివర్సిటీలో రిసెర్చ్ ఫెలో ఆఫ్ అసోసియేట్‌గా వరుస క్రమంలో ఎదుగుతూ తన విద్యకు తగిన ప్రతిఫలాన్ని పొందుతూ రాణించింది.

### అన్వేషణ

సిల్వియా మొదటి నుంచి సముద్రంలో ఈదటం, అక్కడి జటచరాల విషయం తెలుసుకోవటం సరదా. 1970లో ఆమె అభిరుచికి తగిన పని కలిగింది. ఆమెలోని ప్రతిభా

పాటవాలకు గుర్తింపు లభించింది. చాలామంది మగవారితో ఆమెను సముద్రాన్వేషణకు ఒక షిప్‌లో పంపారు. అందులోని మగవారంతా షిప్‌లో ఆడది ఉంటే "బాడ్ లక్" అని ఈసడించారు. పేపరువాళ్ళు కూడా పెదవి విరిచి ఏదేదో రాశారు. ఆ యాత్రను దిగ్విజయం చేసింది సిల్వియా. అప్పుడు పత్రికలూ అదే నోటితో ఆమెను "Shipís social ambassador" అని కీర్తించాయి. మాటలతో కాక చేతలతో జనం నోరు మూయించిన సాహసి ఆమె. ఆమె ఆ యాత్రలో కనుగొన్న "రెడ్ ఆల్గాను" "హంబ్రేల్లా హైడ్రా" అనే పేరుతో పిలిచింది. అది గొడుగు ఆకారంలో ఉంటుంది. అందుకని కొంచెం మార్చి హంబ్రేల్లా అని పేరు పెట్టింది. దీనిలో ఆమె గురువైన "హమ్" అనే శాస్త్రవేత్త పేరు కూడా కలిసి ఉండటం విశేషం.

ఆకాలంలో "షార్క్ లేడీ" అని పేరు పొందిన డాక్టర్ క్లార్క్‌తో ఆమెకు మంచి పరిచయమేర్పడింది. 1970లో "నాసా" సంస్థ ఏర్పాటు చేసిన మొత్తం ఆడవాళ్ళే అన్వేషకులుగా ఉన్న మొట్టమొదటి టీముకు నాయకత్వం వహించే బాధ్యత సిల్వియాకు దక్కింది. అప్పుడు "ఓపెన్ ఓషన్ జిం సూట్"తో సముద్ర గర్భాన ఈది అరుదైన రికార్డు సాధించింది. లోతు సముద్రంలో "oahu" ప్రాంతంలో సముద్ర జీవులను అన్వేషించింది. తన పరిశోధనలను రికార్డు చేసింది. ఈ పరిశోధనలో అంతా "ఫ్రోజెన్ మీల్" మాత్రమే తిన్నారు. సముద్రంలో 381 మీటర్ల లోతున ఆమె అన్వేషణ సాగించి రికార్డు నెలకొల్పింది. ఇదే అప్పటి మహిళా రికార్డు. ఆ తర్వాత ఒంటరిగా సబ్‌మెరీన్‌లో 3,300 అడుగుల లోతులో విహరించి రికార్డు సాధించింది. సముద్రాలలో లోతుజలాలో ఆక్టోపస్‌లు చీకటిలో మాత్రమే బయలకు వస్తాయి. ఏదైనా దానికి ఆహారం అయ్యే జీవి దాని దగ్గరకు వచ్చినప్పుడు ఆక్టోపస్ రంగు బ్రౌన్ కలర్ నుండి "బ్లూగ్రీన్"కు మారటాన్ని గుర్తించింది.

## నిర్మాణాత్మక కార్యక్రమాలు

1980-84 మధ్య "National advisory committee on oceans and Atmosphere"లో పనిచేసింది. 1982లో భర్త గ్రాహం హాకెన్‌తో కలిసి డీప్ ఓషన్ ఇంజినీరింగ్ డిజైన్ చేసి నిర్వహించి, కావాల్సిన వారికి ఆసరాగా నిలిచి, సలహాలను ఇచ్చింది. దీన్ని భార్యాభర్తలు లాభాపేక్ష లేకుండా చేసిన గొప్ప కార్యక్రమం. ఆమె నిరంతర పరిశోధకురాలు. సముద్ర జలాలలో లోతుగా తిరిగేవారికి అవసరమైన ఆధునిక సూట్లను తయారు చేసింది. డీప్ ఓషన్ రోవేర్ రిసెర్చ్ సబ్‌మరీన్ నిర్మించింది. దీనితో సముద్రంలో 3,300 అడుగుల లోతున పరిశోధించవచ్చు. "ఫాంటం" అనే రిమోటింగ్ ఆపరేటెడ్ వెహికల్" తయారు చేసింది. దీన్ని 30 దేశాలు కొని ఉపయోగించుకొన్నాయి.

## ప్రతిభా పురస్కారాలు

1990లో అమెరికా అధ్యక్షుడు జార్జి బుష్ సిల్వియాను "National oceanic

and atmospheric administration" చీఫ్ కెమిస్ట్‌గా నియమించి అత్యంత విలువైన గౌరవాన్ని కల్పించాడు. ఒక మహిళ ఆ పదవిని నిర్వహించటం సిల్వియాతోనే ప్రారంభమైంది. అయితే అందులో ఆమె చేయాల్సినదేమీ కనిపించలేదు. ప్రభుత్వం రిసెర్చ్ చేయటానికి తగిన ఫండును ఇవ్వలేదు. సిల్వియాకు కోపం వచ్చి బుష్‌కు జాబు రాస్తూ "స్పేస్ షటిల్"లో టాయిలెట్లకు పెట్టే ఖర్చు కూడా "అండర్ వాటర్ రిసెర్చ్"కు ఇవ్వటంలేదని నిందించింది.

ఎన్నో టి.వి ప్రోగ్రాములు చేసింది. వాటిల్లో సైన్స్, టెక్నాలజీ, సాధారణ అంశాలపై గొప్ప ఉపన్యాసాలిచ్చి యువకులకు, చిన్నారులకు ప్రేరణగా నిలిచింది. అత్యంత ప్రసిద్ధి పొందిన "టైం మాగజైన్" 1998లో ప్రత్యేక సంచిక వేసి ఆమెను "First hero for the planet" అని ప్రశంసించింది. నెదర్లాండ్ ప్రభుత్వం "ఆర్డర్ ఆఫ్ ది గోల్డెన్ ఆర్క్"తో "knight" బిరుదునిచ్చి సత్కరించింది. google earthలో అయిదవ వెర్షన్‌లో సముద్రాలపై కొత్త ఫీచర్లను ప్రవేశ పెట్టింది. marine conservetive biology institute వంటి ఎన్నో బోర్డులు ఆమెకు గౌరవ స్థానాన్నిచ్చి గౌరవించాయి. United nations conferenceలో 3500 మంది, ప్రపంచ రాయబారులు, డెలిగేట్లు మొదలైన విశిష్ట వ్యక్తులున్న సభలో 14 నిముషాలు మాట్లాడి తన దేశానికి ప్రతినిధ్యం వహించి సాహస మహిళామణి అనిపించుకొన్నది. Under water laboratoryకి నాయకత్వం వహించిన ధీర వనిత సిల్వియా. ఆమె గౌరవార్ధం ఫ్లొరిడాలో ఆమె యాభై ఏళ్ళ లోతు సముద్ర జలాల అన్వేషణను సగౌరవంగా నిర్వహించి సత్కరించింది. 2009లో "tedd prize"ను అందుకొంది. వీరి ఆసరాతో "Marine protected areas around the globe" కోసం "మిషన్ బ్లూ" అనే యాత్ర చేబట్టి క్యూబా, బెల్జి, గాలపెగాస్ దీవులను చుట్టి వచ్చింది. ఆమె ఎక్కడ ఉంటే అక్కడ సముద్ర జీవులకు రక్షణ అనే భావం ఏర్పడింది. sustainable sea expeditionsకు అయిదేళ్ళు పనిచేసింది. అందులో అమెరికాలోని సముద్రాల రక్షణ విషయం కోసం ఎంతో కృషి చేసింది. గల్ఫ్ యుద్ధంలో సహాయం చేసింది. అనేక రిసెర్చ్ ట్రిప్పులను నిర్వహించింది. 1998లో "Explorer in residence at national geo phisics society"లో గౌరవ స్థానాన్ని పొందింది. 2011లో స్మిత్ కాలేజి, సిల్వియాను గౌరవ డాక్టరేట్‌తో సత్కరించింది. Harte research institute for the gulf of mexico studies at texas కు చైర్మన్ పదవి పొంది రాణించింది. Deep search foundationకు వ్యవస్థాపక అధ్యక్షురాలైంది. Advisory council for the ocean in google earthకు చైర్మన్‌గా ఉంది.

## రచనలు

సిల్వియా ఎర్లీ సుమారు 125 పుస్తకాలు రాసింది. సముద్ర విషయాలు, సైన్స్, సముద్రాలన్వేషణలుతో వాటిని తీర్చిదిద్దింది. The atlas of the ocean, wild ocean

americaís, parks under the sea, The atlas of the ocean మొదలైన ఆమె పుస్తకాలు ఎంతో విలువైనవి. భవిష్యత్ తరాలకు కరదీపికలనిపించేవి. అరవైదేశాలు పర్యటించి ఉపన్యాసాలిచ్చింది. చిన్న పిల్లలకోసం Coral reefs, hello fish, devil పుస్తకాలను ఆకర్షణీయంగా రాసింది. Sea change - a message of the ocean అని ఆమె 1995లో రాసిన పుస్తకం చాలా విలువైనదిగా భావిస్తారు.

1992లో Deep ocean exploration and research అనే సంస్థను ఏర్పరచి మెరైన్ ఇంజినీరింగ్‌లో మరింత ముందుకు సాగింది. ఇప్పుడు ఆ సంస్థను ఆమె కుమార్తె నిర్వహిస్తోంది. ఇలా నిరంతరం ఆమె కృషి చేస్తూనే ఉంది. ఎందరికో ఆదర్శంగా, ప్రేరణగా నిలిచింది. ఆమె జీవితం మొత్తం మీద 60కి పైగా అన్వేషణా కార్యక్రమాలను చేసింది. 6000 గంటలు సముద్ర జలాల లోపల గడిపి పరిశోధన చేసింది. మూడు కంపెనీలు పెట్టి సముద్ర జలాన్వేషణలో ఎంతో సేవ చేస్తోంది. "Diadema sylvia" అనే "సముద్ర అర్చిన్", "Pilina earlie" అనే రెడ్ ఆల్గేస్పెసిమెన్‌లకు సిల్వియా పేరు పెట్టి అరుదైన గౌరవాన్ని కల్పించారు. ఆమె భూమి, సముద్రాలలో ఉన్న జీవులన్నిటిని "Marine world" అని ముద్దుగా పిల్చింది. అందుకే 1998 సంవత్సరాన్ని అమెరికా అధ్యక్షుడు బిల్ క్లింటన్ "యియర్ ఆఫ్ ది ఓషన్స్" అని గుర్తింపు తెచ్చాడు. నిత్యాన్వేషి సిల్వియా పెర్లీని "Ocean Everest" ఎక్కిన వీర వనితగా భావిస్తారు. ❀

**(విహంగ మహిళా వెబ్ మాసపత్రికలో ప్రచురితం)**



# 30. లిడియా మేరియ చైల్డ్

మేరియా గొప్ప రచయిత్రి. ఆమె ఏది రాసినా చదువరుల హృదయాలకు చేరువయ్యేది. అందుకే పెద్ద పెద్ద పత్రికలన్నీ ఆమెను బ్రతిమాలి రాయించుకొనేవి. బానిసత్వ నిర్మూలన పోరాటంలో ఆమెది అలుపెరగని పాత్ర. ఆ విషయంపై ఆమె రాసింది అంతా సాధికారమేనని చరిత్ర కారులు తేల్చారు. అంత అధ్యయన శీలి ఆమె. డెబ్భై ఏళ్ళు ఆరోగ్యం జీవించింది. కాని ఆమె కూడబెట్టుకొన్న ఆస్తి ఏమీలేదు. సంపాదనపై ఆమెకు శ్రద్ధ తక్కువ. సేవా భావమే ఆమె ఆస్తి. ఆ వయసులో ప్రజలు ఇచ్చిన కానులు, తాను రాసిన పుస్తకాలపై వచ్చే రాయల్టీయే ఆమెకు ఆర్ధికంగా ఆసరా. అయినా కుంగిపోలేదు. అదే ఉత్సాహంతో ఆ పని చేసింది. తన దగ్గర చేరిన ధనాన్ని బానిసత్వం నుండి విముక్తి పొందినవారి సంక్షేమం కోసం ఖర్చు చేసిన పెద్ద మనసు చైల్డ్‌ది. తన సంపాదన ఈ రకంగా ఉపయోగపడుతున్నందుకు ఆమె ఎంతో సంతృప్తి చెందింది. చివరి రోజుల్లో బౌద్ధ ధర్మానికి చేరువ అయింది. బౌద్ధానికి చెందిన ఎన్నో పుస్తకాలను కొని, చదివి లోతులను పార జూసింది. ఆమె రాసిన "Progress of religious ideas" పుస్తకానికి ఇది బాగా ఉపయోగపడిందని చెప్పింది. ఇరవై ఏళ్ళకే ఆమె గొప్ప అధ్యనశీలిగా పేరు పొందింది. బైబుల్‌లోని ముఖ్య విషయాలనన్నిటిని చేర్చి Electic Bible అనే స్వంత పుస్తకాన్ని తయారు చేసుకోవాలనే ఆమె తీవ్ర సంకల్పం నెరవేరకుండానే మరణించింది. ëAspiration of the worldíí, ëíA chain of opalsíí అనేవి ఆమె రాసిన చివరి పుస్తకాలు. ఇందులో గ్రీక్, రోమన్, బుద్ధిజం, జ్యూయిజం, క్రిస్టియన్, చైనాయిజం, పెర్షియన్, హిందూ మతాలకు ఆధునిక రచయితలు ఎందరో రాసిన రచనలను పొందు పరచింది. ఇవన్నీ "క్రోనలాజికల్ ఆర్డర్"లో రాయటం ఆమె గొప్పతనం. ఆమె

"Anti Asian Racism" పుస్తకాన్ని రాయాలని అన్నీ సేకరించుకొన్నది కాని రాయలేకపోయింది. అన్ని కాలాలు, దేశాలు, పవిత్రమైన ఆశయాలతోనే ఉన్నాయి అన్నది ఆమె నిశ్చితాభిప్రాయం.

లిడియా మెరియా చైల్డ్ 1802 ఫిబ్రవరి పదకొండున అమెరికాలోని మాసాచూసెట్స్ రాష్ట్రంలో మేడ్‌ఫీల్డ్ అనే చోట జన్మించింది. చిన్నప్పుడే నేటివ్ అమెరికన్‌లతో స్నేహం చేసి, వారి జీవిత విధానాలను తెలుసుకొన్నది. అప్పుడే ప్రఖ్యాత తత్వవేత్త, మహా రచయితా అయిన ఎమర్సన్ హార్వర్డ్‌లో విద్యార్థిగా ఉండేవాడు. Hobonok, a tale of early times నవలను చిన్న తనం లోనే రాసి, అందరి దృష్టి ఆకర్షించింది. అందులో నేటివ్ ఇండియన్‌ల సంస్కృతితోబాటు అమెరికన్, ఇండియన్ వర్ణాంతర వివాహం కూడా రాసి, ఆమె కాలానికంటే ముందుగా నలిచి మార్గదర్శి అనిపించుకొంది. అప్పటికే అమెరికా సాహిత్యంలో ఈ భావ వ్యాప్తి జరగలేదు. ఆ బీజం వేసింది ఈమెయే. ఆమె రెండో పుస్తకం చిన్నపిల్లల కోసం రాసిన కథా సంపుటి "Evenings in New England" ఆమె రాసిన "ది రెబెల్స్" చారిత్రాత్మక నవల. ఇందులో అమెరికా విప్లవ యుద్ధంలోను, దేశం స్వతంత్రం సంపాదించిన మొదటి దశలోను, స్త్రీల పాత్రను వివరించింది.

ఆమె అమెరికాలో చిన్న పిల్లలకోసం మొదటి పత్రికను నడిపిన తొలి మహిళ. సాధారణ ఆదాయం ఉన్న కుటుంబ మహిళల కోసం ఇంటింటి విషయాలను రాసిన ప్రధమ మహిళ. బానిసత్వాన్ని సమూలంగా అధ్యయనం చేసి చరిత్రనంతా రాసిన మొదటి మహిళ. నగర ప్రజల కోసం పత్రికలో సిటీకాలం ప్రారంభించిన మొదటి రచయిత్రి. అమెరికాలో చారిత్రిక నవలలు రాసిన అతి కొద్దిమందిలో ఒకరుగా నిలిచిన మహిళోద్యమ నాయకురాలు ఆమెయే లిడియా మెరియా చైల్డ్. ఆమె సృజనాత్మక శక్తి ఉన్న రచయిత. భర్త ఆదాయం అంతంత మాత్రమే అయినా, తన రచనల ద్వారా సంపాదించుకొన్న డబ్బుతోనే కుటుంబాన్ని అంటే తనను, భర్తను పోషించుకొన్న ఆదర్శ స్త్రీ. భర్తతో కాపురం అంతంత మాత్రంగానే ఉన్నా, కడదాకా అతనితో సహచర్యం చేసి ఓర్పుకు ఉదాహరణగా నిలిచింది. అంతమాత్రం చేత ఆమె అసాధారణ స్త్రీ లేక సూపర్ హ్యూమన్ అనుకొంటే పొరపాటే. ఆమె సాధారణ మధ్య తరగతి గృహిణి. పిల్లలకోపం పరితపించింది. పిల్లలు కలగకపోయినా జనంలో తన పిల్లలను చూసుకొన్నది. స్వేచ్ఛ, నాయాలకోసం అహరహం శ్రమించింది. ఆమె జీవితం అనుక్షణ పోరాటమే. డిప్రెషన్‌కు లోనైనా, మళ్ళీ తనను తాను సరిదిద్దుకొని జీవనయానం సాగించింది.

లిడియా భర్త అనేక వ్యాపారాలు చేశాడు. అన్నిట్లోనూ నష్టపోయాడు. ఈమె తన సంపాదన అంతా అతని బాగుకోసం, అభివృద్ధి కోసం ఖర్చు చేసింది. అయినా ఫలితం

లేదు. అతనిది నిలకడలేని జీవితం. నష్టజాతకుడు. అతనూ పత్రికా సంపాదకుడిగా పనిచేశాడు. ఆర్థిక విషయాలలో భర్తను కొద్దిగా దూరంగానే ఉంచాల్సి వచ్చిన్దామెకు. అయినా భర్తపై ఆమెకు ప్రేమానురాగాలేమాత్రమూ తగ్గలేదు. అతని బాగు కోసమే ఆ పని చేసింది. ప్రతి గాయం, ప్రతి వెనుకడుగు, ప్రతి నిరాశను ఆమె కప్పిపుచ్చుకొని, రెట్టింపు ధైర్యంతో ముందుకు సాగింది. మళ్ళీ మళ్ళీ ప్రయత్నించింది. అనుకొన్న లక్ష్యాన్ని సాధించిన ధీర వనిత మేరియా.

ఇండియన్ అమెరికన్లు అయిన చేరోకీలను వారి స్థావరాల నుండి ప్రభుత్వం ఖాళీ చేయిస్తే, వారి పునరావాసానికి ఉద్యమం నడిపింది. స్త్రీల కోసం ఎన్నో రాసింది. వంటింటి చిట్కాలు చెప్పింది. సంపాదనా మార్గాలు సూచించింది. పరిమిత ఆదాయంతో ఎలా జీవించవచ్చో రచనల ద్వారా తెలియజేసింది. "కాలమే ధనం" అన్నది ఆమె నినాదం. 1829లో మహిళల కోసం "The frugal house wife" రచన చేసింది. బానిసలను వారి యజమానులే విద్యావంతుల్ని చేయాలని సూచించింది. బానిస నిర్మూలన ఉద్యమంలో చురుకుగా పాల్గొన్నది. ఎందరో ఆఫ్రికన్ అమెరికన్ నాయకులు ఆమె సలహాలను స్వీకరించేవారు. బానిసత్వ వ్యతిరేక సభలను నిర్వహించింది. వారి ఆర్థిక సాయం కోసం విరాళాలు వసూలు చేసి అందజేసింది. లిడియా చేసిన ముప్ఫై ఏళ్ళ సుదీర్ఘ పోరాటం తర్వాత బానిసలకు విముక్తి లభించింది.

మేరియా చివరి రోజులను బోస్టన్ బోర్డింగ్ హౌస్‌లో ఒంటరిగా ఒక గదిలో గడిపింది. డబ్బును చాలా జాగ్రత్తగా ఖర్చు చేస్తూ నీతికి, నిజాయితీకి, వ్యక్తిత్వానికి ప్రాధాన్యతనిస్తూ జీవితాన్ని ధన్యం చేసుకొంది. తన గదిలో కిటికీలో ఒక "ప్రిజం" అంటే "పట్టకం"ను పెట్టుకొని, దాని ద్వారా ఇంద్రధనస్సు రంగులను తన గది గోడలమీద పడేట్లు చేసుకొని ఆనందాన్ని అనుభవించేది. 1880 అక్టోబర్ ఇరవైన ఆమె గుండెపోటుతో మరణించింది. ఆమెను సమాధి చేసిన రోజున ఆకాశంలో అంతకు ముందెన్నడూ కనిపించని అతిపెద్ద అద్భుతమైన ఇంద్రధనస్సు కనిపించి, అందర్నీ ఆశ్చర్యంలో ముంచింది. ఈ ఇంద్రధనస్సు అందమైన భిన్నత్వంలో ఏకత్వానికి ప్రతీక అని అందరు భావించారు. ఈ ఇంద్రధనస్సు ఆమె సేవా తత్వానికి ఘనమైన నివాళి అన్నారు. లిడియా మేరియా చైల్డ్ నిజంగానే పేద ప్రజల ఆశల ఇంద్రధనస్సు. ❃



## 31. వంచన, వివక్షలకు గురైన వనితా శాస్త్రవేత్త – లైస్‌మీట్నర్

**ము**ప్ఫై ఏళ్ళు తాను జర్మనీలో విజ్ఞాన శాస్త్రంలో కృషి చేసి గత్యంతరం లేని పరిస్థితులలో స్వంత గడ్డను వదిలి వెళ్ళాల్సి వచ్చింది. మహిళా శాస్త్రవేత్త మెట్నర్‌కు వృత్తి కోసం వివాహాన్ని చేసుకోకుండా విజ్ఞాన శాస్త్రానికే అంకితమైంది. తోటి పురుష శాస్త్రవేత్త ఆటో హాన్‌తో కలిసి "ప్రోట్రాక్టిసం" అనే మూలకాన్ని కనిపెట్టింది. ఇంతలో జరమనీ హిట్లర్ అధికారానికి వచ్చాడు. యూదులందర్నీ ఏరి పారేస్తున్నారు నాజీ పార్టీవాళ్ళు. అందరు జర్మని వదిలి పారిపోతున్నారు. ఈమె వంతు వచ్చింది. ఏ క్షణంలో ఏం జరుగుతుందో తెలీని స్తితి. కొద్ది సామానును సూట్ కేసుల్లో సర్దుకొని మిత్రుల సాయంతో నెదర్లాండ్‌కు పారిపోయింది.

లేస్‌మెట్ నర్ ఆస్ట్రియాలోని వియాన్నాలో 1878లో నవంబర్ ఏడున జన్మించింది. అక్కడ అంతా కరువు. తినటానికి తిండి లేదు. వేసవిలో కలరా. పక్కలు వంతులవారీగా పంచుకొని పాడుకొనేవారు. జన సామర్ధ్యం ఎక్కువ. మంచినీళ్ళు కూడా దొరకని స్థితి. యూరప్ మొత్తం మీద ఆత్మహత్యలు అక్కడే ఎక్కువ. ఆఫ్రికా రాజు కైజేర్ ఫ్రాంక్ యూదులకు అవకాశాలు కల్పించాడు. తండ్రి ఫిలిప్ మొదటి జ్యూ లాయర్. అప్పటి లిబరల్ రాజకీయాలలో చురుకైన కార్యకర్త. నీటి సరఫరాను మెరుగుపరచాడు. డాన్యూబ్ నది వరదలను నియంత్రించాడు. తండ్రికి ఉన్న ఎనిమిది మంది సంతానంలో మూడవది ఈమె. చిన్నప్పటి నుంచి సైన్స్, లెక్కలు అభిమానం. పలుకుబడి ఉన్న కుటుంబం కనుక పెద్దలందరూ వచ్చి వెళ్ళేవారు. ఆ కాలంలో ఆస్ట్రియాలో ఆడపిల్లలకు చదువు తక్కువ. నాలుగేళ్ల వయసులోనే

చదువు ఆపేస్తారు. మధ్య తరగతి ఆడపిల్లల్ని ప్రైవేట్ బడుల్లో చదివిన్చేవారు. అవి వారిని టీచర్ పోస్ట్లకే పనికి వచ్చేది.

లైస్ ఫ్రెంచ్ టీచర్ ట్రెనింగ్ పొందింది. ఆడవాళ్ళు యూనివర్సిటిలో చదివితే మానసిక స్తితి కోల్పోతారని, సంతానవంతులు కాలేరని నమ్మే రోజులవి. ప్రైవేట్ ట్యూటరింగ్ పొంది యూనివర్సిటిలో చేరింది. ఎనిమిదేళ్ళ కోర్సును రెండేళ్ళలో పూర్తి చేసింది. గ్రీక్ లాటిన్ జర్మని సాహిత్యం లాజిక్‌లను బట్టీ పట్టింది. అప్పుడు ఆస్ట్రియా అమెరికా దేశాలలో మొత్తం 700 మంది ఫిజిసిస్టులు మాత్రమే కాలేజీలలో ఫిజిక్స్ బోధించేవారు. వియన్నా వర్సిటిలో చేరింది. అక్కడి ఫిజిక్స్ ప్రొఫెసర్. ఆయన ఆడవారిని చేర్చుకోమని ప్రోత్సహించేవాడు. “Your trust, your affection, your love in a word for the most you have the power to give yourself” అనేవాడు. ఆయన ఫిజిక్స్‌లో లిజెండ్ అనిపించుకొన్నాడు. పరమాణు సిద్ధాంతాన్ని అద్భుతంగా వివరించేవాడు.

అక్కడ మూడేళ్ళ కోర్సు పూర్తి చేసింది లైస్. అక్కడి రూల్స్ ప్రకారం డాక్టరేట్ రావాలంటే కొన్ని నెలలు రిసెర్చ్ చేయాలి. ఓరల్ పరీక్ష పాసై డాక్టరేట్ సాధించింది. ఆనాడు మహిళా శాస్త్రవేత్తలకు ఉద్యోగాలూ లేవు. రేడియో యాక్టివిటి కనిపెట్టిన మేడం క్యూరీ నోబెల్ బహుమతిని సాధించినా వివక్షతకు గురైంది. ఆడవాళ్ళ స్కూల్‌లో టీచర్‌గా చేరింది మేట్‌నర్. అప్పటికి రేడియేషన్ కొత్త సబ్జెక్ట్. రూథర్ ఫోర్డ్ పరమాణువు న్యూక్లియస్‌ను కనిపెట్టి యురేనియం నుండి ఆల్ఫా బీటా గామా కిరణాలు ఉద్గారం చెందుతాయని కనిపెట్టాడు. అప్పటికి ఆ విషయమేదీ యువశాస్త్రవేత్త లెవరికి తెలీదు. లీఫ్ ఎలెక్ట్రో స్కోప్‌తో ప్రయోగాలు చేసింది. పూర్తి ఫిజిసిస్ట్ కావాలని కోరిక పెరిగింది. 1907లో జర్మని చేరింది. ఇక్కడా స్త్రీ వివక్షత ఎక్కువే. ఆడవారు తల్లులు భార్య స్థానాలకే పరిమితమనే నమ్మిక. ఆడ ఉద్యోగస్తులు మరీ తక్కువ. క్లాసులకు వెళ్ళాలి అంటే పర్మిషన్ కావాలి. మాక్స్ ప్లాంక్ శాస్త్రజ్ఞుడికి ఈ అభిప్రాయమే ఉండేది. ఆతోహాన్ కెమిస్ట్రి శాఖలో “ Newe field on radio activity”లో ప్రయోగాలు చేస్తున్నాడు. వర్సిటిలో ఆడవాళ్లకు ప్రత్యేక బాత్‌రూములు లేవు. ఒక ఏడాది తర్వాత స్త్రీలకూ విశ్వవిద్యాలయంలో అవకాశమిచ్చారు. ఆటోహాన్‌తో కలిసి బీటా రేడియేషన్‌లో కృషి చేసింది. న్యూక్లియస్ శిథిలం చెందితే రేడియేషన్ ఏర్పడుతుంది. ఆటం లోపల న్యూక్లియస్ ప్రోటాన్లు ఉంటాయని, వెలుపల ఎలెక్ట్రాన్లు తిరుగుతుంటాయని తెలిసింది. హాఫ్ లైఫ్ పీరియడ్‌ను కనిపెట్టే విషయం తెలిపారు వీరిద్దరూ. రూథర్ ఫోర్డ్ భార్యతో వచ్చి ఇక్కడ జరిగే పరిశోధన చూశారు. ఆయన “Oh! I thought you are a man” అని మెచ్చాడు. ఎంత పనిచేసినా జీతాలు లేవు. ఆర్టికల్స్ రాసి కొంత సంపాదిస్తోంది.

1905లో Kaiser wilham institute for physical chemistry and electro

chemistry నిర్మించారు. అందులో కొంతభాగం రేడియో యాక్టివిటీకి కేటాయించారు. ఇలా చేయటం జర్మనిలో ఇదే మొదలు. ఆటోకు గొప్ప పదవీ జీతం లభించాయి. ఈమెను పట్టించుకోలేదు. అతనితో ఆన్ పైడ్ గెస్ట్‌గా పనిచేసింది పాపం. మాక్స్ ప్లాంక్ ఈమెకు తన అసిస్టెంట్‌గా ఉద్యోగం ఇచ్చాడు. దీనితో ప్రొఫెసర్ అయ్యే దారి ఏర్పడింది. జీతం కూడా ఇస్తున్నారు. 1919లో ప్రొఫెసర్ అయ్యింది. ఆమె జర్మనిలో మొదటి మహిళా ప్రొఫెసర్. అయితే బోధన చేసే వీలు కల్పించలేదు. ల్యాండ్ వర్సిటిలో చేరింది. ఆమె సాధించిన దానికి గుర్తింపు రాలేదు. ఆటోకు ఎమిల్‌ఫిషర్ మెడల్ అనే అత్యున్నత పురస్కారాన్నిచ్చి ఈమెకు దాని కాపీ మాత్రం పంపారు. అంటే స్త్రీ విచక్షతకు గురైంది. అతనూ ఏమీ చేయలేదు.

నాజీపార్టి అధికారానికి వచ్చి ఈమెకు బోధించే అవకాశాన్ని తీసేశారు. జర్మని పరిస్తితి దుర్భరమైనది. అంతటా నిఘా. 1938లో డెన్మార్క్ చేరి కోపెన్ హేం వెళ్ళాలని నిర్ణయించుకొంది. అక్కడ ఏమీ అచ్చి రాలేదు. ఆటో, ఫ్రిడ్జ్ అనే అతనితో కలిసి రేడియో యాక్టివ్ శిథిలంలో ఏర్పడిన పదార్ధం ఐసోటాప్ అని నిర్ణయించారు. ఇది తప్పు అని మేట్నర్జ్ చెప్పింది. చివరికి వచ్చేది బేరియం అని తేల్చింది. వారిద్దరూ ఒప్పుకొన్నారు. "Lise is intellectual leader of our team" అని మెచ్చాడు ఆటో. ఆ తర్వాత వారిద్దరూ పరమాణువును విచ్చేదం చేశామని ప్రకటించారు. ఆమెకేమీ ప్రాధాన్యత నివ్వలేదు. పక్షపాతం చూపాడు ఆటో. వారి ఆవిష్కరణలో తన పేరు లేకపోయినా వారిని అభినందిన్చింది. ఆటో కీర్తి పెరిగింది. సన్మానాలు బిరుదులూ వచ్చాయి. ఎక్కడా ఈమె పేరు ప్రస్తావించలేదు. ఆటో కూడా నాజీలకు లొంగిపోయి పనిచేశాడు. అతనిది "వన్ మాన్ షో" అయ్యింది.

ఆటోకు నోబెల్ ఇచ్చారు. ఈమెకూ అందులో భాగస్వామ్యం ఉంటుందని అందరు అనుకొన్నారు కాని అలా జరగలేదు. ఆటో దగ్గర కంటే ఇంకే శాస్త్రవేత్త దగ్గర పనిచేసినా ఆమెకు నోబెల్ వచ్చేదని మిగిలిన శాస్త్రవేత్తలు భావించారు. 1946లో అమెరికాకు విజిటింగ్ ప్రొఫెసర్‌గా వెళ్ళింది. అక్కడ విమానం దిగగానే "పయనీర్ ఆఫ్ ది ఆటోమిక్ బాంబ్" అని ఆమెను కీర్తించారు. ఆమెను "వుమన్ ఆఫ్ ది యియర్"గా గుర్తించి సన్మానించారు. ఆమెకు ఆదరణ పెరిగింది. 1947లో స్వీడన్‌లోని ఇన్స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీకి డైరెక్టర్ అయింది. జర్మనికి రమ్మని ఆటో మొదలైనవారు ఆహ్వానించినా తిరిగి వెళ్ళలేదు. ఆత్మగౌరవం దెబ్బతిన్నదని భావించింది. ఆ తర్వాత జర్మన్ కెమికల్ సొసైటీ మాక్స్ ప్లాంక్ మెడల్ ప్రదానం చేసింది. స్వీడన్‌లో మొదటి న్యూక్లియర్ రియాక్టర్ ఏర్పాటు చేయించింది. ఎన్నో రచనలు చేసి ప్రాముఖ్యం పొందింది. ఆటో హాన్ ప్రైజ్‌ను 1955లో పొందింది.

75 ఏళ్ళ వయసులో ఇంగ్లాండ్‌లోని తన మేనల్లుడి ఇంటికి చేరి అక్కడే ఉంది. ఆటోబయోగ్రఫీని రాయమని సూచించిన వారికి "Either in science or tactics or

both"లో తనకేమీ తెలీదని మర్యాదగా తిరస్కరించింది. న్యూక్లియర్ ఫిషన్‌లో ఎంతో భాగస్వామ్యం ఈమెకు ఉన్నా ఆటోకు నీడలాగే ఉండిపోవాల్సి వచ్చింది. శ్రమ ఈమెది పేరు, ప్రఖ్యాతులు అతనివి అయ్యియి. ముప్ఫై ఏళ్ళ తర్వాత జనానికి తెలిసింది. మ్యూనిచ్‌లో ఒక మ్యూజియంలో ఆమె పేరును అతి చిన్న అక్షరాలలో రాయించాడు ఆటో. అతడి కుత్సితం అప్పుడు బయటపడింది. డెబ్బై ఎనిమిదేళ్ళ వయసులో కూడా యువ శాస్త్రవేత్తల ఆవిష్కారాన్ని తెలుసుకొనేది. ప్రోత్సహించేది. ఎన్రికో ఫెర్మి అవార్డునిచ్చారు. అప్పుడు కూడా ఆటో డిస్కవరి కెమిస్ట్రి తనదేనని వాదించాడు. లైస్‌కు ఇవ్వక్కర్లేదని వాదించాడు. ఇతని మాట వినకుండా ఆమెకే అందజేశారు. పీరియాడిక్ టేబుల్‌లో 109వ మూలకానికి "Meitrium" అని పేరు బెట్టి గౌరవించారు. తొంభైవ పుట్టినరోజున 1968 july 28న ఈ మహిళా శాస్త్రవేత్త మరణించింది. ఆమె సమాధిపై "Lise Meitner - a physicist who never lost her humanity" అని రాసి ఆమెలోని మానవత్వాన్ని చాటారు. ❀

**(విహంగ మహిళా వెబ్ మాసపత్రికలో ప్రచురితం)**



## 32. ఐరిష్ అస్తిత్వ రచయిత్రి మేరియా ఎడ్జివర్త్

గొప్ప వంశంలో జన్మించి తండ్రి సంస్థానానికి వారసురాలైన ఐరిష్ దేశ ఉత్కృష్టతను, అందులోని లోపాలను తెలియజేసి బాల సాహిత్యాన్ని సృష్టించి, స్త్రీల అభ్యున్నతి కోసం రచనలు చేసి నవలా సాహిత్యానికి ఊపిరిలూదిన కొద్దిమంది తొలితరం ఐరిష్ రచయితలలో ఒకరుగా నిల్చి ఇంగ్లాండ్‌కు, ఐరిష్ దేశంలోనూ తీసిపోదని నిరూపించి, ఆ దేశ సాహిత్య సంస్కృతులను పరిపుష్టం చేసి, రైతు, బీద జన పక్షపాతిపైన పద్దెనిమిదో శతాబ్దపు ఐరిష్ రచయిత్రి మేరియా ఎడ్జివర్త్.

మేరియా 1768 జనవరి ఒకటిన ఐర్లాండ్‌లో ఆక్స్‌ఫర్డ్‌లోని బ్లాక్‌బోర్టాన్‌లో జన్మించింది. తండ్రి రిచార్డ్ లోవేల్ ఎడ్జివర్త్. తల్లి మేరియా. చిన్నతనంలో అయిదవ ఏటనే తల్లిని కోల్పోయిన అభాగ్యురాలు. బాల్యాన్ని అమ్మమ్మగారింట్లో ఇంగ్లాండ్లో గడిపింది. తండ్రి రెండో పెళ్ళి చేసుకొన్నాడు. అప్పుడు మళ్ళీ తండ్రి ఎస్టేట్ ఎడ్జివర్త్‌కు తిరిగి వచ్చింది. 1775లో ఐర్లాండ్‌లోని దర్బిన్ స్కూల్‌లో చేరి చదివింది. మారుటి తల్లి కూడా మరణిస్తే, ఆమె చెల్లినే తండ్రి మళ్ళీ పెళ్ళి చేసుకొన్నాడు. తర్వాత లండన్‌లో చదువుకొంది. తండ్రి ఈమెపై శ్రద్ధ బానే తీసుకొన్నాడు. ఈమె కన్ను ఇన్ఫెక్షన్‌కు గురై చూపు మందగించింది. తండ్రి వెంట ఉండి అన్నీ తానై వ్యవహరించాడు. ఉపాధ్యాయులను నియమించి ఇంట్లోనే అన్నీ చెప్పించాడు. ఆర్థిక, రాజకీయ, విజ్ఞాన శాస్త్రాలను, సాహిత్యాన్ని క్షుణ్ణంగా నేర్చింది. తండ్రి అన్నిటిని స్వయంగా ఆమెకు బోధించి మెరుగులు దిద్దాడు. తండ్రిగారి లూనార్ సొసైటీ పెద్ద మనుషులు ఇంటికి వచ్చేవారు. వారితో పరిచయాలు పెంచుకొని తనను తాను మలచుకొంది.

తండ్రికి ఉన్న ఎస్టేట్ వ్యవహారాల్లో సాయపడేది ఎడ్జ్‌వర్త్. అక్కడే రాస్తూ ఉండేది. నౌకర్లు, చాకర్లు బోలెడు సిబ్బంది. అందరి ఆలనా పాలనా స్వయంగా పర్యవేక్షించేది. ఎస్టేట్ ప్రజల నిత్య జీవిత వ్యవహారాలను పరిశీలించి గ్రంథస్థం చేసింది. ఇవి తరువాత ఆమె రచించిన నవలకు ఎంతగానో తోడ్పడ్డాయి. ఆంగ్లో ఐరిష్‌వారితో సాన్నిహిత్యం పెంచుకొన్నది.

అందులో ముఖ్యంగా మొదటి డ్యూక్ ఆఫ్ వెల్లింగ్టన్‌తో గొప్ప పరిచయమేర్పడటం ఆమెకు వరమైంది. బాల్యం అంతా ఇంగ్లాండ్‌లో గడపటం వల్ల భాష, సంస్కృతి, ఆలోచన విషయాలలో ఆమెపై ప్రభావం చూపాయి. వివాదాస్పద విషయాలపై ఆమె తన భావాలను విస్పష్టంగా ప్రకటించి కొంత అసౌకర్యానికి గురైంది. తన అభిప్రాయాలను "Castle rackrent" హార్రిస్టన్ నవలలో రాసింది.

ఐరిష్ ఫ్యూడల్ వ్యవస్థలోని లోపాలను ఎండగట్టింది. ఐరిష్‌వారు ఇంగ్లాండ్‌వారికి దేనిలోనూ తీసిపోరనే విషయాలను ఆమె తన రచనలలో విస్పష్టంగా తెలియబరచి, ఐరిష్ అస్తిత్వ వాదానికి మూలస్తంభంగా నిలబడింది. వారిని జాగృతం చేసి వారి అభిమానాన్ని సంపాదించింది. రెండు దేశాల భాషలో ఉన్న భేదాలను సోపత్తికంగా చూపింది. ఆంగ్లో ఐరిష్ కాస్మాపాలిటిక్స్‌ను వివరిస్తూ మొదటి ఫిక్షన్ కథలు రాసింది. ఐరిష్ జాతీయ అస్తిత్వాన్ని, జాతీయ శీల స్వభావాన్ని వాటిలో ప్రతిబింబింపజేసింది. ఆమెకు కొన్ని స్పష్టమైన భావాలున్నాయి. మగవారితో సమానంగా ఆడవారు ఉండాలని, ముఖ్యంగా భర్తల విషయంలో వారు ఏమాత్రం న్యూనభావంతో ఉండరాదనీ చెప్పింది. ఆమె భావాలపై రుసో ప్రభావం బాగా ఉండేది. అంతేకాదు స్త్రీల విషయంలో అవగాహన ఉన్నవారినే భర్తలనుగా స్వీకరించాలని మహిళలకు హితవు చెప్పింది.

ఆమె రాసిన "లివియన్, ఫాషనబుల్ లైఫ్ అండ్ పాట్రోనేజ్"లలో 18వ శతాబ్దపు ఐరిష్ విగ్ ప్రభుత్వాల అవినీతి, ప్రాతినిధ్యాలను ఎత్తి చూపింది. "హెలెన్"లో స్త్రీలు బాగా సంస్కృతీకరణం చెందాలని, మహిళలు రాజకీయాల్లోకి రావాలని, స్త్రీలు ఆలోచనా, వివేకం కలవారని చెప్పింది. కేథలిక్కులపై సానుభూతిని ప్రకటించింది. ఆమె రాసిన తొలి కథల్లో మెలోడ్రామా బాగా ఉండేది. వాస్తవికత ఉండేది కాదు. బాల సాహిత్యాన్ని విస్తృతంగా రాసింది. వారికోసం ఎన్నో నీతి కథలు రాసింది. ఒక కథలో మనిషి శవం చర్మంతో మాస్క్ వేసుకొని ఒక విద్యార్థి మాట్లాడినట్లు చూపింది. ఆమె Letters for literary ladies మొదటగా ప్రచురించిన పుస్తకం. An essay on the noble science of self justificationలో స్త్రీ శక్తిని గుర్తింపజేసి, మగవారి అందునా భర్తల దాష్టీకాన్ని సహించవద్దని హెచ్చరించింది. "Parents assistance" పుస్తకం రాసింది. బాలల విద్యకు ప్రోత్సాహమిచ్చింది.

మేరియా తండ్రి మంచి ముందుచూపున్నవాడు. గొప్ప ఇన్వెంటర్ అని పేరొందినవాడు. కూతురి అభివృద్ధికి అన్ని రకాలా తోడ్పడ్డాడు. ప్రఖ్యాత వేదాంతులు లాకె, రూసోల ప్రభావంతో "Praactical education"ను విద్య కోసం రాసింది. అందరితో కలిసి మెలసి ఉండేతత్త్వం విద్యార్థుల్లో ఉండాలని కోరింది. 1800లో మొదటి నవల Castle

racknet తండ్రికి తెలియకుండానే రాసి గొప్ప విజయం సాధించింది. ఇది ఆంగ్లో ఐరిష్ భూస్వాములపై సంధించిన వ్యంగ్యాస్త్రం. Irish land lording families లో నాలుగు తరాలవారి చరిత్రను పొందుపరిచింది. 1801లో మూడు భాగాల "Belinda" నవలను లండన్‌లో ప్రచురించింది. ఇందులో ప్రేమా, ఆరాధన, వివాహం, సంఘర్షణలను పొందుపరిచి పూర్తి విస్తృత స్థాయి నవలగా రాసింది. ఇందులో అంతర్జాతీయ వివాహాన్ని ప్రోత్సహించి, ఆఫ్రికన్ బానిసకు ఇంగ్లిష్ భూస్వామ్య అమ్మాయితో వివాహాన్ని చేయించి సంచలనం సృష్టించింది. ఇది ఆ కాలానికి చాలా ముందడుగే. 1809లో Tales of fashionable lifeను చిన్న కథలను, స్త్రీల గురించి, వారికోసమే రాసింది. సమకాలీన నవలా రచయితలలో అగ్రశ్రేణి రచయితగా గుర్తింపు పొందింది. ఒక నవలలో యూదులను కించపరిచే విధంగా రాసిందని అమెరికన్ మహిళా రచయిత్రి విమర్శస్తే, వారికి క్షమాపణ చెబుతూ 1817లో Hamington రాసింది. ఆమెలో క్రమంగా పరివర్తన వచ్చింది. నైతిక నిర్ణయాధికారాన్ని, సాంఘిక అస్తిత్వాన్ని సాధించి ఆమె అందరికి ఆదర్శప్రాయమైంది. ఆమె రచనల్లో వ్యంగ్యానికి పెద్ద పీటవేసింది.

ఫ్రాన్సిస్ బీ ఫోర్ట్‌ను వివాహమాడింది. దంపతులు ఇంగ్లాడ్ అంతటా పర్యటించారు. అక్కడ కవి లార్డ్ బైరన్‌తో సమావేశమైంది. కాని బైరన్ అభిప్రాయాలతో ఏకీభవించలేదు. హంఫ్రీ దేవి, ప్రముఖ నవలాకారుడు సర్ వాల్టర్ స్కాట్‌లతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపింది. తండ్రి మరణం తర్వాత ఎస్టేట్‌కు వారసురాలైంది. 1845-49లలో "ఐరిష్ పొటాటో ఫామిన్" వచ్చింది. అప్పుడు రైతులకు అండగా నిలిచి వాళ్ల బాధా నివారణ కోసం Oriandino రాసింది. క్వేకర్ ఉద్యమ నాయకుల సాయంకోసం రిలీఫ్ ఫండ్ వసూలు చేసి అందించింది. అమెరికా నుండి వారికి కానుకల రూపంలో సహాయం రాబట్టింది. తన సంస్థానంలోని రైతుల రుణాల మాఫీ చేసింది.

రాయల్ ఐరిష్ అకాడెమీకి విలియం రావన్ హామిల్టన్ ఎన్నికయిన తర్వాత ఆయనకు ముఖ్య సలహాదారు అయింది. ఐర్లాండ్ సాహిత్య విషయంలో ఆమె ఎన్నో సూచనలు చేసి అమలు పరచేట్లు చేసింది. అకాడెమిలో స్త్రీలు భాగస్వాములు కావాలని తీర్మానించి, వారిని చేర్పించి చురుగ్గా పనిచేసేట్లు చేయగలిగింది. హామిల్టన్ మేరియాకు గౌరవ సభ్యత్వం ఇచ్చి అపూర్వ గౌరవం కలిగించాడు. ఎనభై ఒక్క ఏళ్ళు నిండుగా, గౌరవంగా జీవించి, స్త్రీల అభివృద్ధికి, బాలల విద్యాభివృద్ధికి, ఐరిష్ భాషా సంస్కృతి, అస్తిత్వాలకు కృషి చేసి, ముప్ఫైకి పైగా పుస్తకాలను రచించిన మేరియా ఎడ్జివర్త్ 22-05-1849లో ఎడ్జివర్త్ టౌన్‌లో గుండెపోటుతో మరణించింది. ❀

**(విహంగ మహిళా వెబ్ మాసపత్రికలో ప్రచురితం)**

# 33. మహిళా విద్యావేత్తకు ఎన్నెన్ని అడ్డంకులో? హెలీనా కోర్నాటోపి సోపియ

**మ**నదేశంలో పూర్వకాలంలో మహిళ విద్యకు ప్రాముఖ్యముండేది కాదని మనకు తెలిసిన విషయమే. మరి ఆ మహిళ ఒక విద్యావేత్తయే అయితే. ఆమెకు ఎదురయ్యే ఆటంకాలు ఇన్నీ అన్నీ కావు. పోనీ ఇతర దేశాలలో ఆకాలంలో ఇంతకంటే భిన్నంగా ఏమైనా ఉందా అంటే లేదనే చెప్పాలి. మరీ ఆధునికం, నాగరికతా నిలయం అని అనుకొన్న యూరప్‌లోనూ ఇదే పరిస్థితి. ఒకసారి ఆ కథలూ, గాథలనూ తెలుసుకొందాం. సుమారు 350 ఏళ్ళ కిందట ఇటలీలోని "పాడువా కెథడ్రిల్ యూనివర్సిటీ" నుంచి అరిస్టాటిల్ మాండలికాల మీద ప్రపంచంలోనే మొట్టమొదటి డాక్టరేట్‌ను పొందే నిమిత్తం పరీక్షకు హాజరయిన మహిళ "హెలీనా కోర్నాటోపి సోపియ" ఉదంతాన్ని వింటే ఆశ్చర్యమేస్తుంది.

ఆమె వెనీస్ నగరంలోనే మహా ధనికుడైన ముప్పై రెండేళ్ళ వ్యక్తికి జన్మించిన ఏకైక కుమార్తె. చురుకైన తెలితేటలు గల విద్యార్థినిగా పేరుపొందింది. ఏడో సంవత్సరం నుంచే తత్వవేత్త అరిస్టాటిల్‌ను అధ్యయనం చేయటం ప్రారంభించింది. ఆమె విద్యా విషయంలో చూపే చొరవకు తండ్రి చాలా సంతోషించి అన్ని విధాలా తోడ్పడ్డాడు. విశ్వవిద్యాలయంలో చేరకముందే ఆమెకు అతి సమర్థులైన ట్యూటర్లను నియమించి ఇంటి వద్దనే విద్య నేర్పించాడు. అప్పటికే ఆమెకు గ్రీకు, ఫ్రెంచ్, ఇంగ్లీష్, స్పానిష్ హిబ్రు, అరబిక్, చాల్డిక్ భాషలు పూర్తిగా అలవడ్డాయి. ఈ అసాధారణ ఏకైక మహిళా విద్యావేత్తను గురించి విన్న వారందరూ ఆశ్చర్యపోయారు. ఆమె ఎలా పరీక్షలలో జవాబులు చెబుతుందో ప్రత్యక్షంగా చూడాలనుకొని, కొన్ని వందలమంది జనం చేరుకొన్నారు. కనుక పరీక్ష వేదికను విశ్వవిద్యాలయ ప్రాంగణం నుంచి కెథడ్రిల్‌కు మార్చాల్సి వచ్చింది.

ఎలీనా ముందుగా థియాలజీలో డాక్టరేట్ కోసం ధరఖాస్తు పెట్టుకొంది. థియాలజీ విభాగం చాన్సెలర్, ఆర్చిబిషన్ అయిన కార్డినల్ గ్రేగారియో బిషప్ నిరాకరించాడు. "ఆడవాళ్ళు పిల్లల్ని కనటానికి మాత్రమే అర్హులు. చదువు సంధ్యలకు కాదు" అని అభిప్రాయపడ్డాడు. ఈ విషయాన్నే ఆయన ఫ్రెంచ్ కార్డినల్‌కు చెబితే ఆయన పగలబడి నవ్వాడట. ఆమె పట్టుదలను చూసి బిషప్ "కావాలంటే ఫిలాసఫీ"లో డాక్టరేట్‌కు పరీక్షనివ్వచ్చునని తేల్చి చెప్పాడు. దేనికైనా రెడీ అంది ఆమె. దానికే తయారైంది. పరీక్షాధికారులు ఆమె స్త్రీ అని ఏ మాత్రం జాలి తలచకుండా కఠినంగానే ప్రశ్నించాలని నిర్ణయించారు. లేకపోతే యూనివర్సిటి పరువు గంగలో కలుస్తుందని భావించారు.

ఎలీనా అత్యంత సమర్ధంగా, బుద్ధి కుశలతతో అడిగిన వాటికన్నిటికీ లాటిన్ భాషలోనే సమాధానాలు చెప్పి, వారిని అప్రతిభులను చేసింది. ఒక అరగంట పరీక్షలోనే ఆమె ప్రతిభకు అబ్బురపడి, ఆమెకు ఫిలాసఫీలో డాక్టరేట్‌ను ప్రదానం చేశారు. "డాక్టరల్ రింగ్"ను ఆమె వ్రేలికి తొడిగి అరుదైన గౌరవాన్ని కల్పించారు. అక్కడికి చేరిన అశేష జన సమూహం ఒక్కసారి గౌరవంగా లేచి నిలబడి హర్షధ్వానాలు చేశారు. భగవంతుడిని స్తుతించే "టే డ్యూమ్" ఆలపించారు. ఆనందభాష్పాలు రాల్చారు. ఇదీ మొదటి మహిళా విద్యావేత్తకు జరిగిన పరీక్ష, ఆమె సాధించిన అపూర్వ విజయగాధ.

శతాబ్ధాలు మారినా పరిస్థితిలో మార్పేమీ పెద్దగా రాలేదు. ఇక్కడే విద్యావేత్తలు, సామాజిక శాస్త్రవేత్తలు స్త్రీ విద్య నేర్పటానికి నాలుగు ముఖ్య విషయాలు కావాలని సూచించారు. మొదటిది ఆమె జీవించటానికి తగిన ఆధారం ఉండాలి. పదిహేడవ శతాబ్దానికి మహిళా జీవితకాలం 1750లో ముప్పై రెండు మాత్రమే. పందొమ్మిదో శతాబ్దంలో ఇది నలభై రెండుకు చేరుకొన్నది. స్త్రీకి వివాహం చేసుకోవటం, సంతానం కనటంతో సరిపోయి, ఏదో వానాకాలం చదువే అబ్బేది. విద్యావేత్తగా ఎదిగే అవకాశం తక్కువే. పైన చెప్పుకొన్న ఎలీనా పదకొండవ ఏటనే వివాహం ఆడరాదనే స్థిర ప్రతిజ్ఞ తీసుకొని నిలుపుకొంది. ఆమె జీవిత ధ్యేయం "బెనేడిక్టైన్ ఆర్డర్"లో ప్రవేశించటమే.

రెండవది – స్త్రీ విద్యావంతురాలు కావాలంటే ఆమెకు మౌలిక విద్య తెలియాలి అంటే చదవటం రాయటం తెలిసి ఉండాలి. 1650లో లండన్ నగరంలో ఉన్న మహిళల్లో పది శాతం మందికి మాత్రమే సంతకం చేయటం వచ్చు అని తెలిస్తే ఆశ్చర్యమేస్తుంది. మగవారు చర్చి ఉద్యోగాల్లో, మిగిలిన ఉద్యోగాలలో పనిచేస్తూ వంద శాతం అక్షరాస్యులుగా ఉండటం మరీ వింత. క్రింది తరగతి పురుష ఉద్యోగాల్లో మాత్రం పదిహేను శాతం మంది మాత్రమే అక్షరాస్యులు. 1700 కలంనాటికి మహిళల్లో సగం మంది సంతకాలు చెయ్యటం నేర్చారు. మిగిలిన ప్రాంతాలలో మహిళా అక్షరాస్యత మరీ తక్కువగానే ఉంది.

మూడవ విషయానికి వస్తే – స్త్రీ విద్యావేత్త కావాలంటే ఆమె ఆర్థిక పరిస్థితి బాగా ఉండాలనేది, ధనవంతుల కుటుంబాల్లో పుట్టిన వారికే ఈ అదృష్టం దక్కేది. వారికి ఇంట్లో స్వంత లైబ్రరి ఉండేది. ప్రైవేట్‌గా చదువుకోవటానికి ట్యూటర్లను పెట్టుకొనే సామర్థ్యం ఉండేది. కాని బీదా బిక్కీ స్త్రీలకూ కనీస విద్య అంటే చదవటం రాయటం కూడా గగన కుసుమమే. చర్చిలు, క్రైస్ట్ హాస్పిటల్స్ లండన్‌లో నిర్వహించే విద్యాలయాల్లో బాలురు మాత్రమే చేరేవారు. ధార్మిక విద్యాలయాలలో చదివే ఆడపిల్లలు కుట్టుపని, లేసుల అల్లికా మొదలైన ఇంటి పనుల్లో ఉపయోగపడే విద్య నేర్చేవారు.

విద్యావంతురాలైన స్త్రీకి కావలసిన నాలుగవ ముఖ్య విషయం – ఆమె చర్మం మందంగా ఉండాలట. ఆమె బహిరంగంగా వేదిక లెక్కాలంటే ధైర్యసాహసాలు ఉండాలి. 18వ శతాబ్దపు ఇంగ్లాండ్‌లో ప్రసిద్ధి చెందిన మహిళా రచయిత్రి “లేడీ మాంటేగ్” రాస్తూ తన మనవరాలు ఒంటరిగా యే కుంటీ, గుడ్డీగానో గడపాల్సి వస్తోందని అన్నది. ఇదీ ఆనాటి విద్యావంతులయిన స్త్రీల దీన పరిస్థితి. కొద్దిమంది మగ మేధావులు పదహారో శతాబ్దపు “రిచర్డ్ మాలిస్టర్”, పదిహేడో శతాబ్దానికి చెందిన “పౌలియన్ డీ లా బారీ”లు మహిళా విద్యనూ, విద్యావేత్తలను ప్రోత్సహించారు. అలాగే “బాస్సువా మెకిన్”, “మేరీ వోల్లెన్ స్టోన్ క్రాఫ్ట్” వంటి మహిళాభ్యుదయ మహిళా రచయితలు మహిళల మేధావితనాన్ని గుర్తించి పూర్తి మద్దతునిచ్చారు. చర్చితో సహా అనేక వృత్తుల్లో మహిళలకు ప్రవేశం కల్పించాలని ఉద్యమించారు. గ్రామర్ స్కూళ్ళలో కూడా బాలికలకు ప్రవేశం కల్పించాలని ఒత్తిడి తెచ్చారు. మగవారికి, దేనిలోనూ మహిళలు తక్కువ కాదని నిరూపించారు. విద్యావేత్తలు అవటానికి మహిళలకు అన్ని రకాలా సామర్థ్యం, తెలివితేటలు ఉన్నాయని ప్రపంచానికి ముక్త కంఠంతో చాటిచెప్పారు. మహిళా విద్యకు, ఆమె విద్యా నేతృత్వానికి అడ్డు నిలిస్తే ఖబడ్దార్ అని ప్రకటించారు. మహిళ ఇప్పుడు వీటన్నిటినీ అధిగమించి అన్నిటా ముందుకు దూసుకొని వెళ్లటం శుభదాయకం.

**(విహంగ మహిళా వెబ్ మాసపత్రికలో ప్రచురితం)**



## 34. ఆదివాసుల వాణి – జూడిత్ రైట్

**“ఆ**మె కవిగా గొప్ప సేవ చేసింది. నీతికి నిబద్ధురాలైన నాయకురాలు. విలువలను చెప్పింది, విలువైన జీవితాన్ని గడిపింది. భూ బకాసురుల నుండి భూమిని నమ్ముకున్నవారిని కాపాడింది. ప్రజల కష్టాలను, నష్టాలను, కన్నీటి గాధలను కళ్ళకు కట్టించింది” అన్నాడు ఆస్ట్రేలియా కవి రాబర్ గ్రీ జూడిత్ రైట్ గురించి. కెవిన్ హార్ట్ అనే గొప్ప విమర్శకుడు “ఆమెకు తెలుసో లేదో కాని, ఆమె కవితల్లో మనం జీవిస్తున్నాం” అని ప్రశంసించాడు. అంతటి మహా రచయిత, ఆస్ట్రేలియా దేశ ఆదిమ సంతతికి వాణిగా, ప్రతినిధిగా కీర్తి ప్రతిష్టలు పొందినది జూడిత్.

అసలు పేరు జూడిత్ అరండేల్ రైట్. 1915 మే 30న న్యూ సౌత్ వేల్స్‌లోని ఆర్మిడేల్ దగ్గర “తల గారా”లో జన్మించింది. పశువుల పెంపకందారుల కుమార్తె. చిన్నప్పటి నుంచే పొలం, పుట్రా, పశువులు, పాడిపంట, పూలు పళ్ళు, గుర్రాలు, పోనీలు అంటే అభిమానం. ఇంటి వద్దే చదువుకొంది. తల్లి చిన్నప్పుడే చనిపోయింది. మేనత్త దగ్గర పెరిగింది. ఆర్మిడేల్‌లోని న్యూ ఇంగ్లాండ్ గర్ల్స్ స్కూల్‌లో చేరింది. ఆ వాతావరణం చూసి “తాను తప్పక కవిని అవుతాను” అని అనుకొన్నది. తర్వాత ఇంగ్లీష్, ఫిలాసఫీలను సిడ్నీ యూనివర్సిటిలో చదివింది. 25 ఏళ్ళకే మొదటి కవిత ప్రచురితమైంది.

రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత తండ్రికి సాయం చేయటానికి స్వగ్రామం చేరింది. తరువాత క్వీన్స్ లాండ్ వర్సిటిలో రిసెర్చ్ ఆఫీసర్ అయింది. అప్పుడే మేంజిన్ అనే సాహిత్య మాసపత్రికకు సంపాదకురాలైంది.

1946లో “The morning image” అనే మొదటి కవితా సంకలనాన్ని తెచ్చింది. ఆ తర్వాత ఆపు లేకుండా దాదాపు యాభై పుస్తకాలను రాసి ప్రచురించింది. అందులో 15 కవితా సంకలనాలున్నాయి. మిగిలిన సాహిత్య విమర్శలు, జీవిత చరిత్రలు, చరిత్రలు, వ్యాసాలు,

పర్యావరణ విషయాలు ఉన్నాయి. సాంప్రదాయ ఆస్ట్రేలియా మహిళగా ఉండటానికి ఇష్టపడేది కాదు. 1950లో నవలా రచయిత, ఫిలాసఫర్ అయిన జాక్ మేకన్నీతో బ్రిస్ బెన్ నుంచి దేశం అంతా పర్యావరణ పరిశీలన కోసం తిరిగింది. కూతురు పుట్టింది. వారిద్దరికీ 1962 వరకు పెళ్లి కాలేదు. భర్త 1966లో మరణించాడు.

యాభై దశకంలో యూడిత్ సాహితీ, సాంఘిక యాత్ర ఆపు లేకుండా సాగింది. ఆమె ప్రజా కవిగా మారింది. The morning image తో ప్రారంభించి ఆస్ట్రేలియా అందచందాలను, ప్రకృతిని, పర్వతాలను, లోయలను, పంటలను పుష్ప జాతులను కవిత్వంలో దించేసింది. ఆమెకు ప్రకృతిని చూస్తే పరవశమే. తన "మదర్ ఇంగ్లాండ్"ను అందులోని నిగూఢతను తవ్వి తీసింది. అక్కడి విభిన్న జాతుల స్వరూప స్వభావాలను, వారి సంస్కృతులను, కవిత్వీకరించింది. వాటి ప్రభావాన్ని చాటి చెప్పింది. ìSouth of my daysî, ìmeth drinkerî, ìcountry townî కవితల్లో వీటిని పొందు పరచింది.

1949లో వచ్చిన "Women to Man" అనే రెండవ కవితా సంపుటిలో స్త్రీల సెక్స్ విషయాలు, కోరికలు గురించి రాసింది. వారిలో అవగాహన కల్పించింది. సెక్స్‌లోని పరమార్ధాన్ని, ఆధ్యాత్మిక అనుభూతినీ వివరించింది. వీటిని ప్రభుత్వం పాఠ్య గ్రంథాలలో చేర్చిందంటే ఆమె రచనా ప్రభావం ఏమిటో తెలుస్తోంది. ఆ తర్వాతి కవితలన్నీ లాండ్ స్కేప్‌లపై రాసింది. "The true fires" సంకలనంలో ఇంగ్లీష్‌వారు ఆదిమ జాతులను అణగార్చిన విధానం, వారి సంస్కృతికి జరిగిన అన్యాయం, ఆంగ్లేయుల మానసిక స్తితిగతులను గొప్పగా చూపించింది. "బోరా రింగ్" సంకలనంలో ఆదిమ వాసుల సంస్కృతికి అద్దం పట్టింది. వన్యప్రాణులపై ఉన్న అభిమానాన్ని "Astreliyan birds"లో నిక్షిప్తం చేసింది. వీటి ప్రభావం ఆస్ట్రేలియా వాసులపై బాగా పడింది. భూమిని, పర్యావరణాన్ని అరుదైన జాతుల్ని సంరక్షించుకోవాలన్న ధృఢమైన అభిప్రాయం వారిలో కల్గించింది. న్యూక్లియర్ పవర్ ప్రాజెక్ట్‌లను, వాటి వల్ల వచ్చే ఇబ్బందులను ప్రజా దృష్టికి తీసుకొని వెళ్ళింది. ప్రభుత్వం, బడా పారిశ్రామిక వేత్తలు కుమ్మక్కై పర్యావరణాన్ని కబళిసున్నారని యెలుగెత్తి చాటింది.

ఆస్ట్రేలియా వాసుల గుండెచప్పుడుగా, వారి భావి భాగ్యవిధాతగా ఆమెను అందరు భావించారు. సాహిత్యం, పర్యావరణం, సాంఘిక రంగాలలో ఆమె త్రివేణి సంగమంగా సాగింది. జాతీయ రాజకీయాలను ప్రభావితం చేసిన అతికొద్ది మందిలో ఆమె ఒక్కరుగా నిలిచింది. కవిత్వం, ఇతర రచనల ద్వారా ఆస్ట్రేలియా దేశ సరిహద్దుల్ని, అక్కడి వన్య ప్రాణులను, ఆదిమ మానవ జాతిని, వారి చరిత్రను సరిదిద్దింది. "గ్రేట్ బారియర్ రీఫ్"ను ఆయిల్ డ్రిల్లింగ్ నుండి రక్షించగలిగింది. "ఫ్రీజర్ ఐలాండ్"ను కాపాడింది. వాటి అస్తిత్వాలను శాశ్వతం చేయగలిగింది. అప్పటి వరకు మగవారి గురించి, గుర్రాలు, భూ పోరాటాలకే

పరిమితమైన ఆస్ట్రేలియా సాహిత్యాన్ని ఒక ఊపు ఊపి కొత్త పుంతల్ని తొక్కించింది జూడిత్. స్త్రీ పురుష సంబంధాలను కొత్త కోణంలో తెలియజెప్పింది. ఆడవారికి సెక్స్ విషయాలపై మంచి అవగాహన కల్పించింది. ఒక రకంగా జాతిని జాగృతం చేసినదని చెప్పవచ్చు. వయసు మీద పడుతున్నా కవితా వ్యాసంగం తగ్గలేదు. 1963లో Five senses అనే కవితా సంపుటి తెచ్చింది. వర్షాధార అడవులు వినాశనం అవటాన్ని చూస్తూ ఊరుకోలేక ప్రతిఘటించటానికి Wild life society for queens land ఏర్పరచి, అధ్యక్షురాలైంది. ప్రజలు ఎదుర్కొంటున్న ఎన్నో సమస్యల సాధనకు నడుం బిగించి ప్రభుత్వాల దృష్టికి తీసుకొని వెళ్ళింది. ఇంత చేస్తున్నా కవిత్వ ధార ఇంకిపోలేదు. స్రోతస్వినిలా ప్రవహిస్తూనే ఉంది.

"The other half ", "Alive poems", "human pattern" మొదలైన పుస్తకాలను ముద్రించింది. వీటికి తోడు ఏడు పుస్తకాలుగా సాహిత్య చరిత్ర, విమర్శ గ్రంథాలను కూడా వెలువరించింది.

వన్యప్రాణి సంరక్షణ కాకుండా "National park association of New south vels", "south coast coservation council,amnesty internation Aastreliyan society of authors" వంటి అనేక సంస్థలలో సభ్యురాలుగా ఎన్నికైంది. 1975లో ఆస్ట్రేలియన్ నేషనల్ వర్సిటి కౌన్సిల్‌కు ఎన్నికైన మొదటి మహిళగా రికార్డు సృష్టించింది. ఆదివాసులకు జరిగిన అన్యాయాలను సరిదిద్దటానికి Aborginal treaty councilకు మెంబర్ అయింది. 1981లో నేటివ్ ప్రజల హక్కుల్ని క్వీన్ లాండ్ సెటిలర్స్ కాల రాస్తుంటే ఆ విషయాలన్నీ The cry of the deadలో వివరించి 1985లో We call for a treatyలో అన్నీ ఏకరువు పెట్టింది. ఎంతో కాలం ఉపన్యాసాలు, కవిత్వాన్ని చదివి వినిపించటంతో గడిపింది. లెక్కలేనన్ని బహుమతులు, పురస్కారాలు పొందింది. ఆమెను సన్మానించని సంస్థ లేదంటే ఆశ్చర్యం లేదు. 1992లో ఆమె కవిత్వానికి అత్యుత్తమమైన "క్వీన్స్ గోల్డ్ మెడల్" లభించింది. చనిపోవటానికి ఒక నెల ముందు కాన్ బెర్రా నగరంలో "రి కన్సిలియేషన్ మార్చ్"లో పాల్గొని దాదాపు తుది శ్వాస దాకా ప్రజావాణిని వినిపిస్తూనే ఉన్న మహా రచయిత. 2000 జూన్ 25న జూడిత్ రైట్ మరణించింది. ఆమె జీవితచరిత్రను వేరోనికా బ్రాడీ రాశాడు. అందులో ఆమె స్వీయచరిత్రను కూడా చేర్చారు. కారణ జన్మురాలు, మార్గదర్శి, ఉద్యమ సారధి, ఆదివాసుల వాణి జూడిత్ రైట్. ❃

**(విహంగ మహిళా వెబ్ మాసపత్రికలో ప్రచురితం)**



## 35. ఇంగ్లాండ్ సాహస కన్య - గ్రేస్ డార్లింగ్

**అ**పాయంలో ఉన్నవారిని రక్షించటం కనీస మానవధర్మం. దానికి ఆడా, మగా తేడా లేదు. సాయం అందుకొనేవారు తన వారా, పరాయివారా అన్న భేదం ఉండదు. ఆర్తులను కాపాడటమే ధ్యేయం. దీనికి సాహసం, ధైర్యం కావాలి. ఆ రెండూ అసాధ్యాన్ని సుసాధ్యం చేస్తాయి. సంకల్పం గట్టిదైతే కృషి తప్పక ఫలిస్తుంది. అలాంటి సాహసం చేసి తీవ్ర ప్రమాదంలో చిక్కుకొన్న నావికా ప్రయాణికులను అరుదైన ధైర్య సాహసాలతో రక్షించిన మానవీయ మూర్తి ఇంగ్లాండ్ దేశానికి చెందిన గ్రేస్ డార్లింగ్ అనే కన్య. ఆ సాహసి విశేషాలను తెలుసుకొని ఉత్తేజితులమవుదాం.

ఇంగ్లాండ్ దేశంలో నార్త్ ఆంబ్రియా దగ్గర ఉన్న తూర్పు సముద్రంలోని ఫారన్ ద్వీపాలలో ఒకటైన లాంగ్ స్టన్ ద్వీపంలో లైట్‌హౌస్ రక్షకుడుగా ఉన్న విలియం డార్లింగ్‌కు ఏడవ సంతానంగా గ్రేస్ డార్లింగ్ 1815లో జన్మించింది. ఈ ఫారన్ ద్వీపాలు ఆ కాలంలో నిర్మానుష్యంగా ఉండేవి. జంతు వృక్ష సంతతి ఎక్కడా ఉండేది కాదు. అంతా కొండలు, రాళ్ళ మయం. సముద్రం ఎప్పుడూ అల్లకల్లోలంగా ఉండి అలలు ఉవ్వెత్తున ఎగసి పడటం ఇక్కడ సహజ లక్షణం. ప్రవాహ వేగం ఎక్కువ. ప్రమాద భరిత ప్రాంతంగా పేరు పొందింది. అప్పటికే అనేక నౌకలిక్కడ మునిగిపోయి వేలాది మందిని పొట్టన బెట్టుకొన్న ప్రాంతమిది. 1782లో అమెరికా నుండి తిరిగి వస్తున్న ఓడ ఇక్కడి అలల తాకిడికి ముక్కలై సముద్ర గర్భంలో కలిసిపోయింది. 1823లో అయిదు ఓడలిక్కడే జల సమాధి చెందాయి. అందుకని ఇక్కడ లైట్‌హౌస్ నిర్మించి దానికి గార్డ్‌గా విలియంను నియమించింది ఇంగ్లాండ్ ప్రభుత్వం. ఆయన చాలా ఓర్పుగా, నేర్పుగా కావలి కాస్తున్నాడు. అతని సమర్ధతను ప్రభుత్వం గుర్తించింది కూడా.

తన పని చాలా కష్టంతో కూడుకున్నదైనందున తన పిల్లలకు మంచి విద్యా బుద్ధులను నేర్పించాలని విలియం తపన చెందేవాడు. గ్రేస్ డార్లింగ్ చాలా శాంత స్వభావం కలది. ఆమె సూక్ష్మ బుద్ధికలదై నందున చురుకుగా చదవటం రాయటం నేర్చుకొన్నది. తండ్రికి పడవ నడపటంలో ఎప్పుడూ సాయం చేసింది కాదు. ఇంటి పనులన్నీ తల్లే చూసుకొనేది. గ్రేస్‌కు ఇరవై రెండేళ్ళ వయసులో 1838లో సెప్టెంబర్ ఏడవ తేది ఆమె జీవితంలో ఒక అద్భుతమైన సంఘటన జరిగి, ఆమె చరిత్ర ప్రపంచ ప్రసిద్ధమైంది.

1838 సెప్టెంబర్ అయిదవ తేదీన "ఫోర్ ఫార్ ఫైర్" అనే పొగ ఓడ హాల్ నగరం నుంచి బయల్దేరింది. దాని కెప్టెన్ జాన్ హంబుల్. అందులో విలువైన వస్తువులను వర్తకం కోసం తీసుకొనిపోయే వారున్నారు. ఓడ సిబ్బందితో కలిసి అరవై రెండు మంది ప్రయాణీకులున్నారు. ఎంతో తంటాలు పడి అందులో నీళ్ళు నిలవచేసే ప్రయత్నాలు చేసినా ఫలితం శూన్యం. ఆరోజు అర్ధరాత్రి పన్నెండు గంటలకు గాలి తీవ్రమైనది. సముద్రపు అలలు ఎంతో ఎత్తుకు లేచి యెగిరి పడుతున్నాయి. వెంటనే పెద్ద గాలివాన ప్రారంభమైంది. గాడాంధకారం. ప్రకృతి ప్రకోపం, మానవ నిస్సహాయత. అందరు కళవళ పడిపోతున్నారు. ప్రాణాలు అరచేతిలో పట్టుకొని క్షణమొక యుగంగా గడుపుతున్నారందరూ. స్టీం బాయిలర్లలో నీరు నిలవటం లేదు. చక్రాలు పని చేయటం ఆగిపోయింది. గాలి వేగానికి ఓడ అటూ ఇటూ ఒక దిశా నిర్దేశం లేకుండా తీవ్రంగా ఊగిపోతోంది. ప్రయాణీకులు ప్రాణాలను అరచేతిలో పెట్టుకొని గడుపుతున్నారు. ఆందోళనతో దిక్కు తోచటం లేదు. ఆక్రందనలు చేస్తున్నారు. ప్రకృతి ముందు మానవుని నిస్సహాయత ప్రస్ఫుటంగా కనిపించింది.

ఓడ ఏదో ఒక గట్టువైపుకు కొట్టుకుపోతున్నట్లు అనిపించి ధైర్యం కూడదీసుకొని కెప్టెన్ తెరచాపలు ఎత్తించాడు. కాని అతని కృషి ఫలించలేదు. ప్రవాహం బలంగా దక్షిణ దిశకు పరిగెట్టుతోంది. దానితో బాటు నౌక అలానే సాగిపోతోంది గమ్యం లేకుండా. దూరంగా ఫారన్ ద్వీపపు లైట్‌హౌస్ కాంతి కనిపిస్తోంది. అందరికి తమ ఓడ ఎంత అపాయకర స్థలంలో ఉందో అర్ధమైపోయింది. కెప్టెన్ హంబుల్ ఓడను ఆ ద్వీపం మధ్యలోకి నడిపి రక్షిద్దామని తీవ్రంగా ప్రయత్నించాడు కాని ఫలితం లేకుండాపోయింది. తెల్లవారుఝామున నాలుగింటికి ఓడ "హార్కార్ రాక్" అనే కొండకు ఢీకొని ముందుభాగం ముక్కలైంది. వెనుక భాగం అలల తాకిడికి అల్లకల్లోలమైంది. ఎవరికి వారు తమ ప్రాణాలను దక్కించుకోవాలనే ప్రయత్నంలో ఉన్నారు. ఆత్మ రక్షణార్ధం ఎవరి ప్రయత్నాలు వాళ్ళు ప్రారంభించారు. స్వార్ధపరులైన కొందరు నావికులు నౌకలో ఉన్న ఒక చిన్న "లైఫ్ బోట్"ను సముద్రంలోకి దింపి దానిలో ఎక్కి పారిపోవటానికి ప్రయత్నించారు. ప్రయాణీకుల ప్రాణాలను కాపాడాల్సిన నావికులే స్వార్ధ బుద్ధితో ఆత్మరక్షణకు అందర్నీ నట్టేట ముంచి పలాయనం చిత్తగించి వృత్తికీ,

దేశానికీ అవమానం తెచ్చారు. స్వార్థం ఎంతటి నీచానికైనా దిగజారుస్తుందని తెలియజేసే సంఘటన ఇది.

నావికులు పడవలో పారిపోతున్నారని అలికిడి ద్వారా తెలుసుకొన్న ఒకరిద్దరు తామూ ఆ పడవలోకి దూకారు. కొందరు దూకే ప్రయత్నంలో సముద్రంలో పడి మునిగి అక్కడికక్కడే చనిపోయారు. కళ్ళముందే వాళ్ళు చనిపోతుంటే ఓడలో ఉన్నవారి ఆర్తనాదాలతో, హాహా రావాలతో ఆ ప్రదేశం అంతా శోక సముద్రమే అయింది. భగవంతుని ప్రార్థించటం తప్ప వారింకేమీ చెయ్యలేని నిస్సహాయ స్తితి. ఓడ విరుగుతున్న ధ్వనులు, రోదనలు మిన్ను ముట్టాయి. ఈ దెబ్బతో నౌక మధ్యకు రెండు ముక్కలైంది. మొదటి భాగం అగాధ సముద్ర జలాల్లో మునిగి కంటికి కనిపించకుండా మునిగి అదృశ్యమైంది. నౌకలోని గదులన్నీ మునిగిన ఈ భాగంలోనే ఉన్నాయి. ఓడ నాయకుడు, భార్య కూడా ఇందులోనే ఉన్నారు పాపం.

తెరచాప కొయ్యలు, చక్రాలు ఉన్న ముందుభాగం మాత్రం కొండలో చిక్కుకొని ఉండిపోయింది. ఇందులో తొమ్మిదిమంది మాత్రం ప్రాణాలు ఉగ్గబట్టుకొని బతికి ఉన్నారు. వీరిలో అయిదుగురు ప్రయాణీకులు, నలుగురు మాత్రం నావికులు, ప్రయాణీకులలో "సారా డాసన్" అనే ఆమె తన ఇద్దరు పిల్లల్ని రొమ్ముకు హత్తుకొని భీతావహియై ఉంది. సాయం కోసం అందరు అరుస్తున్నారు. ఆమె పిల్లలిద్దరూ ఆ చలికి, గాలికి, నీటికి బిర్ర బిగుసుకొని ఆమె చేతుల్లోనే మరణించారు. ఆమె కన్నీరు మున్నీరుగా విలపిస్తోంది. ఆమె మాత్రం కొన ఊపిరితో ఉంది. గాలివాన క్రమంగా తగ్గుముఖం పట్టింది. కాని సముద్రం మాత్రం భయంకరంగా గర్జిస్తూనే ఉంది. తెల్లవారుతోంది. చీకట్లు ఇంకా విచ్చుకోలేదు. ఎవరైనా వచ్చి రక్షిస్తారని ఆ తొమ్మిదిమంది ఎదురు చూస్తున్నారు.

మన కథానాయకి గ్రేస్ డార్లింగ్‌కు నావలోని వారి ఆర్తనాదాలు వినిపించాయి. ఆమె నిరుపేద బాలిక. వెంటనే తండ్రిని నిద్రలేపింది. ఎలా వారికి సాయమందించగలమని తల్లీ కూతురు ఆలోచించారు. ఇంతలో తెల్లవారింది. పగిలిన ఓడ భాగం కనిపించింది. కాని సముద్రం ఇంకా అల్లకల్లోలంగా ఉంది. వెళ్ళటానికి ఎవరికి ధైర్యం చాలటం లేదు. అవకాశమూ కనిపించటం లేదు. "స్మేదిల్" అనే ధనవంతుడు సముద్రంలో చేపలు పట్టేవారికి అయిదు పౌన్లు డబ్బు ఇస్తానని ఆశ పెట్టి పిలిచినా వాళ్ళు కూడా సముద్రంలోకి పడవలతో వెళ్ళటానికి సాహసం చెయ్యలేకపోయారు. సముద్రంలోకి వెళ్ళటం ప్రాణాంతకం అనిపించింది అందరికి. ఎవరి ప్రాణం వారికి తీపి కదా. నీటిలో నిత్యం చేపల్లా ఈదేవాళ్ళే భయడితే సామాన్యులకు వెళ్ళే ధైర్యం ఎక్కడుంటుంది?

లైట్‌హౌస్ గార్డు అయిన డార్లింగ్ మొదట సంశయించినా కూతురు గ్రేస్ చొరవ తీసుకొనటంతో ధైర్యంగా ముందడుగు వేసి ఓడలోని వారిని రక్షించాలని బయలుదేరాడు.

ఒక "లైఫ్ బోట్"ను సముద్రంలోకి దింపి చెరొక తెడ్డు పట్టుకొని నడపటం ప్రాంభించారు. అయితే ఆమెకు పడవ నడపటం ఇంతకు ముందెప్పుడూ చేయలేదని ముందే చెప్పుకొన్నాం. కాని అవతలి వారిని రక్షించాలన్న తాపత్రయం ఆమెకు ఆ విద్యను అప్పటికప్పుడు నేర్చుకొనేట్లు చేసింది. అత్యంత వేగంగా, సామర్థ్యంగా పడవను నడిపి తండ్రికే ఆశ్చర్యాన్ని కలిగించింది. రక్షించాల్సిన వారంతా కొండమీద చిక్కుకొన్నారు. వారి దగ్గరకు చేరాలంటే ఆ కొండ ఎక్కాలి. పడవ పగలకుండా చూసుకోవాలి కెరటాల తాకిడికి, వేగానికి పడవ కొండకు ఢీకొంటే మొదటికే మోసం. నెమ్మదిగా పడవను కొండ దగ్గరికి చేర్చారు తండ్రీ తనయలు. గబుక్కున తండ్రి ఒక్కసారి కొండపైకి దూకాడు. కూతురు గ్రేస్ లాఘవంగా పడవను లోతు నీటిలోకి నడిపి నీటిపై తేలేట్లు చేసింది. ఒక్కొక్కర్ని అతి జాగ్రత్తగా పడవలోకి చేర్చాడు. తొమ్మిదిమందిని ఎక్కించుకొని సురక్షితంగా తమ లైట్‌హౌస్‌లోకి చేర్చారు. వీరి ప్రాణాలను కాపాడటానికి గ్రేస్ ఎంత ఆత్రుత పడిందో అంతే ఆత్రుతను మరో మూడు రోజులు చూపించి వారికి అన్ని సౌకర్యాలు కల్పించి తల్లికి చేదోదుగా ఉంది. వారి మనోవేదనను శాంత పరచటానికి గ్రేస్ కుటుంబం శక్తివంచన లేకుండా చేసి మానవత్వాన్ని ప్రదర్శించింది. తను పడుకొనే పరుపును ఇద్దరు పిల్లలను కోల్పోయిన అభాగ్యురాలు డాసన్ దొరసానికి ఇచ్చి గ్రేస్ బల్లమీదే నిద్రపోయింది. ఆ తర్వాత ఓడలలో వచ్చి ఇక్కడ చిక్కుపడ్డవారిని కూడా ఇంటికి తెచ్చి మొత్తం ఇరవై మందికి తండ్రీ కూతురు వారి ఆలనా పాలనా చూశారు. మానవత్వం వికశించిన మహాద్భుత సన్నివేశం ఇది. చరిత్రలో నిలిచిపోయింది.

గ్రేస్ తండ్రి జీతంమీద ఆధారపడి బతికే పేద ఉద్యోగి. అయినా ఆయన కూతురు గ్రేస్ ఒక సాహస కార్యంతో అందరి దృష్టిని ఆకర్షించింది. పేరు పుట్టుకతో రాదు. చేసే పనులవల్ల వస్తుందని రుజువు చేసింది ప్రపంచానికి. గ్రేస్ చేసిన సాహస చర్య ఆనోటా ఆనోటా పడి అందరి దృష్టికీ చేరింది. ఎక్కడెక్కడి నుంచో జనం ఆమెను చూడటానికి తీర్థ ప్రజగా వచ్చేవారు. ధనికులు, అధికారులు, సామాన్యులు అందరు వచ్చి ఆమెను అభినందించారు. రాణి, రాజు ఈ తండ్రీ కూతుర్లను పిలిపించి సత్కరించారు. బంగారు గడియారాన్ని గ్రేస్‌కు కానుకగా ఇచ్చారు. దాన్ని ఆమె తనను చూడటానికి వచ్చినవారందరికీ చూపిస్తూ మురిసిపోయేది. అనేక మంది ఎన్నో విలువైన కానుకలను గ్రేస్‌కు పంపారు. ఆమెకు ఆర్థిక సాయం చేయాలనే సంకల్పంతో చందాలు వసూలు చేసి 700 పౌన్ల ధనాన్ని ఆమెకు అందించారు. గ్రేస్ సాహసంపై నాటకాలు రాసి ప్రదర్శించారు. ఆమె కొద్దిసేపు పడవలో కూర్చుని నాటకం చూస్తే బోలెడు ధనిమిస్తామని ఆశపెట్టారు. కాని ఆమె దేనికీ ప్రలోభ పడలేదు. వీటిని తృణప్రాయంగా భావించి తిరస్కరించింది. త్యాగానికి ప్రతిఫలం కోరుకోని మనిషి అనిపించి, నిజంగానే గ్రేస్ అనిపించుకొంది. తానేదో గొప్ప ఘనకార్యం

చేశానని ఆమె ఎప్పుడూ ప్రగల్భాలు పలకలేవు. ఈ సంఘటన తర్వాత మూడేళ్ళు తల్లిదండ్రులతోనే ఉంది. వారు బతికి ఉండగా వేరుగా ఉండనని చెప్పింది. వాళ్ళు వివాహ ప్రయత్నాలు చేసినా వివాహం కూడా చేసుకోకుండా జీవించి కన్యగానే మిగిలిపోయింది.

1841లో గ్రేస్ కన్యకు క్షయ రోగం సోకింది. వీలైన మంచి వైద్యం చేయించినా, గుణం కనపడలేదు. క్రమంగా క్షీణించిపోయింది. మరణ సమయంలో ఆమె బంధువులందర్నీ పిలిపించుకొని తన వద్ద ఉన్న అమూల్య వస్తువులను తన స్మృత్యర్థం కానుకలుగా అందజేసిన త్యాగశీలి గ్రేస్. జీవితాన్ని "గ్రేస్"తో జీవించి అందరికి "డార్లింగ్ కన్య" అయిన గ్రేస్ డార్లింగ్ 1842 అక్టోబర్ 20న బాంబరో నగరంలో కీర్తిశేషురాలైంది. ఆమె శవయాత్రలో అశేష జనం పాల్గొని ఆమెకు శ్రద్ధాంజలి ఘటించి చరిత్ర సృష్టించారు. ఆమెను "సెయింట్ ఐడాన్స్ చర్చి యార్డ్"లో ఆమె తల్లిదండ్రుల సమాధుల ప్రక్కనే సమాధి చేశారు.

ఆమె సాహసజీవితంపై ఎన్నో కథలు, నాటికలు, పాటలు వచ్చాయి. "Grece Darling or Maid of the isles"పేరిట జెరోల్డ్ వేర్మాన్ 1839లో ఒక నాటకం రాసి ప్రదర్శించాడు. ప్రఖ్యాత ప్రకృతి కవి విలియం వర్డ్స్ వర్త్ 1843లో "గ్రేస్ డార్లింగ్" అనే అద్భుత కవిత రాసి ఆమె త్యాగాన్ని ప్రస్తుతించాడు. ప్రభుత్వం గ్రేస్ పేరుమీద ఒక లైఫ్ బోట్‌ను హోలీ ఐలాండ్‌లో ఏర్పాటు చేసింది. విలియం బెల్ స్కాట్ అనే ప్రముఖ చిత్రకారుడు డార్లింగ్ జీవితంపై చిత్రించిన అనేక చిత్రాలను నార్త్ అంబర్‌లాండ్‌లోని "వాషింగ్ టన్" హాలులో ప్రదర్శించాడు. బామ్బర్గ్‌లో ఒక మ్యూజియంలో ఆమె సాహసాలను భద్రపరచారు. దేవ్ కజిన్స్ ఆమెపై ఒక గొప్ప భావాత్మక ప్రేమగీతాన్ని రాశారు. వెస్ట్ గేట్ గ్రేస్ జీవితంలోని అపూర్వ ఘట్టాలపై ఒక సంగీత రూపకాన్ని సమకూర్చి ప్రదర్శించాడు. ఆమె పరోపకార పారీణత అందరికి ఆదర్శమే. చిరస్మరణీయురాలు గ్రేస్ డార్లింగ్. ❀

**(విహంగ మహిళా వెబ్ మాసపత్రికలో ప్రచురితం)**

## 36. విముక్తి గీతం (రిడెంప్షన్ సాంగ్)

**B**ertice Berry అనే ఆఫ్రికన్ అమెరికన్ అమ్మాయి రాసిన నవలే రిడెంప్షన్ సాంగ్. నల్లజాతి వారు, వారి ప్లిలలు పడే బాధలు, తెల్లవాళ్ళు వీళ్ళ కవిత్వాన్ని ఎలా పాడు చేసేదీ మొదలైన వాటినన్నిటిని ఇందులో మనసు ద్రవించేట్లు రాసింది. అయితే ఎవరిపైనా ద్వేషం వద్దని, ప్రేమతోనే అంతా జయించాలని యేసుక్రీస్తు మాటలనే ఆమె చెప్పింది.

ఇందులో Fina అనే అమ్మాయి, Ross అనే అబ్బాయి ఒక పుస్తకాల షాప్ "బ్లాక్ ఇమేజెస్"కు వెళ్తారు. ఆ షాపు యజమాని Miss Cojy అనే నల్లజాతి స్త్రీ, నల్లజాతివాళ్ళ అరుదైన పుస్తకాలన్నీ ఈమె వద్ద ఉన్నాయి. అందులో తన తల్లి వాళ్ళు ఇచ్చిన "Children of grace" అనే "మెమరి బుక్" ఆమె వద్ద ఉంది. ఆ పుస్తకం ఎంతో మార్చింది. జరుగబోయేదాన్ని వివరిస్తుంది ఆ గ్రంథం. సమస్యలతో వచ్చిన వాళ్ళకు ఏ పుస్తకం కావాలో సూచిస్తుంది ఆమె. అది చదివి వాళ్ళు తమ మార్గాన్ని తెలుసుకొంటారు. సమస్యకు పరిష్కారం పొందుతారు. రాస్ ఒక "anthropologist" (మానసిక శాస్త్రవేత్త). ఆమె ఒక విద్యార్థిని. ఇద్దరు చిల్డ్రెన్ ఆఫ్ గ్రేస్ చదవాలని అక్కడికి వస్తారు. ఇద్దరినీ సమాధాన పరచి తానే ఆ పుస్తకం చదివి వినిపిస్తుంది కోజీ. కోజీతో బాటు, వీళ్ళిద్దరూ కూడా జీవితంలో పెళ్ళిళ్ళ దెబ్బలు తిన్నవాళ్ళే. అందరి పూర్వ జీవితాలు తెలుసుకోవాలనే తాపత్రయం ఈ ఇద్దరినీ కలుపుతుంది. వాళ్ళ జీవితాలకొక సార్థకత కల్పిస్తుంది కోజీ. ఆఫ్రికన్ అమెరికన్లు ఎలా సంభాషించుకొంటారో అచ్చంగా అలానే సంభాషణలు రాసింది రచయిత.

ఈ నవలలో రచయిత్రి ఎన్నో జీవిత సత్యాలను చెబుతుంది. అన్నిటిని పాత్రలతోనే చెప్పించింది. ఒకచోట ఒక స్లేవ్ ఓనర్ తన దగ్గర పనిచేసే "బెన్" అనేవాడు తన నల్లజాతివారి తిరుగుబాటును ముందే తెలుసుకొని యజమానికి తెలియజేస్తాడు. వాడు దాన్ని అణచివేసి, వీడినీ వీడి పెళ్ళాలను, పిల్లల్ని కూడా నిర్దాక్షిణ్యంగా చంపేస్తాడు. అప్పుడు వాడు "Anybody who will turn on their own is lowewr than a dog. someday that dog is gonna turn on you too" అని జీవిత సత్యాన్ని చెప్పిస్తుంది రచయిత. రాస్ అంటాడు తమ స్వాతంత్రం భౌతికతకు మారిపోయింది. దైవానికి ఆయన భావానికి

దూరమైపోయింది అని. కోసినా ఈ ప్రేమికులతో "You have been charged to set these families right. you have to teach the recipe of life. the key ingredient is love". అయోనా అనే అమ్మాయి "joe" అనే అబ్బాయిల ప్రేమ కథే ఇది. ఈ కథయే వాళ్ళ తరతరాల గాథగా తెలుసుకొని ఆదర్శవంతంగా భావిస్తారు.

ఈ నవలలో రాస్ ఫీనాల విడివిడి ప్రేమలు వాటి వైఫల్యాలు, కోజీ ప్రేమ కథ, అయోనా జోలప్రేమ కథ నాలుగు పేటలతో అల్లిన నవల. ఎక్కడా విసుగు అనిపించదు. ప్రతి పాత్ర తన జీవితాన్ని తెరచిన పుస్తకంలా ఆవిష్కరించటం ఇందులో విశేషం. రచయిత్రి చిన్న అమ్మాయే. కాని చాలా అనుభవం ఉన్న ప్రౌఢలా రాసింది. తన జాతి ఋణం తీర్చుకొంది. "A sparkling heart felt debut and a compelling read" అన్న కొన్నీ బ్రిస్కో మాట నిజం. "The story is about love, the importance of understanding oneís history and the power of books, and how they can influence your life" అని పుస్తకం కవర్ పేజి మీద ఉన్న మాట సత్యమే.

ఈ నవలలో కోజీ పాత్ర చాలా విశిష్టమైంది. అబ్బూరి రామకృష్ణా రావుగారు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో లైబ్రేరియన్‌గా ఉన్నప్పుడు శ్రీశ్రీ బూదరాజు, ఆరుద్రా వగైరా రచయితలకు ఏ పుస్తకాలు చదవాలో ఏవి కొత్తగా విడుదలయ్యాయో తెలియజేసి చదివించే వారని వారి మాటల వల్ల తెలుస్తుంది. అలాగే కోజీ కూడా చేయటం మెచ్చదగిన విషయం. ఇందులో సంభాషణలే చాలా తమాషాగా ఉంటాయి. మనకు అంతా "గ్రమాటికల్ మిస్టేక్స్"లా అనిపిస్తాయి కాని అదే వాళ్ళ వాడుక భాష అని తెలిస్తే ఆశ్చర్యపడం. ఉదాహరణకు "He say I his freedom. cause when he think of me he free in his head".

కోజీ అనే షాప్ యజమానులు ఆ జంటకు అయోనా కథ చెబుతూ "Her love and her love of her people needed were connected to a revolution that was already happening. it crossed generations and found its way to her. but this was not about her. it was about generations of people who needed to be set free

She and Ross were simply a part of large picture" అన్న గొప్ప సందేశాన్నిచ్చి స్ఫూర్తి కలిగించటం విశేషం.

అయోనా తన కథలో చివరికి తన సందేశాన్ని చాలా గొప్పగా అందజేస్తుంది. తన జాతివారంతా తరతరాలుగా బానిసలుగా బతుకుతున్నారని వాళ్ళందరికి తీరని అన్యాయం జరిగిపోతూనే ఉందని అది అర్థం చేసుకోవాలని, పిల్లలను తీర్చి దిద్దుకొమ్మని, సత్యాన్ని దర్శించమని యజమానులను అసహ్యించుకోని వారిలాగా అధికారాన్ని సంపాదించుకొని తల ఎత్తుకు తిరగాలని, తమకోసమే కాక ఇతరుల గురించి ఆలోచించి ముందుకు వెళ్లాలని తమ చరిత్రను, మూలాలను అధ్యయనం చేయాలని ప్రేమతో, క్షమతో ఉండమని కాని దేన్నీ

మర్చిపోవద్దని (forgive never forget) సందేశం ఇస్తుంది. "This is the Recipe of life, the road to freedom. Freedom just is not as strong as the ones on our mind. The only thing that can win over evil is love. learn to love because we donot get time for nothing else"అదీ ఆమే ప్రేమ సందేశం త్యాగ సందేశం ఆదర్శగీతం విముక్తి గీతం.

అయోనాను హాన్ బాయ్ అనే యజమాని కొడుకు మళ్ళీ మళ్ళీ "రేప్" చేస్తాడు. ఈమెను జో ప్రేమిస్తాడు. డబ్బు కట్టి ఈమెను బానిసత్వం నుండి విముక్తి చేస్తాడు. హన్, వాడి మనుషులు గేలి చేస్తూ నవ్వుతోనుంటారు. అప్పుడు జో బిగ్గరగా "Iona I own her" అంటూ పదే పదే సంతృప్తిగా సంతోషంగా అంటాడు. అంతటి ప్రేమ అతనిది. ఆ అమర ప్రేమనే కథగా తీసుకొని ఆద్యంతం ప్రేరణ నిచ్చే నవలగా మార్చింది. రచయిత బెర్రి "రిడెంప్షన్ సాంగ్" నిజంగానే కమ్మని పాటలా సాగింది. కర్తవ్య బోధ చేసింది. జాతి విముక్తికి మార్గం చూపింది. నల్లజాతివారికి "విముక్తి గీతం" అయి తరతరాలను ప్రభావితం చేసింది.

రచయిత గురించి పరిచయం – బెర్తిస్ బెర్రీ 1906లో అమెరికాలో జన్మించింది. దిల్వారేలోని విల్లింగ్ తనలో పెరిగింది. ఫ్లొరిడాలోని జాక్సన్ యూనివర్సిటిలో గ్రాడ్యుయేషన్ చేసింది. ఒహాయోలోని కెంట్ వర్సిటి నుండి సోషియాలజీలో పి.హెచ్.డిని 26 ఏళ్ళకే సాధించింది. "I am on my way. But yout foot is on my head" వంటి నవలలు రాసింది. ప్రస్తుతం జార్జియాలోని సవన్నాలో భర్తతో ఉంటోంది. "రిడెంప్షన్ సాంగ్"తో గొప్ప పేరొచ్చింది. ❀



## 37. వందమంది బాలికల తల్లి (one hundred girlís mother) తోమాసినా

Lenore Carole అనే ఆమె రాసిన నవలే పైన పుస్తకం. అమెరికాలోని కాలిఫోర్నియాలో నిజంగా జరిగిన కథకు కల్పన జోడించి రాసిన నవల. Thomasina Mc intyre అనే ఆవిడ కాలిఫోర్నియాలోని "స్కాట్స్ చైనా చైన్" అనే చోట ఉంటోంది. ఆ రోజుల్లో చూనా నుంచి ఆడపిల్లల్ని తెచ్చి చైనా టౌన్‌లో అమ్మేస్తూండేవారు. వీరితో వ్యభిచారం చేయిస్తూ, బానిసలుగా చూస్తూ, పిల్లల్ని కంటే బైటికి విసిరేసి, ఇళ్ళల్లో గొడ్డు చాకిరీ చేయిస్తూ, వీలైతే అమ్మేస్తూ ఉండేవారు. ఈ ముఠాకు వ్యతిరేకంగా, బానిసలకు, బాధితులకు ఆసరాగా "ప్రెస్బిటేరియన్ మిషన్" పని చేసేది. "తోమాసినా" ఈ మిషన్‌లో 1895 నుండి పనిచేసి చిరస్మరణీయమైంది. ఈవిడకు ముందు మిస్ మార్గరెట్ కుల్బెస్తాన్ పనిచేసింది. ఈమెకు సాయంగా చున్ మీ ఉండేది. ఈవిడకు వయసు మీద పడటంతో తోమాసీనాకు శిక్షణ నిచ్చి సహాయ టీచర్‌గా వేసుకొంది. వీరంతా కలిసి క్రూర రాజకీయాలను, పనికిరాని న్యాయ, చట్టాలను ఎదిరించారు. చైనా నుంచి తరలించబడ్డ ఆడపిల్లల్ని రక్షించటానికి, ఈ మిషన్ చాలా జాగ్రత్తగా వ్యవహరించి, ఆ ఆడపిల్లల్ని అభాగ్యులైన గర్భవతుల్ని, పోలీసుల సహాయంతో, చట్టం రక్షణలో ఈ మిషన్‌లో చేర్పించి, బ్రతకటానికి తగిన విధంగా తీర్చి దిద్దుతున్నారు. వీరు పెద్దవారైన తర్వాత తమ ఇష్టం మేరకు తలిదండ్రుల దగ్గరకు చైనా వెళ్ళటానికి సహాయం చేస్తున్నారు. లేకపోతే ఇక్కడే క్రాఫ్ట్, ఎంబ్రాయిడరీ మొదలైనవి నేర్చుకొని ఉండిపోవచ్చు. వీళ్ళ పని న్యాయబద్ధంగా దళారీదారుల నుండి యువతులను విముక్తి చేయటమే.

ఈ విధమైన సేవ చేస్తుంటే కుల్బెస్టన్ తీవ్ర అనారోగ్యానికి గురై కొద్ది కాలానికి మరణించింది. అప్పుడు ఈ మిషన్ నిర్వహణ బాధ్యత తోమాసీనాపై పడింది. ఆమె అత్యంత సేవాభావంతో, అంకిత మనస్సుతో, ఆ పిల్లలకు తల్లిలా ధైర్యంగా నిలబడి, అవసరమైతే పోరాడి చివరి దాకా నిలబడింది. దీనికి తోడు ఆమె కథ మధ్యలో ముగ్గురితో ప్రేమలో పడుతుంది. కాని కర్తవ్యం బలీయం కనుక ఎప్పుడూ హద్దులు దాటలేదు. చివరికి "రాస్" అనే ముసలాయన పెళ్ళి చేసుకొంటానన్నాడామెను. సరే అన్నది. ఇంతలో అతను అకస్మాత్తుగా చనిపోతాడు. మళ్ళీ ఒంటరిగానే ఉండిపోతుంది. మిషన్ వ్యవహారాల్లో సర్వం మర్చిపోయింది. తన జీవితాన్ని ఈ అభాగ్యుల కోసం త్యాగం చేసి చరితార్థురాలైంది. అలాంటి త్యాగమూర్తి జీవితం గురించి చదివిన గొప్ప సంతృప్తి మనకు మిగిలిపోతుంది. సేవాభావం అంటే తేలికైనదేమీ కాదని కత్తిమీద నడకేనని ఈ నవల చదివితే అవగాహన మవుతుంది.

1906లో కాలిఫోర్నియాలో తీవ్ర భూకంపం వచ్చింది. సర్వం నేల మట్టమైంది. ఆ మిషనరీ కూడా కూలిపోయే స్తితిలో ఉంది. అప్పుడు సుమారు యాభైమంది పిల్లలతో వేరొక చోటికి మార్చి, తల దాచుకొన్నారు వీరంతా. ఆ తర్వాత దాతల సహకారంతో సకల సదుపాయాలున్న వంద గదుల భవనాన్ని అదే స్థలంలో నిర్మింపజేసి తన ఉదాత్త ఆశయానికి ప్రాణం పోసింది. సంకల్పం, దీక్షా ఉంటే సాధించలేనిదేమీ ఉండదు అని రుజువు చేసిన సేవామూర్తి తోమాసీనా. మాతృమూర్తిగా భాసించింది. అందుకే మనవారు "ముదితల్ నేర్వగా రాని విద్య గలదే ముద్దార నేర్పించినన్" అన్నారు.

ఈ నవలలో కొన్ని పదాలకు రచయిత్రి గొప్ప అర్థాలనిచ్చింది. Prostitute అంటే వందమంది మగాళ్ళకు భార్య. అలాగే సేవా భావానికి ఆ స్త్రీ మూర్తికి లోని ఒక స్ఫూర్తినిస్తుంది. "Ask and it shall be given - seek and ye shall fine - love and help are always here - if tou remember to ask".

వివాహం కాని చైనా అమ్మాయి దురదృష్టవంతురాలు. అలాగే తోమాసీనా తన ప్రేమను గురించి "If tou donat know me well, enough to know that then you have not been paying . i suggest you find another girl who does not mind finding out if you are compatible" అంటుంది. మిషనరీలో ఉన్న ఆడపిల్లల గురించి "మీరంతా భయంతో మాకు చిక్కిపోయారు. మీరు సగం దెయ్యాలు సగం చిన్నపిల్లల మనస్తత్వం వాళ్ళు" అని సముదాయిస్తుంది. తోమాసీనాను అందరు "లోమొ" అని ఆప్యాయంగా పిలుస్తారు అంటే "RESPECTED MOTHER".

ఆమె తరచుగా తనను గురించి "It is better to be one hundred girlís mother than to be one hundred menís wife" అనుకొనేది. 27 ఏళ్ళ వయసులోనే

ఈమెకు ఇంతటి మిషన్ కార్యం మీద వేసుకొని సమర్ధవంతంగా నిర్వహించి అందరికి తల్లి అనిపించుకొంది. ఆమె దృష్టిలో పనిలేని విశ్వాసం శూన్యం (faith without work is empty). డబ్బుకు కొరత ఏర్పడ్డప్పుడు బోర్డ్ మీటింగ్ పెట్టే మాట్లాడుతూ "We have to change water into wine, when the budget is low" అని ప్రోత్సహించేది. తనకు ముందు పనిచేసిన క్యూబెర్స్టాన్ చెప్పిన "Take heart and call on the Lord" అన్నది తోమాసీకి వేద వాక్కే. దానిప్నే అనుసరించి సఫలీకృతురాలైంది. ఈ మాటనే నమ్మి ఎక్కడో ఉన్న చైనా దేశపు ఆడపిల్లల కోసం తన జీవితాన్ని అంకితం చేసుకొని ధన్యమాత అనిపించుకొంది. తోమాసీనా పెద్దదై "Tomsen"అయింది. అంటే "పెద్దమ్మ గారు" అయింది. అమ్మలగన్న యమ్మ అనిపించుకొంది. రచయిత్రి కరోల్ ఇంతటి త్యాగమూర్తి కథను నవలగా రాసి మహోపకారమే చేసినందుకు అభిమానపాత్రురాలైంది. ❁

# 38. నేర ప్రవృత్తి నివృత్తికి అంకితమైన లేడీ కార్పెంటర్

ఏకేశ్వర క్రైస్తవ ఉపాసకుడైన డాక్టర్‌లంటూ కార్పెంటర్ పెద్ద కుమార్తె మేరీ కార్పెంటర్. తల్లి పెన్. 1807లో ఇంగ్లాండ్‌లోని ఎక్సిటర్ పట్నంలో జన్మించింది. తండ్రి ఉపాధ్యాయ వృత్తిలోను, ధర్మ బోధలోను మంచి పేరు పొందాడు. తండ్రి వద్దే మేరీ విద్య నేర్చింది. గ్రీక్, లాటిన్, ఇంగ్లీష్‌లలో మంచి ప్రావీణ్యం సంపాదించింది. తండ్రి ఆమెకు నీతి పాఠాలను శ్రద్ధగా బోధించాడు. జంతుశాస్త్రం, ప్రకృతి శాస్త్రాధ్యయనమూ చేసింది మేరీ. ఆమె సోదర సోదరీలు కూడా సమాన ప్రతిభ చూపారు. చదువుకోవటం వాళ్ళ గృహ కృత్యాలకిప్పుడు ఇబ్బంది కలగలేదు.

మేరీకి పదేళ్ళ వయసులో తండ్రి కాపురాన్ని బ్రిస్టల్‌కు మార్చి తన ధర్మ బోధ చేస్తున్నాడు. ఇక్కడే మహా మేధావి అయిన జేమ్సు మార్టినో అనే ఆయన శిష్యుడుగా చేరగా మేరీకి క్లాస్‌మేట్ అయ్యాడు. క్రమంగా మేరీతో విద్యాబోధన చేయించాడు తండ్రి. ఆదివారాలలో ప్రత్యేక శిక్షణలో కూడా తండ్రికి సహకరించేది. విద్యార్థులకు ధర్మ, నీతి బోధ చేయటమే కాక వారి ఇళ్ళకు వెళ్లి వారిని ప్రభావితం చేసింది.

మేరీ ఇరవై ఒక్కవ ఏట తండ్రి ఆమెకు క్రైస్తవ బోధనే వృత్తి వ్యావృత్తిగా చేసుకొమ్మని కోరాడు. 1829లో తండ్రి అనారోగ్యం వల్ల తన బడి మూసేశాడు. భార్య ముగ్గురు పిల్లలు కలిసి ఆడవారికోసం ఒక స్కూల్ పెట్టారు. స్త్రీలకు కావలసిన అన్ని విద్యలు నేర్పటం ప్రారంభించారు. గ్రీక్, లాటిన్ భాషలనూ నేర్చారు. కుట్టుపని, అల్లిక మొదలైన ఇంటి వృత్తులను నేర్చారు. ఈ స్కూల్‌లో విద్య నేర్చిన వారందరూ బీదలకు విద్యాదానం చేస్తూ గడిపారు. కొందరు వివాహం చేసుకొని ఉత్తమ గృహిణులుగా స్థిరపడ్డారు.

1832లో బ్రిస్టన్ నగరంలో కలరా వ్యాపించింది. అప్పుడు మేరీ కార్పెంటర్ సేవా భావంతో రోగులకు సేవలందించి ఆదుకొన్నది. 1833లో రాజా రామమోహనరాయ్ ఇంగ్లాండ్ వెళ్లి డాక్టర్ కార్పెంటర్‌ను కలిసి ప్రభావితుడయ్యారు. డాక్టర్‌గారింట్లో కొంతకాలం ఉన్నాడు రాయ్. అప్పుడు మేరీ కూడా రామమోహన్‌తో జరిగే చర్చలలో పాల్గొనేది. డాక్టర్‌గారు అస్వస్థతపాలయ్యారు.

అశాంతి అలమటిస్తున్న ఆమెకు అమెరికా నుండి వచ్చిన డాక్టర్ టక్కర్ మాన్ అనే ఉత్తమ విద్యావేత్తతో పరిచయం కలిగింది. ఆయన వలన భారతదేశంలోని స్త్రీల దుస్థితిని, విద్యా హీనతను తెలుసుకొన్నది. మనసంతా భారతదేశంలోని దీనులే ఆక్రమించారు. వారి సేవలో జీవితం ధన్యం చేసుకోవాలని నిర్ణయించుకొంది. అయినా తన దేశంలోని వారిని గూర్చిన చింత ఆమెను అడుగు ముందుకు వెయ్యనివ్వలేదు. బ్రిస్టల్‌లో 1835లో "వర్కింగ్ అండ్ విజిటింగ్ సొసైటీ" ఏర్పరచి ఇరవై ఏళ్ళు సెక్రెటరిగా సేవలందించింది. ఈ సమాజంలోని స్త్రీలు పేద ప్రజల ఉనికిని గుర్తించి ఒక్కొక్క భాగంలో కొంతమంది పనిచేస్తూ వారికి విద్యాబుద్ధులు నేర్పించారు. ఇలా చాలా ఏళ్ళు గడిచాయి.

1839లో డాక్టర్ గారి ఆరోగ్యం మరింత క్షీణించటంతో డాక్టర్ల సలహాతో యూరప్ దేశయాత్రకు వెళ్ళారు. తూర్పు ముద్ర తీరప్రాంతాలలో పర్యటిస్తూ 1840లో ఓడపై నుండి సముద్రంలోకి దూకి చనిపోయాడు. తండ్రి మరణం బాధించినా తన సేవా ధర్మాన్ని మేరీ మానలేదు. నేరస్తుల వద్దకు వెళ్లి వారికి ధర్మం నీతి బోధించి వారిలో గొప్ప పరివర్తన తెచ్చింది. ధార్మిక సేవను తండ్రి మరణం తర్వాత చేబట్టింది. 1846లో "రగ్గడ్" స్కూల్ స్థాపించింది. యావజ్జీవ కారాగార వాసంలో ఉన్న నేరస్తులైన ఖైదీలకు తాను ఇతోధిక సేవ చేయాలనే గాఢ సంకల్పం ఆమె మనసులో పడింది. దానికోసం తీవ్రంగా ఆలోచించింది. దోషాలు చేస్తున్న ఉన్నత కులాలకు చెందినవారికి నేరస్తులకు ఉపయోగపడే పాఠశాలల విషయమై 1851లో "Reformatory schools for the children of perishing and dangerous classes and for juvine offenders ane" పుస్తకం రాసి ప్రచురించింది. దీనిపై స్పందించిన ప్రభుత్వం కారాగారాలలో దోష నివారక విద్యాలయాన్ని స్థాపించటానికి అనుమతినిచ్చింది. 1853లో "Juvenile delinquents, their condition and treatment" పుస్తకం రాసి ప్రచురించింది.

జైలు స్కూళ్ళలో పనిచేసే ఏర్పాటు కూడా మేరీ చేసి అందరి అభిమానం పొందింది. నేరాలు తగ్గుముఖం పట్టాయి. ఇంగ్లాండ్‌లో అంతవరకు ఎవరూ చేయని సాహసకార్యం చేసి, మేరీ కార్పెంటర్ అందరి దృష్టిని ఆకర్షించింది. ఆమె బోధనల వల్ల ప్రభావితులై ఎందరో బాల బాలికలు తమ జీవిత సరళిని గణనీయంగా మార్చు తెచ్చుకొన్నారు. ఆమెకెంతో రుణపడి ఉన్నారు వీరందరూ. మేరీ ప్రభావంతో 1846లో లయన్ మీడ్ అనే ఆయన ఆరేళ్ళకు రసెల్ స్కాట్ కింగ్స్ ఫుడ్‌లో పేదల బడిని నెలకొల్పారు. అవే బీదల పాఠశాలలుగా సేవలందించాయి.

1854లో బ్రిటిష్ రాజు లార్డ్ బైరస్ బ్రిస్టల్ నగరంలో ఒక బాల స్త్రీ నేరస్తుల దోష నివారణ కోసం ఏర్పాటు చేసే గృహానికి విశాల మందిరాన్ని కొని ఇచ్చాడు. మొదట్లో

పదిమందితో ప్రారంభమైన గృహం ఒక్క ఏడాదికే యాభైమందికి ఆవాసంగా మారింది. మారుమూల ప్రాంతాలలో ఉన్న పాపాలతో మగ్గిపోతున్న ఎందరో నిర్భాగ్యులు ఇందులో చేరి జీవన శైలిని మార్చుకొన్నారు. వీరందరి బాగోగులు స్వయంగా తీర్చిదిద్దిన ఘనత మేరీ కార్పెంటర్‌దే. ఎంత నీచ స్థితిలో ఉన్న పిల్లలనయినా ఆమె అక్కున చేర్చుకొని వారి జీవితాలను బాగుచేసింది. స్వేచ్ఛను ఇస్తూనే వారికి కుటుంబ వ్యవస్థలో భాగస్వామ్యం కల్పిస్తూ ప్రేమతో ఆదరిస్తూ వారిని మంచి మార్గంలోకి మళ్ళించాలని మేరీ భావన. ఆమె కృషి ఫలితాలే 1854లో వచ్చిన "యూత్‌ఫుల్ అఫెండెర్స్ యాక్ట్" మరియు 1857లో ఏర్పాటైన "ఇండస్ట్రియల్ స్కూల్స్ మరియు వర్కర్స్ హాల్స్" ఆమె ధ్యేయం. పనితో కూడిన విద్యా మరియు పనిలోనే విరామానందం.

మేరీకి యాభై ఏళ్ళ వయసులో తల్లి మరణించింది. జీవిత కాలమంతా సేవలోనే గడపాలని వివాహం చేసుకోరాదని కన్యగానే ఉండిపోవాలని నిర్ణయించుకొంది. సగం భోజనంతోనే ఆమె ముగ్గురు మనుషుల పనిచేస్తుంది అని పేరు పొందింది. తనకు చేదోడు వాదోడుగా ఉండటానికి ఒక బీద బాలికను చేరదీసి పెంచుకుంది. 1861లో ఐర్లాండ్ దేశం వెళ్లి అక్కడి జైలు పరిస్తితులను అధ్యయనం చేసి "మన ఖైదీలు" అనే పేర రెండు సంపుటాలు రాసి ప్రచురించింది. అరవయ్యేళ్ళు వచ్చేసరికి భారతదేశం వచ్చి అక్కడివారికి తన సేవలందించాలని నిశ్చయించుకొన్నది.

1866లో ఇండియా చేరి బొంబాయి, అహమ్మదాబాద్, సూరత్‌లను సందర్శించి స్త్రీ విద్య బాలబాలికా విద్యా బోధన గురించి అన్నీ తెలుసుకొన్నది. తర్వాత పూనా, మద్రాస్ నగరాలను చూసి కలకత్తా చేరి లార్డ్ లారెన్స్‌కు అతిథిగా ఉంది. మళ్ళీ బొంబాయి చేరి పౌర సన్మానం అందుకొన్నది. 1867లో స్వదేశం ఇంగ్లాండ్ చేరింది. తన ఇండియా పర్యటనలో విశేషాలను ఇక్కడి స్త్రీ విద్యను గురించి కొన్ని సూచనలు చేస్తూ పుస్తకం రాసింది.

మరుసటి ఏడాది "ఇండియాలో ఆరు నెలలు" పుస్తకం రాసి రామమోహన రాయ్‌కి అంకితమిచ్చింది. ఇండియాలోని ప్రముఖులతో ఉత్తర ప్రత్యుత్తరాలు నడిపింది. బొంబాయి చీఫ్ జస్టిస్ గోపాలరావు హరి దేశ్‌ముఖ్ రాసిన లేఖవల్ల ఆమె బొంబాయిలో స్త్రీలకోసం బోధనాభ్యసన పాఠశాల ఏర్పాటు చేయాలని భావించింది. ప్రభుత్వంతో చర్చలు జరిపి సంవత్సరానికి పన్నెండు వేల రూపాయల చొప్పున అయిదేళ్ళు ప్రభుత్వం గ్రాంటు ఇచ్చే ఏర్పాటు చేసింది. 1868లో మళ్ళీ రెండవసారి ఇండియా వచ్చింది. స్త్రీ బోధనాధ్యయన పాఠశాలకు అంటే లేడీ ట్రైనింగ్ స్కూల్‌కు అధ్యక్షురాలుగా పనిచేసి దాన్ని తీర్చిదిద్దటంలో నిమగ్నమైంది. జీతం ఏమీ తీసుకోకుండా స్వచ్ఛందంగా పనిచేసిన ఆదర్శవంతురాలు మేరీ కార్పెంటర్. మళ్ళీ స్వదేశం చేరింది.

1870లో కేశవ చంద్రసేన్ ఇంగ్లాండ్‌కు వెళ్లి మేరీ కార్పెంటర్‌ను కలిసి ఇండియాలో సాంఘిక దురాచారాలను రూపుమాపటానికి జ్ఞానాన్ని వృద్ధి చేయటానికి ఒక సమాజం స్థాపించమని కోరాడు. అప్పుడే బ్రిస్టల్ నగరంలో "నేషనల్ ఇండియన్ అసోసియేషన్" ఏర్పడింది. భావాలను ప్రకటించటానికి "ఇండియన్ గెజెట్" అనే పత్రికనేర్పరచి తర్వాత ఆ బాధ్యతను మిస్ మానింగ్ అనే సమర్థురాలికి అప్పగించింది. 1875-76లో నాల్గోసారి ఇండియా సందర్శించింది మేరీ. జైలు జీవితాన్ని గురించి, వృత్తి విద్యను గురించి బాగా అధ్యయనం చేసి లార్డ్ సాలిస్ బారికి ఒక ఉత్తరం రాసింది. 1877లో ఏప్రిల్ మూడున డెబ్బైవ జన్మదినోత్సవం నాడు ఆమెను ఆశీర్వదిస్తూ, అభినందిస్తూ అనేకులు బహుమతులందజేశారు. జూన్ 14న ఆమె అనాయాస మరణం పొందింది. ఆమె మరణానికి శోకించనివారు లేరు. ప్రపంచవ్యాప్తంగా ఆమె సేవను కొనియాడారు. ఆమె అంత్యక్రియలకు వేలాది జనం పాల్గొని శ్రద్ధాంజలి ఘటించారు. బీద, నేర, పాపులను సక్రమ మార్గంలో నడవటానికి ప్రేమ, త్యాగం, దీక్షా, అంకితభావంతో కృషి చేసేవారి పాలిటి పరమ కృపాళువు అనిపించుకుంది మేరీ కార్పెంటర్. ❋

**(విహంగ మహిళా వెబ్ మాసపత్రికలో ప్రచురితం)**



## 39. అగతా క్రిస్టీ

**ఈ** పేరు వినగానే డిటెక్టివ్ నవలా రాణి జ్ఞాపకం వస్తుంది. అగతా క్రిస్టీ రాసిన అపరాధ పరిశోధక నవలలు బైబిల్, షేక్స్పియర్ రచయల తర్వాత అంతగా బిల్లియన్ల సంఖ్యలో అమ్ముడయ్యాయి. ఆమె మొదట నర్సుగా పనిచేసింది. పద్యాలూ రాసింది. మామూలు నవలలూ రాసింది. ఆమె తన లాబరేటరిలో ఉన్న మందుల గురించి ఈ కింది పంక్తులను రాసుకొన్నది. "Beware of the power that never die through men may go their way-the power of the drug for good or evil shall itever pass away" 1926లో "Amnesisia" జబ్బు వచ్చి నిద్రలోనే వెళ్లిపోయేది. మొదట క్రిస్టీ అనే అతన్ని పెళ్ళాడి 14 ఏళ్ళ తర్వాత విడాకులు పొంది, మేల్లాన్ అనే వాడిని పెళ్ళి చేసుకొని జీవితాంతం కాపురం చేసింది. నిత్య జీవితంలోని ప్రతి చరిత్రనూ రాసుకొంది. అయితే తనను గురించి మాత్రం ప్రచారం చేసుకోలేదు. చాలా మర్యాదగా, బిడియంగా ఉండేది. "The older you get, the more interesting you become to an Archeologist" అంటుంది క్రిస్టీ. ఏ నవల అయినా ఆమె టైప్ చేసి ఆరు వారాల్లో ఇచ్చసేది ప్రచురణ కోసం. అంత స్పీడ్ ఉన్న రచయిత్రి. తన జీవితంపై తానే జోక్ వేసుకొంటూ "A sausage machine, a perfect sausage machine" అనుకోవటం ఆమెకే చెల్లింది. (మాంసం కూర తయారు చేసే యంత్రం). కనీసం ఏడాదికి రెండు పుస్తకాలు రాసి ప్రచురించేది. ఆమెను "ఆఫీసర్స్ క్లాస్" రచయిత్రిగా గుర్తించారు. తన చిన్నతనాన్ని గూర్చి ఆమె ఒక పద్యం రాసుకొంది. "Agatha pagatha may black hen - she lays eggs for gentlemen - she laid six and she laid seven - and she laid eleven" అని రాసి తండ్రికీ, అక్క చెల్లెళ్ళకు చదివి వినిపించి అందర్నీ నవ్వించేది. నిజంగానే "అగాతా కోడి అనేక నవలా గుడ్లు పెట్టింది".

85 ఏళ్ళ నిండు జీవితం గడిపి 1976 జనవరి 12న మరణించింది.

అసలు పేరు “డెం ఆగతా మేరీ క్లారిస్సా క్రిస్టీ”. 15–09–1890లో జన్మించింది. డిటెక్టివ్ నవలలతో బాటు అనేక కథలూ, నాటకాలూ రాసింది. “మేరీ వేస్మా కాట్” అనే మారు పేరుతో ఆరు రొమాంటిక్ నవలలూ రాసిన నవలా మణి ఆమె. 66 డిటెక్టివ్ నవలలు, 15 చిన్న కథా సంపుటాలు ఆమె రాసి వెలువరించింది. ఆమె రాసిన “మర్డర్ ఆన్ ది ఓరియంటల్ ఎక్స్‌ప్రెస్”, “డెత్ ఆన్ ది నైల్” మంచిపేరు తెచ్చుకొన్నాయి. ప్రపంచంలోనే దీర్ఘకాలం ఆడుతున్న నాటకం “మౌస్ ట్రాప్” రాసిన ఘనత క్రిస్టీది. ఎగువ మధ్య తరగతి సంపన్న కుటుంబంలో జన్మించింది. మొదటి ప్రపంచ యుద్ధంలో నర్సుగా పనిచేసింది. అన్ని కాలాలలోను ఆమె నవలలు హాట్ కేక్స్‌గా అమ్ముడయ్యాయని గిన్నీస్ బుక్ రికార్డులో ఉంది. ఆమె రచనలు 103 భాషల్లోకి అనువదింపబడ్డాయి అంటే ఆమె ప్రభావం ఎంత విస్తృతమో తెలుస్తోంది. ఆమె నవల “And there were none” ఇప్పటికి 100 మిలియన్ల కాపీలు అమ్ముడయా రికార్డ్ సృష్టించింది. 1971లో ఎలిజబెత్ మహారాణి ఆమెను “Dane”గా ప్రకటించి రాజభవనం బకింగ్ హాం పాలెస్‌లో సన్మానించింది. క్రిస్టీ రాసిన “మౌస్ ట్రాప్” నాటకం లండన్‌లోని “అంబాసిడర్ థియేటర్”లో 1952 నవంబర్ 25న ప్రదర్శన ప్రారంభమై ఈనాటి వరకు అంటే 60 ఏళ్ళ పాటు నిరంతరం నాన్ స్టాప్‌గా ప్రదర్శింపబడుతోంది. 25,000 ప్రదర్శనలు దాటింది. 1955లో “మిస్టరి రైటర్స్ ఆఫ్ అమెరికా” అవార్డును పొందిన మొదటి రచయిత అనిపించుకొన్నది. ఇది చాలా అత్యున్నత గౌరవం. గ్రాండ్ స్టార్ అవార్డును, “Witness for prosecution” అవార్డులను అందుకొన్నది. ఆమె రాసిన ఎన్నో నవలలు, కథలు సినిమాలుగా టి.వి. షోలుగా వచ్చాయి. రేడియోలలో, వీడియో గేమ్స్‌లోను ప్రదర్శింపబడ్డాయి. ఎనలేని కీర్తి, ప్రతిష్ట, గౌరవం, ధనం సంపాదించిన బంగారు బాతు, అపరాధ నవలా రాణి ఆగతా క్రిస్టీ. ❀



## 40. మానవ సేవకు మారు రూపు మదర్ కాబ్రిని

**మ**హానుభావులు అన్ని దేశాలలో ఉంటారు. తమ సేవా కార్యక్రమాలతో ప్రపంచంలోని ప్రజలందర్నీ తమవారిగా భావిస్తారు. తాము చేస్తున్నది దైవ కార్యమనే భావించి చేస్తారు. గొప్పతనాన్ని తమకు ఆపాదించుకోరు. తమను నడిపించి, చేయిస్తున్న దైవానికే ఆ కృతజ్ఞతలు, ప్రశంసలు దక్కాలని అనుకొంటారు. వారి సేవకు ఒక దేశం పరిమితం కాదు. ప్రపంచమంతా విస్తరించి ప్రజా హృదయాలను గెలుచుకొంటారు. తాము భగవంతుని పరికరాలమేనని వారి భావన. అలాంటి మానవ సేవా తత్పరురాలు ఇటలీ దేశానికి చెందిన మదర్ ఫ్రాన్సెస్ కాబ్రిని. ఆమె గురించే మనం ఇప్పుడు తెలుసుకొంటున్నాం.

మేరియా ఫ్రాన్సెస్ కాబ్రిని 1850లో జులై 15న ఇటలీ దేశంలోని మిలన్‌కు దగ్గరలో డీజియానోలో జన్మించింది. తండ్రి అటస్టినో. తల్లి స్టెల్లా కాబ్రిని. పదకొండు మంది సంతానంలో ఏడుగురు చిన్నతనంలోనే చనిపోయారు. తల్లికి 41 ఏళ్ళవయసులో కాబ్రిని గర్భస్థ సమయం కంటే రెండు నెలలు ముందుగానే బలహీనంగా పుట్టింది. ఆమెను ఎంతో జాగ్రత్తగా ఆ దంపతులు పెంచారు. కుటుంబం అంతా కాథలిక్ మతానికి అంకితమైనది. ఇంటి పనులన్నీ కాబ్రినే చేసి తల్లికి సాయపడేది. అందుకని చదువు అంతగా అబ్బలేదు. ఆటపాటలూ ఒంటబట్టలేదు. అర్భకురాలు. ఆనాదున్న సాంప్రదాయం ప్రకారం ఈమెకు ఏడవ ఏటనే కాథలిక్ మత దీక్షనిచ్చారు. ఆ దీక్షా సమయంలో ఆమెలో గొప్ప అనుభవం కలిగింది. దానిని మాటలలో చెప్పలేకపోయింది. ఆనాడు ఇటలీ అంతా సమైక్యమవటానికి

సిద్ధమవుతోంది. ఈమెను పదమూడవ ఏట మిలన్‌కు పడమర ఉన్న "డాటర్స్ ఆఫ్ సేక్రెడ్ హార్ట్స్" నిర్వహిస్తున్న కాన్వెంట్ స్కూల్‌కు పంపారు. ఆమెను చేర్చుకోవటానికి సుపీరియర్ తిరస్కరించాడు. దానికి ఆమె అనారోగ్యం ఒక కారణం. రెండోది ఈమె కొన్ని ఏళ్ళలో స్వంతంగా ఒక మత సంస్థను ఏర్పరుస్తుందేమోననే అనుమానం.

ముందు తండ్రి, ఆ తర్వాత తల్లీ మరణించారు. ఆదరించే బాబాయి కూడా చనిపోయాడు. అనాధగా మిగిలిపోయింది. ఈ బాధలన్నీ మరిచిపోవటానికి నిరంతరం దైవ సాన్నిధ్యంలో గడపటం ప్రారంభించింది కాబ్రిని. స్కూలు పిల్లలకు నీతి, మతధర్మాలను బోధించేది. బాధలతో ఉన్నవారిపై సానుభూతి చూపింది. ఊరికి దూరంగా ఉంటూ ఎవరూ పట్టించుకోని ఒక కేన్సర్ బాధితుడికి సేవ చేసి నయం చేసింది. మసూచికం ఆ ప్రాంతంలో విజృమ్భించిన సమయంలో దాని బారిన పడిన వందలాది మందికి సేవలందించి తానూ ఆ వ్యాధికి గురైంది. ఆమెకు తోడుగా ఉన్న రోసా సేవలతో మళ్ళీ మామూలు మనిషి అయింది. అసలే అనారోగ్యం. దీనికి తోడూ ఈ వ్యాధి సోకి తగ్గింది. అందుకని ఏ స్కూల్‌లోను ఆమెను చేర్చుకోలేదు. దీనికి కారణం ఆ నగర మేయర్‌ను కాథలిక్ మతంలోకి మార్చటం. కాబ్రినికి క్రమంగా మిషనరీ "నన్"గా మారాలనే సంకల్పం బలీయమైంది. హౌస్ ఆఫ్ ప్రావిడెన్స్‌లో చేరి "సిస్టర్ సేవేరియా కాబ్రిని" అయింది. అక్కడ రెండవ స్తానం పొందింది. ఆమెకు అనాధలకు విద్య నేర్పటం మత దీక్షనివ్వటం అప్పగించారు.

బిషప్ జేల్మిని ఈమెలోని దీక్షకు, సేవాతత్పరతకు అబ్బురపడి కాబ్రిని 1877లో 'మదర్ సుపీరియర్ ఆఫ్ హౌస్ ఆఫ్ ప్రావిడెన్స్' అనే అత్యంత గౌరవనీయమైన పదవిని ఇచ్చాడు. కొద్దిమందికి ఇది అసూయకు కారణం అయింది. ఆమె జీవితాన్ని నరకప్రాయం చేశారు కూడా. అప్పటికి ఆ సంస్థ ఆధ్యాత్మిక కార్యక్రమాలకు మాత్రమే పరిమితమైంది. దాని నిర్వాహకుడు "తొండిని" సంస్థ నిధులన్నీ స్వాహా చేశాడు. ఈ పరిస్థితులలో మదర్ కాబ్రిని తన స్వంత సంస్థను తన సేవా ధర్మాలకు అనుగుణంగా ఏర్పాటు చేయాల్సిన పరిస్థితి కలిగింది. వెంటనే "సేలేశియన్ మిషనరీస్ ఆఫ్ సేక్రేడ్ హార్ట్స్ ఇన్స్టిట్యూట్"ను స్థాపించింది. దీనినే ఆ తర్వాత "ది మిషనరీ సిస్టర్స్ ఆఫ్ ది సేక్రేడ్ హార్ట్స్ ఆఫ్ జీసస్"గా మార్చింది.

ఫ్రాన్సెస్ కాబ్రినికి "మదర్ మేరీ" అనుక్షణం స్ఫూర్తినిస్తూండేది. 1887లో రోమ్ నగరానికి వెళ్లి అక్కడ ఒక సంస్థను ఏర్పాటు చేయటానికి పోప్‌గారి అనుమతి పొందింది. ఆమెను ఎన్నో సంస్థలు ప్రోత్సహించి ఆమె సేవా సంస్థలను దేశమంతా విస్తరిల్లజేయమని అభ్యర్థించాయి. అప్పటికి ఆమె సంస్థ చర్చి ఒప్పుకొన్న మహిళా సంస్థలలో రెండవది అయింది. ఆ కాలంలో ఆడవారు క్రిస్టియన్ మత ప్రచారానికి తగినవారు కారనే అభిప్రాయి బలంగా ఉండేది. ఆ అభిప్రాయాన్ని కాబ్రిని తప్పు అని రుజువు చేసింది. మగవారు నిర్వహించే

కార్యక్రమాలకంటే మహిళలు నిర్వహించేవే ఉత్తమోత్తమమైనవని రుజువు చేసింది. ఇది ఆమెకు ఒక సవాలుగా నిలిచింది. ఎన్ని అడ్డంకులెదురైనా తన పని తాను దైవ కృపతో చేసుకొని ముందుకు సాగింది. ఎన్నో మత సంస్థలు ఆమెకు బాసటగా నిలబడ్డాయి. అవసరమైన డబ్బు, పరికరాలు, స్థలం అన్నీ సమకూర్చినాయి. ఆమె సేవకు తామూ తోడ్పడ్డాయి. కొద్దిరోజులకే అక్కడి కార్డినల్ బీద పిల్లలకు ఒక స్కూల్‌ను, దాంతోబాటు ఒక కిండర్ గార్డెన్ స్కూల్‌ను ప్రారంభించమని కోరాడు. ఆమె ఆ పని దిగ్విజయంగా నిర్వహించి అందరి అభిమానం సంపాదించింది. క్రమంగా మదర్ కార్యక్రమాలకు విశేష స్పందన విశ్వవ్యాప్తంగా లభించింది.

అమెరికా, యూరప్ దేశాలవారు తమ దేశాలలో ఆమెను చారిటబుల్ సంస్థలను నెలకల్పమని అభ్యర్థించాయి. ఆమె మనసులో చాలాకాలం నుండి చైనాలో ఏర్పాటు చేయాలని అనుకొన్నది కాని దేవేచ్ఛ. అమెరికాలో తన సేవా కార్యక్రమాలను విస్తరించటానికి నిర్ణయించుకొంది. అప్పటికే ఆమె విపరీతంగా పనిచేసి అలసిపోయింది. ఆరోగ్యమూ బాగాలేదు. అమెరికాలోని న్యూయార్క్ సిటీ దాని పరిసరాలలో ఇటాలియన్ ఇమ్మిగ్రెంట్స్ చాలా ఇబ్బందులకు గురి అవుతున్నారు. సరైన విద్యా, వైద్య సౌకర్యాలు వారికి లేవు. వారికి సేవలందించాలన్న ధ్యేయంతో కాబ్రిని 1889లో అమెరికాకు కొద్దిమంది సిస్టర్స్‌తో చేరుకొన్నది. ఆహ్వానించిన వారే మొహం చాటేశారు. అంతా కొత్త. కాని ఆమె అధైర్యపడలేదు. తన పని తాను ప్రారంభించింది. నెమ్మదిగా అక్కడి సంస్థలు సహకారం అందించటం ప్రారంభించాయి. పోప్‌లియో కూడా ఆమెకు బాసటగా నిలిచాడు.

సిస్టర్స్ వీధిలో తిరిగి అడుక్కొంటూ సాయం రాబట్టారు. వీరిని చూసి మిగిలిన వారు ముందుకొచ్చారు. ఒకచోట మంచి వాతావరణంలో సంస్థ నేర్పరచారు. ఉదయం అయిదింటికే కార్యక్రమాలు మొదలు. ఆ తర్వాత ప్రార్థన. తర్వాతా విద్యాబోధనా, ఆరోగ్య సూత్రాలు తెలియజేయటం. ఇటాలియన్ ఇమ్మిగ్రంత్సకు గొప్ప ఊరట కలిగింది. కొద్దికొద్ది మొత్తాలను ఆహార పదార్థాలను సేకరించేవారు.

తరువాత ఆమె అనాధాశ్రమం స్థాపించింది. అది అనాధలకే కాక బాధితులకు, అసహాయులకు, అండగా నిలిచింది. సెయింట్ జోచిమ్స్ చర్చి ద్వారా రెండు వందల మంది పిల్లలకు సేవలందించింది. ఆ తర్వాత బ్రూక్లిన్‌లో స్కూల్ పెట్టింది. స్థానికులకు దేనిలోనూ ఇటాలియన్లు తీసిపోరని రుజువు చేయించింది. న్యూ ఆర్లియాన్స్, , డెన్వర్, లాస్ ఆంజెల్స్, ఫిలడెల్ఫియా, న్యూయార్క్, సియాటిల్‌లలో ఉచిత విద్యాలయాలను నెలకొల్పింది. విద్యతో బాటు వైద్యం, ఆధ్యాత్మిక చింతనలను అందించింది. ఆదివారం బడులు నిర్వహించింది. వృత్తి విద్యాలయాలను నెలకొల్పింది. యువజన విద్యా, నేరగాళ్ళకు విద్యాబోధనా కూడా ఆమె నిర్వహించిన వాటిలో ముఖ్యమైనవి. ఆమె సేవా సంస్థలకు అనూహ్యంగా దాతలు

భూరి విరాళాలను సమర్పించి జన్మ ధన్యం చేసుకొనేవారు. డబ్బు కొరత అనేది మదర్ సంస్థలకు ఎప్పుడూ కలగలేదు. అవసరమైతే సిస్టర్స్ వీధుల్లో బిచ్చం ఎత్తి విరాళాలు సేకరించేవారు.

మదర్ కాబ్రిని నికారుగ్వా, బ్యూనస్, పనామా, బ్యూనస్ ఐర్స్, అర్జంటినాలలో స్నేహ యాత్ర జరిపింది. కంచర గాడిదలపై ఆండీస్ పర్వతాలలో సంచరించింది. వెళ్ళిన ప్రతిచోటా అవసరమైన కేంద్రాలను స్థాపించి సాయపడింది. ప్రపంచం అంతా ఆమెను “లా మదర్” అంటే “మాతృదేవత” అని ఆప్యాయంగా పిలుచుకొనేవారు. అందరిపై అపారమైన కరుణా, ప్రేమా ఆమె చూపేది. బాధితులకు సానుభూతి ఆమె నైజం. సకల ప్రాణుల మీద ఆమెకు అపారమైన కరుణ ఉండేది. తన కార్యక్రమాలను “హృదయానికి చేసే విద్య”గా భావించేది. విద్య అంటే ప్రేమను కురిపించటమే అనేది ఆమె.

బ్రజిల్ దేశంలో పర్యటించినప్పుడు మదర్‌కు మలేరియా సోకి చాలాకాలం బాధపడింది. 1912లో మళ్ళీ సేవా కార్యక్రమాల కోసం అమెరికా వెళ్ళింది. మొదటి ప్రపంచ యుద్ధ సమయంలో అమెరికా నుంచి బయటి దేశాలకు వెళ్ళే అవకాశం ఆమెకు లభించలేదు. 1938లోనే ఆమెకు ‚Beatified‛ (declared sacred) లభించింది. 1946 జూలై 7న మదర్ కాబ్రినిని ఆమెరికాకు మొదటి పౌరురాలుగా రోమన్ కాథలిక్ చర్చ్ “సెయింట్” హోదానిచ్చింది. 1917 డిసెంబర్ 22న 67వ ఏట మదర్ కాబ్రిని తుది శ్వాస విడిచింది. చనిపోయిన తర్వాత కూడా ఆమె ప్రభావం ఇసుమంత కూడా తగ్గలేదు. ఆమె పేర ఎన్నో హైస్కూళ్లు, ఆస్పత్రులు వెలిశాయి. చర్చిలను కూడా ఆమె పేర పెట్టి గౌరవించారు. ఆమెను మదర్ ఫ్రాన్సెస్ క్సేవియర్ గాబ్రిని అని ఆత్మీయంగా ప్రపంచమంతా పిలుచుకొంటారు. ఎందరికో ఆమె సేవా తత్పరత ఆదర్శనీయమైంది. ప్రేమకంటే ఏ త్యాగము గొప్పది కాదని కాబ్రిని భావించింది. భగవంతుడే మన చేత అవసరమైన కార్యక్రమాలు నిర్వహిస్తాడు అని చెప్పేది. ❋

**(విహంగ మహిళా వెబ్ మాసపత్రికలో ప్రచురితం)**




## 41. లాటిన్ అమెరికా రచయిత్రి - ఇసాబెల్ అలెండీ

**ఉ**త్తర అమెరికాలోని మెక్సికో, హోండూరస్, నికారుగ్వా, కోస్టారికా, పెనామా, దక్షిణ అమెరికాలోని వెనిజుల, కొలంబియ, ఈక్వెడార్, పెరు, బ్రెజిల్, బొలీవియ, పరాగ్వే, అర్జంటినా, చిలీ, ఉరుగ్వే దేశాలను లాటిన్ అమెరికా దేశాలని అంటారు. ఈ దేశాల రచయితలు 1960 నుండి ప్రపంచ దృష్టిని ఆకర్షించారు. ఇందులో స్పానిష్, పోర్చుగీస్ భాషలు మాట్లాడేవారే ఎక్కువ. వీటిని స్పెయిన్ పోర్చుగీసు దేశాలు ఆక్రమించటం వల్లనే ఈ భాషలు నిలిచినాయి. క్రీ.శ.1500 ప్రాంతంలో 300 ఏళ్ళు యూరోపియన్ కాలనీలుగా ఉన్న దేశాలివి. 19వ శతాబ్దంలోనే విముక్తి పొందాయి. యూరప్‌లోని అన్ని ప్రాంతాల జనాలవారు వలస రావటంతో ఆవాస భూములయ్యాయి. ఎక్కువ మందికి స్పానిష్ మాతృభాష. బ్రెజిల్‌లో మాత్రం ఇంగ్లీష్, ఫ్రెంచ్, డచ్ భాషలు మాట్లాడుతారు.

ఈ దేశాలన్నీ యుద్ధాలతో, అంతర్యుద్ధాలతో అతలా కుతలమైపోయాయి. నిలకడగా ఏ ప్రభుత్వమూ లేదు. వీళ్ళ రచనల్లో "మాజికల్ రియలిజం" ఎక్కువగా ఉంటుంది. అంతర్యుద్ధాల వల్ల రచయితలూ ఇతర దేశాలలో తల దాచుకొనేవారు. ఇందులో కొందరు సాహిత్యంలో నోబెల్ ప్రైజ్ సాధించినవారు కూడా ఉన్నారు. వారిలో కొందరి గురించి సంక్షిప్తంగా తెలుసుకొందాం.

ఇసాబెల్ అలెండీ చిలి దేశపు రచయిత్రి. 1942 జననం. చిలి అధ్యక్షుడు అలెండీకి బంధువే. పదిహేనేళ్ళ వరకు అనేక దేశాలు తిరగాల్సి వచ్చింది. అనేక భాషలు నేర్చుకోవాల్సి వచ్చింది. అనేకమంది స్నేహితులేర్పడ్డారు. దీనికి కారణం చిలిలో రాజకీయ అస్థిరత్వమే.

ఏ ప్రభుత్వమూ నిలకడగా లేదు. సైనిక పాలనలో జనం ఉక్కిరిబిక్కిరి. అలెండీ హత్యతో మరీ దిగజారిపోయింది దేశం. 1970లో సాల్వేడార్ చేరింది. అలెండీ దేశాధ్యక్షుడయ్యాడు. కాని మిలిటరీ వ్యూహం వల్ల 1973లో హత్య గావింపబడ్డాడు. దీనికి అమెరికా కూడా కారణమేనని అన్నారందరూ. అలెండీకి సోషలిస్ట్ భావాలు ఎక్కువే. దానితో పాలనా పరమైన మార్పులు తెచ్చి ప్రజల మనిషిగా నిలిచాడు. ఆయన ప్రెసిడెంట్‌గా ఉన్నప్పుడు ఇసబెల్ ఆయనతో విందు ఆరగించింది కూడా. భర్త విల్ గార్డెన్. "The house of the spirits, city of the beasts, eeva luna daughter of fortune" మొదలైన నవలలు రాసింది. ఆమె రచనల్లో మాజిక్ రియలిజం ఉంటుంది. ఆమెకు నేషనల్ ప్రైజ్ ఫర్ లిటరేచర్, కామన్ వెల్త్ అవార్డ్, అమెరికన్ బుక్ అవార్డులు లభించాయి. యునైటెడ్ నేషన్స్‌కు చెందిన ఫుడ్ అండ్ అగ్రికల్చర్‌కు చిలిలో పనిచేసింది. చనిపోయిన తన కూతురు పోరా పేరిట ఇసాబెల్ అల్లెండీ ఫౌండేషన్ స్థాపించి సేవా కార్యక్రమాలు చేస్తోంది. ❁



## 42. సాహితీ నల్ల వజ్రం - మాయా ఏంజేలో

**A**ll my work is meant to say ëíYou may encounter many defeats, but you must not be defeatedíí అనేది నల్లజాతి మహారచయిత్రి మాయా ఏంజేలో నినాదం. ఆ స్ఫూర్తితోనే ధ్యేయంతోనే గడిపింది. అంతేకాదు అడ్డు అయ్యే ప్రతి సమస్య ఒక సవాలై, ఒక అనుభవమై జీవిత పురోగతికి తోడ్పడుతుందని చెప్పింది. దీనివల్ల వైవిధ్య దృక్పథం కష్ట సహిష్ణత వస్తాయని నమ్మింది. తన జీవిత రేఖను "fighting defeat"గా అభివర్ణించింది. ఆరడుగుల అందహీనురాలు ఏంజేలో. కవి, రచయిత్రి, నాటక రచయిత, ఎడిటర్, పెర్ఫార్మర్, సింగర్, ఫిలిం మేకర్, డాన్సర్, టి.వి.పెర్సనాలిటి, విద్యావేత్త, ప్రపంచ దేశాలను ప్రభావితం చేసిన కళా సరస్వతి. ఒక రకంగా కొంతవరకు మన భానుమతి అనవచ్చు.

అమెరికాలోని మిస్సోరిలో 1928 ఏప్రిల్ నాలుగున జన్మించింది. తండ్రి వదిలేసి పోయాడు. తల్లి ఇంకోడితో సంబంధం పెట్టుకొంది. అప్పుడు కుక్లు క్లాక్స్ ఉద్యమం తీవ్రంగా ఉండేది. నిరాశామయ జీవితం. అంతశ్శక్తితో గౌరవంగా జీవించాలని నిశ్చయించుకొంది. కాని విధి వంచిత అయింది. తల్లి బాయ్‌ఫ్రెండే ఈమెను ఎనిమిదేళ్ళ వయసులో రేప్ చేశాడు. అది ఆమెకు దిక్కుతోచని స్తితి, అవమానకరం. తాతమ్మ దగ్గరకు చేరింది గత్యంతరం లేక. జరిగిన చెడు అనుభవానికి నాలుగేళ్ళు మౌనవ్రతం పట్టింది. "బెర్త్ ఫ్లవర్స్" అనే ఆమెతో పరిచయం కలిగింది. కథలు, పుస్తకాలు చదవమని ఆమె చెప్పిన హితబోధ పనిచేసి నిరంతర

పుస్తక వ్యాసంగంలో మునిగింది.

1941లో చెల్లెలితో మళ్ళీ తల్లిని చేరింది. స్కూల్‌లో చేరి డాన్స్ డ్రామా ప్రాక్టీస్ చేసేది. ఒక అనాథ శరణాలయంలో కొంతకాలం ఉంది. ఇక్కడ ఉండటమే తన జీవితంలో సహనానికి నాంది పలికిందని గమ్యం ఏర్పరచుకోవటానికి మార్గమేర్పడిందని చెప్పింది. సిటిబస్ కండక్టర్‌గా ఎంపికైంది. ఈమెయే మొట్టమొదటి లేడీ బస్ కండక్టర్. తాను పరిణితి చెందలేదని, స్త్రీత్వం పూర్తిగా రాలేదని గ్రహించింది. "లేస్బియాన్"గా ఉన్నానేమో అనే సందేహమూ కలిగింది. ఈ సందేహం తీర్చుకోవటానికి తనతో చదివే కుర్రాడిని పిలిచి సెక్స్‌లో పాల్గొంది. కడుపొచ్చి పిల్లాడు పుట్టాడు. వాడికి గే జాన్సన్ అని పేరు పెట్టింది. తల్లి దగ్గర తన కొడుకును వదిలి ఉద్యోగాన్వేషణ చేసింది మాయా. వంటపని వైట్రెస్ పని చేసింది. భుక్తి కోసం వేశ్యా వృత్తినీ చేబట్టింది. మళ్ళీ తల్లిని చేరింది. మాదక ద్రవ్యాల అమ్మకమూ చేసింది. తానిన్ని పనులు చేస్తున్నా చంద్రుని కాంతిలా స్వచ్ఛమైన దానినేనని బతకటానికి చేసిన పనులే ఇవని అంటుంది. తర్వాత సేల్స్ క్లార్క్‌గా పనిచేసింది శాన్‌ఫ్రాన్సిస్కోలో. అక్కడ తెల్లజాతి వారితో పరిచయమేర్పడింది. తోష్ అనే అమెరికన్ గ్రీక్‌తో పరిచయం, పెళ్లి అయ్యాయి. వాడు ఈమెను వంటింటికే పరిమితం కావాలని శాసించాడు. వాడికి దేవుడిపై నమ్మకమూ లేదు. ఈవిడ చర్చికి వెళ్తుంటే వద్దనేవాడు. కలహాల కాపురం. రెండేళ్ళ తర్వాత విడాకులు.

నైట్ క్లబ్‌లో డాన్సర్‌గా, సింగర్‌గా చేరింది. పేరును మాయా యాన్జేలూ నుంచి "మాయా ఏంజేలో"గా మార్చుకొంది. ఈ పేరు క్లిక్ అయింది. కథలు రాయటం ప్రారంభించింది. న్యూయార్క్ చేరింది. అక్కడి రైటర్స్ గిల్డ్‌లో చేరింది. " The heart of a woman" రాసింది. వరుసగా ది, ఫైర్, నెక్స్ట్ టైంలు రాస్తే మంచి ప్రోత్సాహమే లభించింది. దియేటర్‌లో పనిచేసింది. అక్కడే నల్లజాతి హక్కుల పోరాట నాయకుడు మార్టిన్ లూథర్‌కింగ్‌తో పరిచయమేర్పడింది. ఆయన ఉద్యమంపై తీవ్ర ఆసక్తి చూపి దానికోసం ఒక బెనిఫిట్ షో నిర్వహించింది. 1960లో "Make" అనే సౌత్ ఆఫ్రికన్‌తో పరిచయమై దక్షిణాఫ్రికాకు అతనితో వెళ్ళి, పెళ్ళి చేసుకొంది. అక్కడ నాటకాలలో వేషాలు వేసి మంచిపేరు, ప్రఖ్యాతి పొందింది. ఇది వాడికి నచ్చలేదు. వాడు ఇంకో అమ్మాయితో సంబంధం పెట్టుకొన్నాడు. ఇదేమిటి అని ఈమె ప్రశ్నిస్తే అది తమ ఆచారం పొమ్మన్నాడు. పేచీలు, విడాకులు.

ఈజిప్ట్ చేరుకొంది. ''అరబ్ అబ్జర్వర్''లో పనిచేసింది. రేడియోలో ఉపన్యాసాలిచ్చింది. 1961లో కొడుకుతో ఘనా చేరింది. నాలుగేళ్ళు అనేక పత్రికలకు ఆర్టికల్స్ రాసింది. గుర్తింపు లభించింది. ఘనా అధ్యక్షుడు "నుక్రుమా"తో పరిచయం కలిగింది. ఘనా వాళ్లకు బ్లాక్ అమెరికన్లు అంటే ఇష్టం లేదు. మళ్ళీ కాలిఫోర్నియా చేరింది. కథలు, పాటలు, పద్యాలు రాసింది. టి.వి.సిరియల్స్‌లో పాల్గొంది. 1969లో "The po-

etry of Mayo" విడుదల చేసింది. కాన్సాస్ యూనివెర్సిటిలో ఫెలోషిప్ సాధించింది. "I know how the caged bird sings" అనే తన స్వీయజీవిత చరిత్ర రాసుకొంది. మొదటి భాగాన్ని చదివిన బాల్డ్విన్ అనే విమర్శకుడు "Her portrait is biblical study of life in the midst of death" అని గొప్పగా ప్రశంసించాడు.

1971లో "Give me a cool drink before I die"కు పులిట్జర్ బహుమతి వచ్చింది. 1972లో "జార్జియా జార్జియా" సినిమాకు స్క్రీన్‌ప్లే రాసింది. అమెరికా సాహిత్య చరిత్రలో మొదటి నల్లజాతి స్త్రీ రాసిన స్క్రిప్ట్ అది. మూడోసారి "పాంట్" అనే వాడితో పెళ్లి. 1974లో విజిటింగ్ ప్రొఫెసర్ అయింది. 1976లో "All day long" రాసింది, "Roots" సినిమాలో "కిటా కింటే" పాత్రలో గ్రాండ్ మదర్‌గా నటించింది. 1981లో "The heart of a woman"కు మంచి పేరొచ్చింది. తన జీవిత చరిత్రలో అయిదవ భాగానికి "All godís children need travelling shoes" అని పేరు పెట్టింది. ఇది బాగా క్లిక్ అయింది.

1993లో అమెరికా అధ్యక్షుడిగా బిల్ క్లింటన్ పదవీ స్వీకార ప్రమాణం చేసినప్పుడు మాయాను ఆహ్వానించి కవిత చదవమని కోరాడు. "On the pulse of morning" అనే కవితను చదివి సార్థకత తెచ్చింది. ఇప్పటికే ఇరవయ్యవ శతాబ్దపు గొప్ప కవిగా మాయా యాంజేలోకు గుర్తింపు ఉంది. ఆమె రచనలను విశ్లేషిస్తూ "Though Mayaís work is personal, she aspires to be universal" అని శ్లాఘిస్తారు. ఆఫ్రికన్ అమెరికన్ మహిళగా జన్మించి ఎన్నో అవాంతరాలను ఎదుర్కొని జంకు లేకుండా ధైర్యంతో తన ధ్యేయాన్ని సాధించి వివిధ రంగాలలో తన బహుముఖ ప్రావీణ్యతను నిరూపించిన నల్లజాతి వజ్రం మాయా యాంజేలో. ❀



## 43. ఎడిత్ వార్టన్

**అ**మెరికాలోని న్యూ ఇంగ్లాండ్‌లో పుట్టి మానవ నిరాశా నిస్పృహలను, ఆనందంలేని జీవితాలను, వారి కోరికలను, వారి మనస్సులో చెలరేగే భావ సంఘర్షణలను అత్యద్భుతంగా చిత్రించిన రచయిత్రి ఎడిత్ వార్టన్. ఆమె నవలలో, రచనలలో గోతిక్ ఎలిమెంట్స్, వాస్తవికత, పెసిమిజం ఉంది. కంట నీరు తెప్పిస్తాయి.

1892లో జనవరి 24న వార్టన్ సంపన్న కుటుంబంలో పుట్టింది. అసలు పేరు "Edith Newbold jones". ఆ సమయంలో కుటుంబాలు నీటి బుడగలలా ఉబ్బి రప్పున పేలిపోయే స్తితిలో ఉండేవి. వీరు "The 400" అనే పాత తరంకు చెందినవాళ్ళు. "The house of mirth, the custom of the country, the innocence" అన్నీ వీరి సాంఘిక జీవన పోరాటాలను తెలిపేవే. 1870లో టైఫాయిడ్ జ్వరం వచ్చి ఎడిత్‌కు చావు కొద్దిలో తప్పిపోయింది. జర్మని, ఇంగ్లాండ్‌లకు వెళ్లి ఐరోపా సాహిత్యాన్ని మధించింది. తండ్రి దగ్గర ఉన్న అమూల్య పుస్తక భాండాగారాన్ని సద్వినియోగం చేసుకొంది. పన్నెండేళ్ళ వయసులోనే "Fast and loose" నవల రాసింది. గొప్ప చేయి తిరిగిన రచయితా రాసిన రచనా అని అందర్నీ ఆశ్చర్యపరచింది ఆ నవల.

16వ ఏట కవితా వ్యాసంగం మొదలుపెట్టింది. "New money family"కి చెందిన "హారీ"తో పెళ్లి నిశ్చయమైంది. కాని పెళ్లికొడుకు తల్లికి నచ్చనందున పెళ్లి కాన్సిల్ అయింది. తర్వాతా "బెర్రీ" అనే అతనితో స్నేహం చేసింది. ఈ స్నేహం జీవితాంతం

కొనసాగింది. తెడ్డి వార్టన్‌ను వివాహమాడింది. కొత్త దంపతులు బోస్టన్ నగరంలో కాపురం పెట్టారు. ఈమెకు తగిన భర్త కాదు టేడ్డి. అప్పటికే ఈమె మేధ పండిన స్త్రీగా వ్యవహరించేది. అంటే “Mature intellect”. 1889-90లో న్యూయార్క్ నగరంలో కాపురమున్నారు. 1894లో నెర్వస్ బ్రేక్ డౌన్‌తో ఇబ్బంది పడింది. Nausea, exhaustion, melancholyతో ఉండేది. ఆ సమయంలో రాసిన కథల్లో, కవితల్లో ఇవే ప్రతిబింబించాయి.

“ఇంటీరియల్ డెకరేషన్” మీద పుస్తకం రాసింది. 1899లో “The greater inclination” కథలు మంచి గుర్తింపు తెచ్చాయి. కాపురాన్ని మాసాచూసేట్స్‌కు మార్చింది. ఇప్పుడే ఆమె మేధో సర్వస్వం అనిపించే “Ethan Home” నవల రాసింది. తర్వాత “సమ్మర్” నవల రాసింది. ఎడిత్ రాసిన “The house of mirth” నవల1,40,000 కాపీలు అమ్ముడు పోయి ఆమెకు విశేష ప్రాచుర్యం కల్గించింది. ఆరు నెలలు పారిస్‌లో, మరో ఆరు నెలలు అమెరికాలో ఉంది. 1906 ప్రముఖ రచయిత హెన్రి జేమ్స్‌తో పరిచయం కలిగింది. 1890లో భర్తకు దూరమైంది. చిన్ననాటి స్నేహితునితో సహవాసం చేసింది. అతనికి డిప్రెషన్. ఈమె ఆదాయం పైనే వారి కుటుంబం గడవాలి. ఆమె పారిస్‌లో, ఇతను బోస్టన్‌లో ఉన్నారు. భర్త అప్పుల పాలయ్యాడు. ఈవిడ పట్టించుకోలేదు. 1912లో “The reef, the curtain of the country” రాసింది. 1911లో “ఈతాన్ ఫ్రేం” నవల బ్రహ్మాండమైన విజయాన్ని సాధించింది. 1923లో భర్తకు విడాకులిచ్చేసింది. జర్మనీలో కాపురముంది. “రెడ్‌క్రాస్”లో 1917లో చేరి సేవలందించింది. పారిస్‌లో ఉన్న ఇల్లు ధ్వంసం అయింది.

ఎడిత్ వార్టన్ తన జీవిత చరిత్రను “A backward glance” పేర రాసుకొన్నది. 1924లో “ఓల్డ్ న్యూయార్క్” రాసింది. అందులో అమెరికన్ల డబ్బు ఆకలి, నిజాయితీ లేని తనం, కళ మీద వారికున్న నిర్లక్ష్యం, సంస్కృతిపై వారి ఏవగింపులపై విరుచుకుపడి రాసింది. అప్పుడే అమెరికా “లీగ్ ఆఫ్ నేషన్స్”లో అంటే “నానా రాజ్య సమితి”లో సభ్యత్వం తీసుకోలేదు. ఆమెకు “Soul mate and closest literary adviser”గా వ్యవహరించిన “వాల్టర్ బెర్రీ” అనే ఆమె అప్పుడు చనిపోయాడు. 1929లో వచ్చిన అమెరికా ఆర్థిక సంక్షోభం వల్ల ఆమె ఆస్తికేమీ నష్టం కలగలేదు. ఆమె రాయటం ప్రారంభించిన ఆటోబయోగ్రఫీ 1932లో పూర్తి చేసింది. 1937 ఆగస్ట్ పదకొండున ఎడిత్ వార్టన్ ఫ్రాన్స్‌లోని పారిస్ నగరంలో 45ఏళ్ళ వయసులోనే మరణించింది.

ఆమె చనిపోయిన చాలాకాలం వరకు ఎడిత్ రచనలపై ఎవరూ దృష్టి పెట్టలేదు. 1950-60 కాలంలో అమెరికన్లకు ఆమె రచనలపై శ్రద్ధ పెరిగింది. పునర్ మూల్యాంకనం చేయ ప్రారంభించారు. “Her ability to incorporate a whole societyís rituals, struggles and beliefs” తన రచనల్లో ప్రతిబింబింపజేయటానికి అద్భుత కృషి చేసిందని

విమర్శకులు కీర్తి కిరీటం పెట్టారు. ఆమె రచనల్లో డ్రమాటిక్ ఐరనీ ఉండటం ప్రధాన లక్షణం. ఎన్నో కథలను కూడా రాసింది. అందులో దెయ్యాలు, భూతాలు ఉండే రచనలే ఎక్కువ. సుమారు ఇరవై అయిదు నవలలు, మూడు కవితా సంకలనాలు, పదిహేను షార్ట్ స్టోరీ కలెక్షన్స్‌తో బాటు తొమ్మిది నాన్ ఫిక్షన్ రచనలు చేసింది. "The book of the home" అనే జర్నల్‌కు ఎడిటర్‌గా కూడా ఉన్నది. ఆమె ఫ్రెంచ్ ఇంపీరియలిజంను ప్రోత్సహించింది. మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత మొరాకో వెళ్లి అక్కడ సైనికాధికారికి అతిథిగా ఉంది. అక్కడే "మొరాకో" అనే పుస్తకం రాసింది. ఫ్రెంచ్ భాష బాగా మాట్లాడేది. ఆమె రచనలు ఫ్రెంచ్‌లోను వచ్చాయి. ❀



# 44. అన్నే ఫ్రాంక్

16 సంవత్సరాల వయసున్న జర్మనీ బాలిక అన్నే ఫ్రాంక్. తన జీవిత చరిత్రను డైరీగా రాసుకొని దానికి "ది డైరీ ఆఫ్ ఏ యంగ్ లేడీ"ని పేరు పెట్టుకొంది. నాజీల దౌష్ట్యానికి గురైన తన కుటుంబ చరిత్ర అంతా రాసింది అందులో. "I Want to live on after my death" అనే స్ఫూర్తితో రాసిన డైరీ ఇది. అదే ఆమెను చిరంజీవిని చేసింది.

1929 జూన్ పన్నెండున జర్మనిలో "Frankfurt am main"లో ఆటో, ఎడిత్‌లకు జన్మించింది అన్నే ఫ్రాంక్. వారిది జ్యూ కుటుంబం. తండ్రి బిజినెస్ మాన్. అప్పటికే నియంత హిట్లర్ అధికారంలోకి వచ్చాడు. యూదులంటే అతనికి విపరీతమైన ద్వేషం. వారిని అన్ని రకాల హింసలకు గురిచేశాడు. వారి వ్యాపారాలన్నీ ప్రభుత్వపరం చేశాడు. 1939లో రెండవ ప్రప్చ యుద్ధం మొదలైంది. నా జీలు హాలండ్‌ను ఆక్రమించుకొన్నారు. పాపం వీళ్ళ కుటుంబానికి అక్కడా నీడ దొరకలేదు. తీవ్ర నరకం అనుభవిన్చేట్లు చేశాడు దుష్ట హిట్లర్. యూదులంతా ఇంగ్లాండ్‌కో అమెరికాకో పారిపోయారు.

ఆమె నివసించిన అపార్ట్‌మెంట్ జ్యూలు ఎక్కడున్నా వేటాడి చంపించాడు హిట్లర్. 1942లో అన్నే కుటుంబం రహస్య స్తావరాలలో దాక్కోవాల్సిన గతి పట్టింది. తండ్రిని పట్టుకొని నాజీ సైనికులు ఎక్కడికో తీసుకొనిపోయారు. తల్లి అన్నే, సోదరిలకు కొందరు ఆశ్రయం ఇచ్చి

దాచారు. ఈ విషయాలన్ని అన్నే "Secret annex" అన్నది. 1942 జూన్ పన్నెండున ఆమె పుట్టిన రోజు పండుగ. ఎవరో ఒక డైరీని కానుకగా ఇచ్చారామెకు. దానినే తన స్నేహితునిగా భావించి "కిట్టి" అని దాన్ని ముద్దు పేరు పెట్టుకొని దినచర్య రాయటం ప్రారంభించింది. 25 నెలలు అంటే రెండేళ్ళు అజ్ఞాత వాస జీవితం గడిపింది.

యుద్ధ సమయంలో ఎవరైనా డైరీలు రాసుకొని ఉంటే యుద్ధం పూర్తి అయిన తర్వాత వాటిని ప్రచురిస్తామని 1944లో రేడియోలో ప్రకటన వచ్చింది. అయితే ఎవరో కుట్ర చేసి వీరిని పట్టించారు. 1944లో సెప్టెంబర్ మూడున వీళ్ళందరినీ పోలాండ్‌కు గొడ్లను తోలుకు వెళ్లినట్లు తోలుకు వెళ్ళారు. ఆడవాళ్ళను, పిల్లల్ని బట్టలు ఊడదీయించి వర్షంలో నిలబెట్టారు. గాస్ చేంబర్‌లలో పెట్టి లక్షలాది మందిని చంపేశారు నాజీ నియంతలు. "Anne wept when most of us had tears left" అని ఒక అమ్మాయి ఈ సంఘటన గురించి రాసింది.

బట్టలు లేకుండానే వీళ్ళను ఫ్లాష్‌లైట్ వెలుతురు ఎన్నో గంటల సేపులో కూర్చోబెట్టేవారు. విపరీతమైన ఆకలి, ఊపిరి ఆడకపోవటంతో చాలా మంది చనిపోయారు. 1945లో బ్రిటిష్ వాళ్ళు అందర్నీ వదిలేశారు. అంతకు ముందే కాంప్‌లో తల్లి చనిపోయింది. వీళ్ళిద్దరూ అంటే అన్నే ఫ్రాంక్, సోదరి టైఫాయిడ్‌తో పోషకాహారం లేకపోవటం వల్ల చనిపోయారు. 16వ ఏడు రాకుండానే అన్నే ఫ్రాంక్ 1945 marchలో మరణించింది. తండ్రి ఇంటికి తిరిగి వచ్చిన తర్వాత అన్నే రాసిన డైరీ దొరికింది. దానిని ఆయన 1947లో కొద్దిగా మార్చి ప్రింట్ చేస్తే 25 మిలియన్లు అమ్ముడయ్యాయి. ఎందరో నాజీ నిర్భందాన్ని గురించి వారు చేసిన దారుణాలను గురించి డైరీలు రాసిన అన్నే ఫ్రాంక్ డైరీకున్న ప్రాధాన్యత దేనికీ రాలేదు. దాదాపు అరవై భాషల్లోకి అనువాదం పొందింది. బైబిల్ తర్వాత అన్నే డైరీకి అంత గిరాకీ వచ్చింది. దక్షిణాఫ్రికా స్వాతంత్ర ఉద్యమ నేత, అధ్యక్షుడు నెల్సన్ మండేలా జైలులో ఉండగా అన్నే ఫ్రాంక్ డైరీని తానూ చదివినానని ఎంతో ప్రభావితం చేసిందని తోటి ఖైదీలకు కూడా చదివి వినిపించానని రాశాడు.

ఈ డైరీకి ప్రెసిడెంట్ రూస్ వెల్ట్ భార్య ముందుమాట రాసింది. ఫ్రాంక్ తండ్రి 81వ ఏట 1980లో చనిపోయాడు. అన్నే పేర ఒక ట్రస్ట్ ఏర్పడింది. దాని ద్వారా ఎన్నో ప్రజోపకారమైన పనులు చేస్తున్నారు. ఆమె ఇంటిని స్మృతి చిహ్నంగా మార్చారు. ప్రతి ఏటా కనీసం ఆరు లక్షల మంది దాన్ని సందర్శిస్తారు. అన్నే డైరీని నాటకంగా కూడా మలచి ఆడుతున్నారు. దీనికి పులిట్జర్ బహుమతి వచ్చింది.

1944 ఏప్రిల్‌లో చివరి ఎంట్రిగా అన్నే "I want to live on after my death" అని రాసుకొంది. ఈ మాటలే అందరికి మంత్రాలైనాయి. గొప్ప స్ఫూర్తి కలిగించాయి.

స్కూళ్ళల్లో పాఠంగా పెట్టి బోధిస్తున్నారు. అందుకే అన్నే "Has become a martyr rather than a victim" అయింది. ఆమె ఇంకా యవ్వనంలోకి ప్రవేశించక ముందే జీవితం నుండి నిష్క్రమించాల్సి వచ్చింది. ఆమె డైరీని "Comforting document" భావిస్తారు. బాధోపశమన కారిణి అన్న మాట. ఆమె డైరీ చదివితే "Even in the midst of historyís worst depredations, the human spirit is not quilled, goodness and beauty endure" అని నిరూపించిందనిపిస్తుంది విశ్లేషకాభిప్రాయం. అది ఆమె స్వంతమే అయినా దాని ప్రభావం అంతటిది. అందుకే అన్నే ఫ్రాంక్ డైరీని "A record of triumphant defeats. Anne found her strength in her love of the very world which was denied her" అనిపిస్తుంది మనకు.

తానూ లక్షలాది మంది చావును విన్నదీ, కన్నదీ. తానూ స్వర్గానికి వెడితే క్రూరత్వం కూడా ఆగిపోతుంది అన్నది. ఇంత కష్టంలోను ప్రజలు నిజంగా మంచి మనసున్న వారేనని అంటుంది. చివరగా "I can not build up my hopes on a foundation of confusion misery and death" అని ఎంతో ధైర్యంగా నవ్వుతూ నాజీలకు బలి అయిపోయిందా అమాయకపు పిల్ల. అన్నే ఒక తేజో రూపం. ఒక ఆరాధ్య దేవత అయింది. ❁



## 45. మెక్సికో మహిళా మణిదీపం - రోసారియా కాస్టలనాస్

**ఆ**మె పుట్టిన కుటుంబం బాలిక బతికుండటానికి ఇష్టపడదు. ఇంక చదువేం చెప్పిస్తారు? అలాంటి కుటుంబంలో పుట్టి ఉన్నత శిఖరాలనందుకొన్న మెక్సికో మహిళా మణిదీపం రోసారియా కాస్టలనాస్ గురించే ఇప్పుడు మనం తెలుసుకొంటున్నాం.

రోసారియా కాస్టలనాస్ లాటిన్ అమెరికా దేశమైన మెక్సికోలో కొమిటాన్ దగ్గరున్న చియాపాస్‌లో ఒక పెద్ద సంపన్న కుటుంబంలో ఫామిలీ రాంచ్‌లో 25-5-1925న జన్మించింది. ఆ కుటుంబంలో ఆడవాళ్ళను గడప దాటనివ్వరు. ఆడపిల్లకు చదువు చెప్పించటమే ఉండదు. 1933లో ఆ యింటి స్నేహితురాలు దెయ్యాలూ, భూతాలూ వదిలించే ఒకావిడ వాళ్ళ ఇంట్లో త్వరలో చిన్నపిల్లలెవరో చనిపోతారని తల్లికి జోస్యం చెప్పింది.

రోసారియాకు ఒక తమ్ముడున్నాడు. తమ్ముడు చనిపోతే బాగుండు అని అక్క రోసారియా భావించింది. ఈ అమ్మాయి చస్తే బాగుండునని, పీడా విడగడైపోతుందని తలిదండ్రులు గట్టిగా అనుకొన్నారు. చివరికి తమ్ముడే చనిపోయి రోసారియానే బతికింది. అప్పటి నుంచీ ఇంట్లో ఆమె ఒంటరిగా, సిగ్గుగా, బిడియంతో అసూర్యంపశ్యగా గారాబంగా పెరిగింది.

అప్పటి మెక్సికో ప్రెసిడెంట్ లిజారో కార్డినాస్ భూసంస్కరణల చట్టం చేశాడు. దాని ప్రకారం రోసారియా కుటుంబానికి ఉన్న చాలా మిగులు భూమిని ప్రభుత్వం స్వాధీన పరచుకొంది. దీనిని అక్కడి "నేటివ్ ఇండియన్స్"కు ప్రభుత్వం పంచింది. చేసేది లేక రోసారియా కుటుంబం ఆమె పదిహేనవ ఏట మెక్సికో సిటికి తరలి వెళ్ళింది. కుటుంబం దారుణమైన ఆర్థిక బాధలను అనుభవించింది. మెక్సికో చేరిన ఏడాదికే ఆమె తల్లీ తండ్రీ

చనిపోవటంతో ఆమె జీవితం నడి సంద్రాన నావ అయింది. గారాలపట్టిగా గడిపిన రోసారియా స్వంత కాళ్ళమీద నిలబడి జీవించాల్సిన దుస్తితి ఆ చిన్న వయసులో ఏర్పడింది.

ధైర్యం కూడాగట్టుకొని చదవటం ప్రారంభించింది. బాగా చదివి 1950లో డిగ్రీ సాధించింది. స్పెయిన్‌లో చదువుకోవటానికి ప్రభుత్వం నుండి అనుమతి పొందింది. యూరప్ అంతా పర్యటించింది. తర్వాత "నేషనల్ అటానమస్ యూనివర్సిటి ఆఫ్ మెక్సికో - (UNAM)"లో చేరి ఫిలాసఫీ, లిటరేచర్ సబ్జెక్టులను చదివింది. మెక్సికోలోను సెంట్రల్ అమెరికాలోను ఉన్న మేధావులతో పరిచయం పెంచుకొంది. ఇది ఆమె జీవితానికి బాగా ఉపయోగపడింది. మంచి రచనలూ చేయటం ప్రారంభించింది. "the three knots in the net" అనే నవలలో ఆమె తన కుటుంబ చరిత్ర అంతా చెప్పుకొంది. యూనివర్సిటిలో ఫిలాసఫి ప్రొఫెసర్‌గా పని చేస్తున్న "రికార్డో గువేరా"ను పెళ్ళి చేసుకొంది. కాని అభిప్రాయ బేధాలేర్పడి 1971లో విడాకులు తీసుకొన్నది. ఆమె చదివిన యూనివర్సిటిలోనే లెక్చరర్‌గా చేరి పనిచేసింది. 1966లో "కంపారటివ్ లిటరేచర్"కు ప్రొఫెసర్‌గా పదోన్నతి సాధించింది. తరువాత విజిటింగ్ ప్రొఫెసర్ అయింది.

చిన్న పిల్లల కోసం రోసారియా చాలా కథలు రాసింది. అంతేకాదు "నేషనల్ ఇండీజినస్ స్కూల్"లో చేరి పేదలు, అతి నిర్భాగ్యులు, చదువు అంటే ఏమిటో తెలియని అభాగ్యులున్న మురికివాడలలో తాను రాసిన "పపెట్ షో"లను ప్రదర్శించి వారిలో విద్యపట్ల మక్కువ కలిగించింది. ఈ సంస్థను తమ కుటుంబపు భూమిని ప్రభుత్వపరం చేసిన ప్రెసిడెంట్ కార్డినాస్ స్థాపించిందే. "ఎక్సేల్సర్" అనే వార్తా పత్రికకు వీక్లీ కాలమ్స్ రాసింది. "One must laugh, then, since laughter, as we know is the first manifestation of freedom" అని రోసారియా కాస్టలనాస్ నవ్వుకు గొప్ప అర్ధాన్ని చెప్పింది. ఈమె కేథలిక్ మతాన్ని అలవంబించింది.

1971లో "ఫామిలి ఆల్బం" నవల రాసింది. 1971 సంవత్సరం ఆమె సమర్ధతను గుర్తించిన మెక్సికో ప్రభుత్వం ఇస్రాయిల్‌కు రాయబారిగా నియమించి గొప్ప గౌరవాన్ని కల్పించింది. ఇది మెక్సికో ప్రభుత్వం ఒక మహిళకు అందజేసిన అరుదైన, అసాధారణమైన, అత్యున్నత స్థాయి గౌరవం. రోసారియా నిజంగానే తన స్వశక్తితో, సమర్ధతతో ఉన్నత శిఖరాలను అధిరోహించింది. ఆమె మామూలు రాయబారి మాత్రమే కాదు. విదుషీమణి కనుక సాంస్కృతిక రాయబారి అయిందని భావించవచ్చు. కాని ఇదే ఆమె పాలిటి శాపం అవటం దురదృష్టకరం. 49 ఏళ్ళ వయసులో ఇస్రాయిల్ రాజధాని "టెల్ అవైవ్"లో తన ఇంట్లో ఎలెక్ట్రిక్ లాంప్‌ను అమరుస్తూ షాక్ కొట్టి 7-8-1974న మరణించటం సాహిత్యాభిమానుల్నే కాదు రాజకీయ నాయకులను తీవ్ర విషాదంలో ముంచేసింది. మన తెలుగు నవలా రచయిత్రి శ్రీమతి మాదిరెడ్డి

సులోచనా రాణి స్వంత ఇంట్లో గాస్ స్టవ్ వెలిగిస్తూ మరణించిన విషయం మనకు గుర్తుకు వస్తుంది. ఇద్దరూ విధి వంచితలే.

రోసారియా కవిత్వం, కథలు, నవలలు, పెద్ద నాటకం రాసింది. ఆమె రాసిన "బాలన్ కానన్" నవల ఆమె పాక్షిక స్వీయ జీవిత చరిత్రే. ఆమె రచించిన "ది బుక్ ఆఫ్ లామేన్‌టేషన్" 19వ శతాబ్దంలో జరిగిన యదార్ధ సంఘటనలకు దర్పణం. "నైన్ గార్డియన్స్" నవల, "లామేన్ టేషన్" రెండూ అనేక భాషల్లోకి అనువాదం పొందాయి. సృజనాత్మక రచనలకు రోసారియా పేరెన్నిక గన్నది. రోసారియాను ప్రభావితం చేసిన ఇద్దరు మహిళా ఉత్తేజిత కార్యకర్తలున్నారు. ఒకరు పదహారవ శతాబ్దానికి చెందిన మత కార్యకర్త "సెయింట్ తీసా ఆఫ్ అవిల" రెండవ ఆమె పదిహేడవ శతాబ్దికి చెందిన మెక్సికన్ నన్, మరియు కవయిత్రి అయిన "సార్జువోనా ఇనెస్ డీ లాక్రాజ్". అంతే కాదు సాంఘిక దురన్యాయం మహిళా వివక్షతలపై తీవ్ర పోరాటమూ చేసింది రోసారియా.

రోసారియా వచన రచనలు బాగా ప్రసిద్ధి చెందాయి. కాని ఆమె కవిత్వం చాలా శక్తివంతమైనదే కాదు, ఆమె సమకాలీనుడైన 1990లో సాహిత్యంలో నోబెల్ బహుమతి పొందిన "ఆక్టేవియా పాజ్" కవిత్వంతో, సృజనాత్మక శక్తితో తులతూగతుందని విశ్లేషకులు భావిస్తారు. మెక్సికన్ రివల్యూషన్‌కు పాటుబడుతున్న అభాగ్యులైన నేటివ్ ఇండియన్స్‌కు తాను పుట్టి పెరిగిన "చియాపాస్"లో ప్రభుత్వం స్వాధీనపరచుకొన్నది పోను మిగిలి ఉన్న భూమిని రాసిచ్చేసిన మెక్సికో మహిళా మణిపూస రోసారియా కాస్టలనాస్. ❀

**(విహంగ మహిళా వెబ్ మాసపత్రికలో ప్రచురితం)**



# 46. బాధితుల బాధలను స్వీకరించి అనుభవించిన యోగిని - తెరేస్సి న్యూమన్

**మ**నకు ఏ కష్టమో, బాధో, రోగమో వస్తే మహానుభావులనో, యోగులనో దర్శించి ఇంత విభూతి లేక పవిత్ర జలం, మంత్రం వంటివి పొంది ఉపశమనం పొందటం లోకంలో చూస్తున్న విషయమే. కాని రోగగ్రస్తుల రోగాలను తాను పొంది ఆ బాధలను స్వయంగా అనుభవించి, వారికి ఉపశమనం కల్గించటం మహాయోగులైన కొందరికే సాధ్యం. అలాంటి అరుదైన యోగిని జర్మనికి చెందిన తెరేసి న్యూమన్.

జర్మనిలోని బవేరియాలో కొనిస్గేర్ స్యూద్ అనే గ్రామంలో తెరేసి న్యూమన్ 1898 ఏప్రిల్ ఎనిమిదిన జన్మించింది. ఆమె కేథలిక్ మతావలంబి. జీవితాంతం పుట్టిన ఊరిలోనే గడిపింది. "థర్డ్ ఆర్డర్ ఆఫ్ సెయింట్ ఫ్రాన్సిస్"లో సభ్యురాలు. పేద కుటుంబం. తండ్రికి అధిక సంతానం. 1918లో మార్చ్ పదవ తేదీన ఆమె మేనమామ ఇంట వంట పొయ్యి వెలిగిస్తూ ఒక బల్లమీద నుంచి కిందపడి పాక్షిక పక్షవాతానికి గురైంది. ఇంకోసారి ఇలాంటి ప్రమాదమే జరిగి కంటి చూపు కూడా మందగించింది. చాలాకాలం మంచంమీదే ఉండటం వల్ల ఆమె శరీరానికి పుళ్లు ఏర్పడి ఎముకలు బయటికి వచ్చి ఎంతో నరకం అనుభవించింది. ఇదంతా ఆమె ఇరవై ఏళ్ళ వయసులోనే జరిగింది. 1919కి పూర్తిగా గుడ్డిది అయిపోయింది పాపం. కానీ 1923 ఏప్రిల్ 29న నాలుగేళ్ళకు రోమ్ నగరంలో తెరేసి లూసేక్స్‌కు బ్యీటిఫికేషన్ మత దీక్ష ఇస్తున్నప్పుడు న్యూమన్‌కు అకస్మాత్తుగా చూపు వచ్చేసి అందరికి ఆశ్చర్యం కలిగించింది. 1925లో లూసేక్స్‌ను రోమన్ కేథలిక్ చర్చికి "సెయింట్"గా ప్రకటించారు. ఆయన దయవల్లనే తన కంటిచూపు రావటం "బెడ్ సోర్స్" నయమవటం జరిగిందని తెరెసి చెప్పుకొంది. ఆమెకు హీబ్రు, గ్రీక్, లాటిన్ భాషలు తెలుసు.

1925 నవంబర్ ఏడున న్యూమాన్‌కు "అపెండి సైటిస్" వచ్చి మళ్ళీ మంచం ఎక్కాల్సిన పరిస్థితి కలిగింది. ఆమెకు ఆపరేషన్ చేయించాలని కుటుంబ సభ్యులు ప్రయత్నిస్తుండగా వద్దని గట్టిగా అరచి తనను వెంటనే చర్చికి తీసుకు వెళ్ళమని కోరింది. అక్కడ ప్రార్థన చేయగానే అపెండి సైటిస్ మాయమయిందని ప్రకటించింది. 1926 మార్చ్ అయిదు శుక్రవారం ఆమెకు గుండెపైన ఒక చిన్న పుండు ఏర్పడినట్లు అందులో యేసు క్రీస్తు, ఆయన శిష్యులు కన్పించినట్లు తెలియజేసింది. మార్చ్ పన్నెండున మళ్ళీ క్రీస్తు మౌంట్ ఆలివేట్‌పై దర్శనమిచ్చినట్లు చెప్పింది. "క్రూసిఫికేషన్" కూడా ఆమెకు కనపడింది. ఇలా చాలాసార్లు ఆమె క్రీస్తును దర్శించిన అనుభూతి పొందింది. ఈస్టర్ ఆదివారం నాడు క్రీస్తు పునరుత్థానాన్ని చూసింది. దీనివల్ల ఆమెలో దైవీ శక్తులు చేరాయని అనుభూతి పొందింది. ఆమెలో వింత కాంతి వ్యక్తమైంది. కొందరు ఇవన్నీ "హిస్టీరియా" లక్షణాలని, "మల్టిపుల్ పెర్సనాలిటి డిసార్డర్ (M.P.D.)" అనీ అనుకొన్నారు. ఆమె ఎన్నో మహిమలను ప్రదర్శించి అందర్నీ ఆశ్చర్యపరచింది.

1922 నుండి 1942లో చనిపోయేంత వరకు తెరేసి "పవిత్ర యూకారిస్ట్" తప్ప ఏ విధమైన ఆహారం తిననే లేదు. అంటే నలభై ఏళ్ళు నిరాహారంగా ఉందన్న మాట. 1926 నుండి మరణించేదాకా అసలు మంచినీళ్ళు కూడా తాగకుండా గడిపింది ఆ మహాత్మురాలు. ఏమీ తిననప్పుడు శరీరం శుష్కించి, బొమికల పోగుగా ఉండాలి కదా. కాని ఆమెకు వయసు మీద పడుతున్న కొద్దీ బరువు పెరుగుతోంది. ఇది మరీ విడ్డూరంగా అనిపించింది డాక్టర్లకు. 1927లో 121 పౌండ్ల బరువుంటే, 1935లో 140, 1950లో 200 పౌండ్లు ఉంది. 1953లో 215 పౌండ్ల బరువుంది. జీవన క్రియలన్నీ సక్రమంగా ఉన్నాయి. ఆమెకు ఈ బలాన్ని, ప్రాణశక్తిని యేసుక్రీస్తు ఇస్తున్నట్లుగా భావించేది.

1922లో ఆమెను చూడటానికి గొంతునొప్పితో బాధపడుతున్న యువకుడొకడు వచ్చాడు. అతని బాధ గమనించి తొమ్మిది రోజులు ప్రత్యేక ప్రార్థన చేసి అతని వ్యాధిని తాను పొంది అతని నొప్పిని పోగొట్టింది. అప్పుడే ఆ కుర్రాడు అక్కడే ఆమె సమక్షంలో మొదటి ప్రార్థన చేశాడు. ఇలా "ఆమె ఎవరికీ తెలియకుండా అనేక బాధలు పడేది. అవి ఇన్నీ అన్నీ అని, ఇన్ని రకాలని చెప్పలేము" అని ఆమె జీవిత చరిత్ర రాసినవారు అన్నారు. పేదల, రోగగ్రస్తుల, ప్రమాదాలలో మరణించే వారల, ఆత్మహత్యకు పాల్పడేవారల బాధలను తొలగించి వాటిని తనకు సంక్రమింపజేయమని ఆమె అనునిత్యం యేసుక్రీస్తును ప్రార్థించేది. అందుకే సాటి మానవుల కోసం అంత యమ యాతన అనుభవించేది. ఇది ఆమె నిత్యకృత్యం అయిపోయింది. ఆ జబ్బులను తానే స్వీకరించేది. వారిని విముక్తులను చేసేది. ఇదంతా తాను ఐచ్ఛికంగానే చేస్తున్నానని, ఏ ప్రతిఫలాపేక్ష తనకు లేదని తన ప్రభువుకు విన్నవించుకొనేది.

ఇతరులకు చెందిన ఇన్ని బాధలు అనుభవిస్తున్నా తెరేసి కాంతివంతమైన కన్నులతో, ఎంతో సంతోషంగా చిరునవ్వుతో చిన్నపిల్లలాగ అమాయకత్వంగా హాస్యప్రియంగా ఉండటం ప్రత్యేకత.

తెరేసి మహిమలను చూచే భక్తుల సంఖ్య మిలియన్లను దాటిపోతోంది. ఇందులో వందలాది డాక్టర్లు ఆమె కేస్‌ను అధ్యయనం చేయటానికి వచ్చేవారు. 1945లో నాజీ ప్రభుత్వ పతనం తర్వాత అమెరికా నుండి అనేక స్థాయిలలో ఉన్న వేలాది మంది వచ్చి చూసి వెళ్ళేవారు. ప్రపంచం నలుమూలల నుండి ఎంతోమంది ఉన్నతాధికారులు, సైనికులు, జర్మనికి వ్యతిరేకంగా పోరాడిన దేశాల ప్రతినిధులు తీర్థయాత్రలాగా వచ్చి ఆమెను సందర్శించి వెళ్ళేవారు. నాజీ దురాగతాలకు గురి అయిన వారందరికీ ఆమె ఆహారం, మందులు అందజేసేది. బాధితులు వస్తే ఓదార్చి ఉపశమనం కల్గించి పంపేది.

1945 ఏప్రిల్ 20న తెరేసి లేని సమయంలో నాజీ సైనిక సార్జంట్ ఆమె కుటుంబ బంధువులను చంపటానికి ఆమెను తమకు స్వాధీనం చేయమని అడగటానికి వచ్చాడు. కానీ అప్పటికే అమెరికా బాంబుల దాడిలో ఆమె ఆశ్రమం దెబ్బతింది. ఆమెకు ప్రాణాపాయం తప్పింది. కానీ ఆమె దయకు అంతులేదు. కమ్యూనిస్ట్ పాలనలో వున్న వారికి కూడా ఆహార పొట్లాలను, మందులను ఉదారంగా సరఫరా చేయించి మానవత్వాన్ని చాటుకొన్నది.

1926లో ఆమె తలపై కనిపించిన తొమ్మిది పుండ్లు ఆమె చనిపోయేవరకు అలానే ఉండిపోయాయి. పెరగనూ లేదు ఇన్‌ఫెక్షనూ రాలేదు. వాసన కూడా రాలేదు. అదీ విడ్డూరం. ఇవి యేసుక్రీస్తు తలపై ముళ్ళ వలన కలిగిన గాయాలుగా ఉన్నట్లు అందరూ భావించేవారు. అందుకే ఆమెను "స్టిగ్మటా" అంటే "పుండ్ల (మచ్చల) మనిషి" అన్నారు. ప్రతిక్షణం దైవీశక్తి, ప్రాణశక్తి ఆమెలో నిండి నిబిడీకృతమయ్యేవి. ఆమె నాలుకపై శక్తి పాతం ఉన్నది అని అందరు భావించేవారు. ఆమె మాటలు దైవీ శక్తిపూరితాలుగా ఉండి ఉపశమనం కల్గించేవి.

తెరేసి దైవప్రార్థనతో ఎక్కువ కాలం గడిపినా మిగిలిన సమయాలలో ఇంటి పని, పొలం పని, తోట పని చేసేది. బాధితుల ఉత్తరాలకు జవాబులు రాసేది. రాత్రిపూట స్థానిక చర్చిలో నేలను ఊడిచి శుభ్రం చేయటం, పూలను అలంకరించటం చేసేది. విరామం ఎరుగని కర్మయోగిగా జీవితం గడిపింది. వారంలో రెండు లేక మూడు గంటలు మాత్రమే నిద్రించేది. మిగతా కాలంలో క్రీస్తు ధ్యానంలో రోగుల బాధలను తాను పొంది వారికి ఊరట కల్గించేది.

ఇంతటి సార్థక జీవితాన్ని గడిపి పరోపకారంగా జీవించి, బాధితుల పాలిటి అపర దేవదూతగా నిలిచి, ఎందరికో మార్గదర్శనం చేసిన తెరేసి న్యూమన్ యోగిని 1962 సెప్టెంబర్ 18న 64ఏళ్ళ వయసులో దైవ దర్శనం పొంది సునాయాసంగా మరణించింది. ❋

**(విహంగ మహిళా వెబ్ మాసపత్రికలో ప్రచురితం)**



## 47. ప్రభావశాలి అమెరికా ప్రెసిడెంట్ లింకన్ తల్లి - నాన్సీ

**అ**మెరికా ప్రెసిడెంట్ అబ్రహాం లింకన్‌పై చిన్నతనంలోనే ప్రభావం చూపి మార్గదర్శకత్వం చేసింది అతని తల్లి నాన్సీ హాక్స్ లింకన్. ఆమె 1784 ఫిబ్రవరి 5న వర్జీనియాలో నోబుల్‌మాన్ అనిపించుకొన్న వ్యక్తి లూసీ హాంక్స్ కుమార్తె. హాంప్ షైర్ కౌంటిలో పుట్టింది. అమ్మమ్మ చాలా బీద తనంలో ఉన్నా గౌరవం సాధించుకొన్నది. సరిహద్దు ప్రాంతం కనుక పొలం పనులు, నేత చేతి పనులు తాతగారింట నేర్చింది. బైబిల్ బాగా చదివి బెర్రీ హోమ్‌లో "సీమ్ స్ట్రెస్"గా వివాహానికి ముందు వరకు పనిచేసింది. అమ్మమ్మ, తాతయ్యలనే అమ్మా, నాన్న అని పిలిచేది నాన్సీ. తన తల్లి తాతగాని గుణాలను వారసత్వంగా పొందిందని లింకనే చెప్పుకొన్నాడు. తనకు తల్లి లక్షణాలు సంక్రమించాయని కూడా అన్నాడు. 1806 జూన్ పన్నెండున థామస్ లింకన్‌తో నాన్సీ వివాహం జరిగి కెంటకికి కాపురానికి వెళ్ళింది.

నాన్సీ చాలా చురుకుగా, సూటిగా, వివేకంతో, తెలివితేటలతో ఆనాటి సమాజపు మిగిలిన స్త్రీలకంటే భిన్నంగా ఉండేది. ఇవన్నీ కొడుకు లింకన్ సాధించాలని ఆమె ఆరాటపడేది. ఆనాటి తన వయసు మహిళల సగలు ఎత్తుకన్నా నాన్సీ ఎత్తుగా ఉండేది. కాని చాలా బక్కపలచగా నూట ఇరవై పౌండ్ల శారీరక బరువుతో ఉండేది. ఆమెను చూసిన వారికి ఆమె క్షయ వ్యాధితో ఉన్నట్లు సహజంగా అనిపించేది. దీనికి తోడు ఎప్పుడూ దగ్గుతూ, ఊపిరి గట్టిగా పీలుస్తూ ఉండేది. ఇవి ఆ వ్యాధి లక్షణాలే. నల్లగా, గోధుమరంగు జుట్టుతో ఉండేది. పాలిపోయిన కళ్ళతో కనిపించేది. ప్రస్ఫుటమైన నుదురు, ముఖ కవళికలతో ఉండేది. వయసు వచ్చిన లింకన్ కూడా తల్లిలాగా కనిపించేవాడు.

నాన్సీ కెంటకిలో ఉన్న స్త్రీలందరిలో రెస్లింగ్‌లో అంటే మల్లయుద్ధంలో అద్వితీయ ప్రతిభ చూపేది. పందొమ్మిదో శతాబ్దపు తొలి భాగంలో కెంటకిలో రెస్లింగ్ పురుషులకే

ప్రత్యేకం కాదు. స్త్రీలు కూడా నేర్చుకొనేవారు. కెంటకీ మహిళా క్రీడాకారులలో నాన్సీ లింకన్‌ది ప్రముఖ స్థానం. పురుషులతోనూ మల్లయుద్ధం చేసి వారిని మట్టి కరపించే సామర్థ్యం ఆమెది. ఆమె చక్కగా పాడేది. ఎన్నో పాటలు ఆమెకు కంఠతావచ్చు. ఆమె జ్ఞాపకశక్తి అమోఘంగా ఉండేది. నిరంతరం పాటలు పాడుకొంటూ పనులు చేసుకొనేది. ఎక్కడో అడవిలో ఒంటరి కాబిన్‌లో జీవిస్తున్న ఆమెకు ఈ పాటలే ధైర్యం ఇచ్చి పిల్లల ఆలనా పాలనా చూడటానికి, వారిపై ప్రేమ కురిపించటానికి తోడ్పడేవి. ఈ జ్ఞాపకశక్తియే పిల్లలపై గొప్ప ప్రభావం చూపి వారికి మార్గదర్శకమైంది. అందుకే తల్లి అంటే లింకన్‌కు అంత అభిమానం ఏర్పడింది. ఆమె అమృతమయ ప్రేమకు అతను కరిగిపోయాడు. ఆమెపై ఆరాధనా భావం ఏర్పడి జీవితాంతం దాన్ని కాపాడుకొన్నాడు లింకన్.

నాన్సీ అద్భుతమైన తెలివితేటలతో, సరైన నిర్ణయాలతో, స్పష్టమైన తీర్పులతో డామినేటింగ్‌గా డేరింగ్ మహిళగా అందర్నీ ఆకట్టుకొనేది. లింకన్ తొమ్మిదేళ్ళ వయసులో ఆమె అతన్ని తీర్చిదిద్ది దేశానికి ఉపయోగపడే మహానాయకుడికి ఉండాల్సిన లక్షణాలన్నీ ఏర్పరచి స్పష్టమైన ఆలోచనా విధానాన్ని అలవాటు చేసుకొనేట్లు చేసిన ప్రభావశాలి. చాలా వేగంగా విని గ్రహించటం చదవటం, విన్నది ప్రతిదీ మెదడులో సుస్థిరంగా ఉంచుకోవటం ఆమె ప్రత్యేకత. ఆమెకు మంచి అంతర్ దృష్టి ఉండేది. అన్నీ విని నేర్చుకోవటమే కాని చదువు లేని కాలంలో జీవించిన మహిళ నాన్సీ.. బైబిల్‌లోని సుదీర్ఘ పేరాలన్నీ ఆమెకు వాచో విదేయాలైపోయాయి. షేక్స్పియర్ ఉపన్యాసాలు, ఈసప్ కథలు "బుక్ ఆఫ్ మార్టియర్స్"లోని ప్రొటెస్టెంట్ మతస్తులు నక్కల పాలైన ఉదంతాలు ఇవన్నీ కథలుగా ఆమె విన్నది. నిత్యం మననం చేసుకొనేది. "అమెరికా డిక్లరేషన్ ఆఫ్ ఇండిపెండెన్స్"లోని ముఖ్య భాగాలను, అమెరికా రాజ్యాంగంలోని ప్రముఖ భాగాలను నాన్సీ బట్టీపట్టి భద్రంగా మెదడులో దాచుకొంది. ఇవన్నీ తల్లి నోటి నుండి నిరంతరం వింటూ గ్రహించి, అవగాహన చేసుకొన్నాడు. వాటి ఆంతర్యాలను చిన్నతనంలోనే లింకన్ తెలుసుకోగలిగాడు. ఇదంతా తల్లి నాన్సీ ప్రభావమే. విస్తృత ప్రపంచాన్ని గురించి ఆమెకున్న మేధా పరిజ్ఞానం కొడుకు లింకన్‌కు ఎంతో సహకరించింది.

తల్లి ప్రభావంతో లింకన్ తనలోని మేధకు పదును పెట్టుకొని వ్యక్తిత్వాన్ని దిద్దుకొన్నాడు. ముందుగా చదువు అంటే ప్రేమ, ఆసక్తి అతనిలో కలిగించింది తల్లి నాన్సీయే. సరైన వయసు రాగానే బడికి వెళ్లి అతను చదువుకోవాలని హితవు చెప్పింది ఆమెయే. ఏడేళ్ళ వయసులో ఉన్న లింకన్ కెంటకీని వదిలి వెళ్ళేలోపు రెండు స్కూళ్ళలో చదువు నేర్చుకొన్నాడు. మొదటిది జకారియా రినే నడుపుతున్నది, రెండవది కాలేబ్ హాజల్ నడిపేది. అమెరికా విద్యాచరిత్రలో ఈ రెండు చిరస్థాయిగా నిలిచిపోయినవే.

1861లో లింకన్ కుటుంబం కెంటకీ నుండి ఇండియానాలోని స్పెంసర్ కౌంటికి చేరింది. అక్కడ కూడా నాన్సీ తన కొడుకు లింకన్‌ను వీలైనప్పుడల్లా పాఠశాలకు పంపించేది. ఆ స్కూల్ ఆజేల్ డార్సీ నడుపుతున్నది. లింకన్ ఫారంహౌస్‌కు మైలున్నర దూరంలో ఉంది. పదేళ్ళు వచ్చేదాకా వీలైనప్పుడల్లా లింకన్ అక్కడికి వెళ్లి విద్య నేర్చుకొనేవాడు. ఆ తర్వాత ఆండ్రూ క్రాఫోర్డ్ నడుపుతున్న స్కూల్‌లో చేరి పద్నాలుగో ఏడు వచ్చేదాకా చదివాడు. తర్వాత మాత్రం మిస్టర్ స్వానీ అనే మాష్టారి దగ్గర పదిహేడవ ఏడు వచ్చేదాకా చదివాడు. ఆనాటి బడులలో మేస్టర్లకు చదవటం, రాయటం, చిన్న చిన్న లెక్కలు అంటే రూల్ ఆఫ్ త్రీ (three r s) వస్తే చాలు మేస్టార్లు అయిపోయేవారు. లాటిన్ వచ్చినవాడు ఉంటే, ఆయన్ను మాంత్రికుడుగా ఆశ్చర్యంగా చూసేవారు. మాస్టర్లకు జీతాలు లేవు. పిల్లల తలిదండ్రులు పండిన ధాన్యాన్నో, జంతు చర్మాలనో, జంతువుల తొడల్నో, దుప్పి మాంసాన్నో కానుకగా ఇస్తే చాలు. లింకన్ నాలుగు మైళ్ళు నడిచి వెళ్లి చదువుకోవలసి వచ్చింది. ఈ వానాకాలం చదువు ఒక ఏడాది మాత్రమే సాగింది. తను చదువు నేర్చుకోలేదన్న బాధ నాన్సీకి ఉండేది. అందుకే తన కొడుకు గొప్ప విద్యావంతుడు కావాలని ఆశించేది. ఇలా అతన్ని చదివించటానికి భర్తతో రోజూ పోట్లాడవలసి వచ్చేది కూడా. లింకన్ తండ్రి థామస్ లింకన్ మొండివాడు. కొడుకు కండలు పెంచుకొంటే చాలు, బుద్ధి పెరగక్కరలేదనుకొనే రకం. ఎప్పుడూ చేతిలో పుస్తకంతో చెట్టుకింద కనిపించేవాడు కొడుకు. ఇలా ఉంటే కూలికి ఎవరూ పిలవరని, కుటుంబ పోషణ కష్టమని తండ్రి భావించేవాడు. పనికి వెళ్ళకపోతే కొట్టేవాడు. అతని కోపాన్ని భరించటం కష్టంగా ఉండేది. ఆ తర్వాత ఇరవయ్యొక్కటవ ఏడు వచ్చేదాకా ఏదో ఒక పని చేసి సంపాదించి ఆ డబ్బులతో కుటుంబ పోషణకు లింకన్ సాయపడేవాడు.

1818లో లింకన్ తల్లి నాన్సీ లింకన్ తొమ్మిదవ ఏట "మిల్క్ డిసీజ్"తో చనిపోయింది. జ్ఞానోదయం అయిన లింకన్ చదవటం, రాయటంపై శ్రద్ధ పెంచుకొన్నాడు. రాయటమూ అలవాటైంది. గోడల మీద, లాగ్ దుంగల మీదా బొగ్గుతో, చాక్‌పీస్‌తో రాసేవాడు. తల్లి సహచర్యం వల్ల మేధో పరిజ్ఞానం, విజ్ఞానంపై ప్రేమ, కవిత్వమూ అలవడ్డాయి. అతను పెరిగిన వాతావరణం అంతా గ్రామర్ అంటే ఏమిటో తెలియని క్రూరమైన గ్రామ్య భాష, తక్కువ స్థాయి మాండలికం మాట్లాడేవారి మధ్య కనుక తను మాట్లాడే భాషను సంస్కరించుకోవలసి వచ్చింది. డిక్షనరీ దగ్గరుంచుకొని ప్రతి మాటకు అర్థం, తాత్పర్యం గ్రహించేవాడు. ఉచ్చారణ విధానం అవగాహన చేసుకొన్నాడు. దీనితో భాషపై పట్టు సాధించాడు. సంస్కారవంతమైన భాషతో అవతలి వాడి హృదయాన్ని సూటిగా తాకే చెణుకులతో, చతురోక్తులతో మాట్లాడి సెహభాష్ అనిపించుకొని తల్లి ఋణం తీర్చుకొన్నాడు.

నాన్సీ అప్పుడప్పుడు డిప్రెషన్‌కు లోనయ్యేది. ఇదీ లింకన్‌పై ప్రభావం చూపింది.

విషాదం అతని ముఖంలో కనిపించేది. తల్లి మరణం, కొంత మంది కుటుంబ సభ్యుల మరణం లింకన్‌ను కుంగదీసింది. తల్లి మిల్క్ సిక్‌నెస్ వ్యాధితో మరణించిందని ముందే చెప్పుకొన్నాం. ఆ వ్యాధి ఇండియానాలో బాగా ఉండేది. పీజియన్ క్రీక్ నది పరిసర ప్రాంతాల్లో అంటే లింకన్ కుటుంబం నివసించిన ప్రాంతంలో విపరీతంగా వ్యాపించింది. వేలాది మంది మరణాలకు కారణమయింది. ఈ వ్యాధికి కారణం "వైట్ స్నేక్ రూట్"ను తిన్న ఆవుపాలు తాగటం వల్ల వచ్చేది అని తర్వాత పరిశోధనల్లో తేలింది. ఇది ఆవులో విషాన్ని తయారు చేసేది. అది పాలలో చేరేదన్న మాట. దీన్ని "రివర్ సిక్నెస్" అని, "ప్ల్యాకింగ్ ఫీవర్" అని ఆ కాలంలో పిలిచేవారు. ఈనాటి "Mad cow" వ్యాధి లాంటిది. ఈ వ్యాధి సోకితే ముందు నీరసం తర్వాత వణుకు, ఒళ్లంతా బాధ, ఒళ్లంతా తిమ్మిరి, వాపు వచ్చి డిప్రెషన్ ఏర్పడి వాంతులు వచ్చి పాలిపోయి క్షయగా మారి చర్మం చల్లబడి, తెల్లబడి నాడీ స్పందన క్రమంలో ఉండక నరక యాతన అనుభవిస్తూ కోమాలోకి వెళ్లి చనిపోతారు. ఈ వ్యాధితో వారం బాధపడి నాన్సీ చనిపోయింది. చనిపోయే ముందు కొడుకు లింకన్‌ను ప్రేమగా పిలిచి ఆప్యాయంగా నెమ్మదిగా "కుటుంబాన్ని ప్రేమించు. దైవాన్ని నమ్మి పూజించు" అని హితవు చెప్పి 1818 సెప్టెంబర్ అయిదున ముప్ఫై నాలుగవ ఏట మరణించింది. తల్లి శవపేటికను తయారు చేయటంలో లింకన్ తండ్రికి సాయపడ్డాడు. ఆమెను పయనీర్ సెమేటరిలో ఖననం చేశారు. అదే ఆ తర్వాత "నాన్సీ హాంక్స్ లింకన్ సెమెటరీ"గా పిలువబడింది.

తల్లి నాన్సీ చెప్పిన చివరి రెండు మాటలు లింకన్‌కు తారక మంత్రాలై జీవితంలో పాటించి తల్లి ఋణం తీర్చుకొన్నాడు. తల్లి మరణాన్ని నెలల తరబడి మర్చిపోలేకపోయాడు. తల్లి గురించి ఎప్పుడు మాట్లాడినా లింకన్ ఆరాధనా భావంతో మాట్లాడేవాడు. కుటుంబ బాధ్యతను తండ్రితో బాటు తీసుకొని తండ్రి మరణానంతరం కూడా ఆ బాధ్యతను సంతృప్తిగా నిర్వర్తించాడు. తండ్రికి బాసటగా లింకన్ పెద్ద అయ్యేదాకా అక్క సారా ఇంటి బాధ్యతలు నిర్వహించింది. మొదట్లో క్రైస్తవంపై నమ్మకం లేకపోయినా క్రమంగా పరమ గురువుల సాన్నిధ్యంలో గడిపి, ప్రభావవంతమైన గ్రంథాలను చదివి యేసుక్రీస్తును ఆరాధించి తన సమస్యలకు పరిష్కారాలను సాధించుకొన్నాడు. ❀

**(విహంగ మహిళా వెబ్ మాసపత్రికలో ప్రచురితం)**



## 48. పెరల్ ఎస్.బక్

ప్రఖ్యాత రచయిత్రి పెరల్ ఎస్ బక్‌ను సాధారణంగా అందరూ "పెరల్స్ బక్" అంటూంటారు. ఆమెపై చిన్ననాటి నుంచే నాకు అభిమానం ఉంది. ఆవిడా రాసియన్ "గుడ్ ఎర్త్", "ది మదర్" నవలలను ఇంటర్‌లోనే చదివాను. ఎంతో నేటివిటి ఉందనిపించింది. మట్టి మనిషిగా అనిపిస్తుంది. నేల విడిచి సాము చేయదు. చిన్నపిల్లలకు కూర్చోబెట్టి కథలు చెబుతున్నట్లు ఉంటుంది ఆమె రచన. అందుకే అందరికీ ఇష్టం. ఆమె జీవిత చరిత్రను పీటర్ కూన్ అనే రచయిత "ఏ కల్చరల్ బయోగ్రఫీ" అన్న పేరుతో గొప్పగా రాశాడు. అది చదివి ఎంతో ఆమెను గురించి తెలుసుకొన్నా. ఆ వివరాలే ఇప్పుడు అందిస్తున్నాను.

అమెరికాలో పుట్టిన బక్ ఎనభై ఏళ్ళు జీవించింది. ఇందులో సగం కాలం ఆమె చైనాలోనే గడిపింది. అందువల్ల అమెరికా వారికీ, చైనా వాళ్ళకూ కూడా ఆమె "విదేశీ" యే అయింది. చైనా పల్లెటూరి జీవితాన్ని నేపథ్యంగా ఆమె రాసిన నవలలు, కథలు ఆమె అనుభవానికి, అవగాహనా సామర్థ్యానికి నిలువెత్తు అద్దాలుగా కనిపిస్తాయి. మానవ విలువలపై ఆమెకు అమితమైన అభిమానం. కుటుంబ విలువల కోసం నిరంతరం పోరాడిన మహిళ బక్. నల్లజాతి ప్రజల హక్కుల పోరాటంలోను ముందు నిలిచింది. స్త్రీలకు పురుషులతో సమాన హక్కులు ఉండాలని ఎంతో శ్రమించింది. యుద్ధం వల్ల దెబ్బతిన్న దేశాలకు సహాయ సహకారాలందించింది. రెడ్‌క్రాస్ ద్వారా ఆమె అనేక సేవా కార్యక్రమాలను చేబట్టి పూర్తి చేసి అందరికి సంతృప్తి కల్గించింది. అమెరికా సైన్యం ఆసియా దేశాలలో చేసిన యుద్ధాలలో అక్కడి ఆడవాళ్ళతో పెంచుకొన్న సంబంధాల వల్ల పుట్టిన పిల్లలను "అమెరికన్స్" అని పేరుపెట్టి, వాళ్ళ జీవితాల కోసం, వికలాంగుల కోసం "వెల్ కం హోమ్" స్థాపించిన మానవీయురాలు.

మొదట్లో కమ్యూనిజాన్ని తిరస్కరించింది. చివర్లో మేకార్థీ ఇజంకు లోనైంది. జీవితకాలంలో సంపాదించిన సంపదను అంతటినీ రెండు ట్రస్ట్‌లకు రాసిచ్చేసిన త్యాగమూర్తి.

1938లో పెరల్స్ బక్‌కు సాహిత్యంలో నోబుల్ పురస్కారం లభించింది. ఆమెకు వచ్చిన 70,000 డాలర్ల బహుమతి డబ్బులో నలభై వేల డాలర్లతో ఒక స్కూల్‌కు సకల సదుపాయాలను కలుగజేసిన సాంఘిక సేవా పరాయణురాలు బక్. భారతదేశ స్వాతంత్రం కోసం బ్రిటిష్ ప్రధానిపై ఒత్తిడి తేవాల్సిందిగా ఆనాటి అమెరికా ప్రెసిడెంట్ రూజ్‌వెల్ట్‌పై తీవ్రమైన ఒత్తిడి తెచ్చిన స్వాతంత్ర్య ప్రియురాలు బక్. రెండుసార్లు వివాహం చేసుకొన్నది. ఆమె రచనల్లో తండ్రి మొండితనం, తల్లి అనారోగ్యం మనకు కనిపిస్తాయి. అమెరికా తీవ్ర ఆర్థిక సంక్షోభంలో చిక్కుకొని విలవిలలాడుతున్నప్పుడు కూడా పెరల్స్ బక్ పుస్తకాలు బాగా అమ్ముడయ్యాయి. అదీ ఆమె గొప్పతనం. ఆమె రాసిన కథకు ఆ రోజుల్లో కనీసం 1500 డాలర్లు పారితోషికంగా ఇచ్చేవారు. ఆమె రచనలు లక్షలాది కాపీలు అమ్ముడుపోయాయి. వాటిపై రాయల్టీ కూడా ఎక్కువ మొత్తంలో లభించేది. నోబుల్ ప్రైజ్ వచ్చిన ముగ్గురిలో ఈమె మూడవ అమెరికన్. మొదటిసారి సింక్లైర్ లూయీస్‌కు, రెండవసారి ప్రఖ్యాత నాటక రచయిత ఓనీల్‌కు వచ్చింది. మూడవవారు బక్. అప్పటికి అయిదుగురికి వస్తే ఈమె మొదటి మహిళగా నోబుల్‌ను అందుకొని అమెరికాకు కీర్తిని తెచ్చింది. మహిళా లోకానికి గుర్తింపు తీసుకొచ్చింది. అమెరికా చేసిన వియత్నాం యుద్ధాన్ని పూర్తిగా వ్యతిరేకించింది. భారతదేశంలో పర్యటించింది. భారత్‌లో ఉన్న బీదరికాన్ని, కుల పోరాటాలను పోగొట్టాలని సూచించింది. కొరియా యుద్ధానికి ఆమె వ్యతిరేకమే. ఆమె రచనలు 69 ఒకే సంవత్సరంలో ప్రపంచం మొత్తం మీద వివిధ భాషలలోని అనువదింపబడ్డాయి. ఎర్నెస్ట్ హెమింగ్‌వే అనే ప్రముఖ అమెరికా నవలాకారుని రచనలు 64. మరో ప్రసిద్ధ నవలా రచయిత స్టెయిన్ బెక్ రచనలు 48 మాత్రమే అనువదింపబడ్డాయి. ఇది ఆమెకు దక్కిన ప్రపంచ వ్యాప్త గౌరవం, అభిమానం, ఆదరణ. అందుకే బక్‌ను "Money machine" (ధన యంత్రం) అన్నారు. తన కార్యక్రమాలకు ఇన్‌ఛార్జ్‌గా "బెడ్" అనేవాడిని నియమిస్తే వాడు నమ్మకంగా "తెడ్డు" చూపించాడు. చివరికి కేసులు, విచారణలు, గొడవల్లో పడింది. అయినా వాడినే నమ్మింది. బక్ చనిపోయిన తర్వాత ఆమె కుటుంబ సభ్యులు కోర్టుకు వెడితే వారికి అయిదు నిమిషాల్లో వారి పక్షాన కోర్టు తీర్పునిచ్చి ఆమె ఆస్థి అన్యాక్రాంతం కాకుండా కాపాడింది.

"The Kennedy women" అనే పుస్తకాన్ని బక్ రాసింది. స్టాలిన్‌ను "రాక్షసుడు" (మాన్‌స్టర్) అంది నిర్భయంగా. సివిల్ లిబర్టీస్ కోసం పరితపించింది. ఆమె ఎప్పుడూ "be careful when you become famous" అని హితవు చెప్పేది. ఆమెను కథ చెప్పే దానిగా తప్ప ఆర్టిస్ట్‌గా గుర్తించలేదు కొందరు. రూజ్‌వెల్ట్ భార్య ఎల్నార్ "If we older

people have the courage that miss Buck has had. perhaps the next generation ill have the courage to make this country a real democracy" అని పెరల్స్ బక్‌ను మనసారా కొనియాడినది. ఆమె రాసిన "డ్రాగన్ సీడ్" నవల 1991లో మూడు లక్షల కాపీలు అమ్ముడయ్యాయి. దీన్ని ఎం.జి.ఎం సంస్థ సినిమాగా తీయటానికి ఒక లక్షా అయిదు వేల డాలర్లు ఈమెకు చెల్లించి రైట్స్ కొనుక్కున్నారు. ఏదైనా ఒక మంచి పనికోసం శ్రమించినప్పుడల్లా తన శక్తి పెరుగుతుందని బక్ అనేది. చాంకై షేక్ ప్రభుత్వ విధానాలను దుయ్యబట్టింది. సన్యట్ సేన్ మీద కొంత సానుభూతి చూపించింది.

పెరల్స్ బక్ "గ్లోబల్" విద్యకు నాంది పలికిన మహిళాతేజం. స్టాలిన్ దుశ్చర్యలను ఖండించి ముందు నిలిచింది. ఆమె రాసిన రెండు పుస్తకాలు "ది యాంగ్రీ వైఫ్", "హౌ ఇట్ హాపెన్స్"లు బాగా గుర్తింపు పొందాయి. న్యూయార్క్ నగరంలో 1960లో "గాంధి మెమోరియల్ లెక్చర్" ఇచ్చింది. కేన్నేడి అమెరికా ప్రెసిడెంట్ అయినప్పుడు ఈమెను సాదరంగా డిన్నర్‌కు ఆహ్వానించి రచయితలకు అగ్రస్థానాన్ని కల్పించాడు. 1963లో "ది లివింగ్ రీడ్" రాసింది. తనపై పెట్టిన కేసులు, ఎఫ్.బి ఎంక్వైరీ మొదలైన వాటిని చూసి 77వ పుట్టిన రోజునాడు "మానవత్వం కోసం చేసిన సేవకు అవమానం ఫలితమా?" "(for life time humanitarian service - humiliation is the reward)" అని వ్యధ చెందింది.

పెరల్స్ బక్ తన జీవిత చరిత్రను రెండు భాగాలుగా రాసుకొన్నది. 6-3-1973న మానవ సేవలో, సాహితీ సేవలో సార్ధక జీవితాన్ని గడిపిన పెరల్స్‌బక్ మరణించింది. ఆమెకు చార్లెస్ డికెన్స్ అన్నా ఆయన రచనలన్నా మహా ఇష్టం. పదేపదే వాటిని చదువుకొనేది. తన దగ్గర ఎప్పుడూ ఆయన పుస్తకాలను ఉంచుకొని స్ఫూర్తి పొందేది. చనిపోయే రోజున చివరిసారిగా డికెన్స్‌ను స్మరిస్తూ తన చుట్టూ డికెన్ రచనలన్నిటినీ పేర్పించుకొంది. సాహిత్య చరిత్రలో ఇలా చేసిన వారెవరూ లేరేమో?

ఆనాటి అమెరికా ప్రెసిడెంట్ నిక్సన్ ఆమెను లిటరరీ మెంటార్ అన్నాడు. నిక్సన్ బక్ సేవలను ప్రశంసిస్తూ "Pearl S. Buck is a bridge between the civilizations of East and West" అని కీర్తించాడు. ఆమె తన సమాధిపై తన పేరును ఇంగ్లీష్‌లో రాయించలేదు. సమాధి లోపల "Chine characters representing the name Pearl Synden sticker"ను చిత్రింపజేసి తనకు ఉన్న చైనా అభిమానాన్ని నిరూపించుకొంది. ఈ విధంగా ఆసియా అమెరికా సాహిత్య వారధి నిత్య జ్వలన జ్యోతి ఆరిపోయింది.

పెరల్స్ బక్ అమెరికాలోని వెస్ట్ వర్జీనియాలోని హిల్స్ బోరోలో "కెరొలిన స్తంట్లింగ్" ఆబ్సలాం, సిదెన్సికర్ దంపతులకు 1892 జూన్ 26న జన్మించింది. ప్రెస్బిటేరియన్ చర్చ్‌తో కుటుంబానికి సంబంధం ఉంది ఈమె పుట్టుక ముందే. తలిదండ్రుల వివాహం తర్వాత చైనా

వెళ్లి బక్ పుట్టుక కోసం అమెరికా వచ్చారు. మళ్ళీ బక్ మూడో నెలపిల్లగా ఉండగా చైనా వెళ్లిపోయారు. తాను రెండు ప్రపంచాలలో జీవించానని ఆమె చెప్పేది. ఒకటి ప్రెస్బిటేరియన్ ప్రపంచమైతే రెండోది చైనా జీవిత ప్రపంచం. పందొమ్మిదవ ఏట చైనా వదిలి అమెరికాలో వర్జీనియాలో ఉన్న రాండాల్ఫ్ మెకన్ వుమెన్ కాలేజిలో చేరింది. గ్రాడ్యుయేషన్ పూర్తి చేసి మళ్ళీ చైనా చేరింది. జాన్ లసింగ్ బక్ అనే వ్యవసాయ ఆర్థికవేత్తను పెళ్ళాడింది. దంపతులు యూనివర్సిటి ఆఫ్ నాంకింగ్‌లో గడిపారు. కరోల్ అనే కూతురు పుట్టింది. అమెరికా వెళ్లి మాస్టర్ డిగ్రీని కార్నెల్ వర్సిటి నుండి పొందింది భార్యాభర్తలు తిరిగి చైనా వచ్చారు.

1927లో చైనా ఒడిదుడుకులలో ఉంది. చాంగ్‌కై షేక్ ప్రభుత్వానికి కమ్యూనిస్టులకు తీవ్ర పోరాటాలు జరిగాయి. నాన్జింగ్‌లో ఉన్న వీరికి రక్షణ కరువైంది. జాతితో ఒక చైనా కుటుంబం వీరిని ఆదరించి ఇంట్లో ఉంచుకొంది. రచనలు చేయటం మొదలెట్టి ఆకర్షించింది. ఆమె నవల "ఈస్ట్ విండ్ వెస్ట్ విండ్"కు న్యూయార్క్ పబ్లిషర్లు ప్రోత్సహించారు. వదలకుండా రచయిత్రిగా ఉండమని సలహా ఇచ్చారు. నాన్జింగ్ ఇల్లు తగలెట్టారు. జపాన్ చేరారు. ఏడాది తరువాత మళ్ళీ చైనా వచ్చారు. ఇతాకాకు మారారు. బక్‌ను ప్రెస్బిటేరియన్ స్త్రీల సంఘంలో మాట్లాడమని ఆహ్వానిస్తే మాట్లాడి స్ఫూర్తినిచ్చింది. ఇది హార్పర్స్ మేగజైన్‌లో పబ్లిష్ అయింది. జాన్‌డే పబ్లిషర్ అయిన రిచార్డ్ వాల్ష్‌తో పరిచయం అయి పెళ్లిదాకా వెళ్ళింది. అప్పుడే గుడ్ ఎర్త్ నవల రాసింది. భర్తకు విడాకులిచ్చి వాల్ష్‌ను పెళ్లి చేసుకొంది. 1960లో వాల్ష్ మరణం దాకా పెన్సిల్వేనియాలో ఉన్నారు. కల్చరల్ రివల్యూషన్ కాలంలో చైనా పల్లె జీవితంపై రచనలు చేసింది. 1972 నిక్సన్‌తో చైనా వెళ్ళటానికి అనుమతి రాలేదు. బాధపడింది. లంగ్ కేన్సర్‌కు గురై పెరల్స్ బక్ 1973 మార్చ్ ఆరున 81 ఏళ్ళ వయసులో వెర్మాంట్‌లోని డాన్ బిలో చనిపోయింది. తన సమాధి నిర్మాణాన్ని తానే డిజైన్ చేసుకొంది. ❀



# 49. సఫల జీవి సేలేస్టీ

**చు**రుకైన యువతిగా సేలేస్టీకి మంచి పేరుంది. 1986లో స్కూల్ చదువు పూర్తి చేసి స్కాలర్‌షిప్‌ల సాయంతో కాలేజిలోకి అడుగు పెట్టటానికి సిద్ధంగా ఉంది. తల్లికి గారాబు కూతురుగా, చేదోడు వాదోడుగా తెలివైన విద్యార్థిగా ఆమె రుజువు చేసుకొంది. సమాజం కోసం ఏదో చేయాలనే తపన ఆమెలో ఉంది. ముఖ్యంగా రక్త సేకరణను ధ్యేయంగా ఆలోచించింది. కొన్ని నెలలలో ఆమె హెచ్.ఐ.వి. బాధితురాలిగా ఉన్నట్లు ఒక కాగితం పోస్ట్‌లో అందింది. ఒక్కసారిగా షాకయ్యింది సేలేస్టీ.

తనకు ఈ జబ్బు ఒక బాయ్‌ఫ్రెండ్ వల్ల వచ్చిందని ఆమె తెలుసుకొంది. ఇద్దరూ టీనేజర్స్. అతనితో చాలా సన్నిహితంగా మెలిగేది. ఇద్దరు టెస్ట్ చేయించుకొన్నారు. ధ్రువీకరించుకొన్నారు. ఆ రోజుల్లో ఆ జబ్బు సోకితే మరణమే. దీన్ని అధిగమించటం యెట్లా అని ఆలోచించారు ఇద్దరు. ఆమె కాలేజి మానేసింది. బాయ్‌ఫ్రెండ్‌కు రక్షించుకోవాలనే బలీయమైన కోరికతో అతడిని 1987 జూలై ఇరవై ఒకటిన పెళ్లి చేసుకొంది. దీనివల్ల తనకున్న "హెల్త్ ఇన్సూరెన్స్" అతనికి కూడా వర్తిస్తుందనే ముందుచూపు ఆమెది. దురదృష్టవశాత్తు ఆమె భర్త వెంటనే మరణించాడు. అప్పుడు సేలేస్టీ వయసు కేవలం 19 ఏళ్ళు మాత్రమే. సేలేస్టీ స్నేహితురాళ్ళతో సగం ఆమె నుండి ఈ జబ్బు కారణంగా ఆమెకు దూరమైపోయారు. కనీసం ఆమె స్నేహాన్ని కోల్పోతున్నామన్న బాధ కూడా వాళ్ళలో లేకపోవటం చూసి వ్యథ చెందింది. తన ఆశా సౌధం కూలిపోయిందని, దయనీయ పరిస్థితుల్లో తానున్నానని ఆమె చెప్పింది. ఇక తన చావు రోజుల్లోనే ఉందని నిశ్చయం చేసుకొంది. తనను గురించి ఆలోచించనేలేదు. కొన్నేళ్ళు ఇలా బాధ వ్యథలతో కుమిలిపోతూ ఉంది. తను తన కుటుంబం కోసం బతకటం లేదని, ఆ మహమ్మారి వ్యాధికి వ్యతిరేకంగా పోరాడుతూ జీవించానని

చెప్పుకొన్నది.

నాలుగేళ్ళు ఇలా ఎదిరించి, పోరాడి చివరికి తన జీవితంలో తప్పకుండా మార్పు రావాలని, వచ్చేట్లు చేసుకోవాలని నిర్ణయించుకొంది. ఆమె గాథ విన్న ఒక పెద్దాయన ఇచ్చిన సలహాతో మళ్ళీ చదువు ప్రారంభించింది. అంతేకాక ఎయిడ్స్ నిరోధం గురించి అన్ని సూచనలు పాటించింది. కొన్నేళ్ళు తను ఏ డాక్టర్ దగ్గరకూ వెళ్లలేదని తన జబ్బు గురించి ఏ డాక్టర్‌ని సంప్రదించలేదని ఎయిడ్స్ మందులు వేసుకోవటానికి తాను వ్యతిరేకినని అన్నదామె. డాక్టర్లన్నా, నర్సులన్నా వాళ్ళ చికిత్సా విధానమన్నా తనకు ఏహ్య భావం అని చెప్పింది. కాని 1994లో తన కౌంట్ 500కు పడిపోయింది. అప్పుడు డాక్టర్ ఆమెను ట్రీట్‌మెంట్ తీసుకోవాలని సలహా ఇస్తే, అయిష్టంగానే అంగీకరించింది. ఆ ట్రీట్‌మెంట్ చేయించుకొంది. అది మంచి ఫలితాన్నిచ్చి ఆమె జీవితంలో ఆశారేఖలు గోచరించాయి.

సేలేస్టీ ఆరోగ్యం నెమ్మదిగా బాగు పడింది. ఉద్యోగం చేయాలనే సంకల్పమూ కలిగింది. అవకాశమూ వచ్చింది. ఆమె "ఎడ్మినిస్ట్రేటివ్ అసిస్టంట్"గా ఉద్యోగంలో చేరి తనకున్న బుద్ధిబలంతో, కార్యదీక్షతో, సహనంతో, మంచి స్వభావంతో కొద్దికాలంలోనే అందరి మన్ననలను అందుకొంది. తొమ్మిదేళ్ళ క్రితం సేలేస్టీ "శాన్ ఫ్రాన్సిస్కో"లోని "ఎయిడ్స్ ఫౌండేషన్ సంస్థ"లో వాలంటీర్ ఆ పని చేయాలని అనుకోని వారికి తెలియజేసింది. ఆమెను ఆ సంస్థ సాదరంగా ఆహ్వానించింది. తను గడిపిన చీకటి రోజులు ఆమెకు గుర్తున్నాయి. అలా ఎవరూ ఉండకూడదని భావించి కార్యరంగంలోకి దిగింది. అప్పటి దాకా తానూ ఏ సంస్థలోను ఇమడలేకపోయానని, కాని ఈ సంస్థ తనకు ఆసరాగా నిలబడి తనలాంటి ఎయిడ్స్ బాధితులకు తనవంతు సహకారం అందించి వారి జీవితేచ్ఛను తీర్చటానికి తోడ్పడుతున్నందున తనకు ఎంతో సంతృప్తిగా ఉందని ఆనందంగా సేలేస్టీ చెప్పుకొంది. తనలాంటి హెచ్ఐవి బాధితులకు ఈ సంస్థ "సంజీవిని"లా ఉపయోగపడుతోందని తన ఆరోగ్యం బాగుపడటమే కాక ఎంతో మందికి పునరారోగ్యం ఇచ్చే ఈ సంస్థ తన మాతృ సంస్థ అని, ఆ సంస్థతో తన జీవితం పెనవేసుకొనిపోయిందని ఆ సంస్థే ఇప్పుడు తన కుటుంబం అని, తన సమాజం అని, తన సర్వస్వం అని గర్వంగా చెప్పింది. ఈ మధ్యనే సేలేస్టీ తన జీవిత రహస్యాలను బహిరంగ పరచటానికి ఒప్పుకొని అంతా చెప్పేసింది. తనలాగే ఈ వ్యాధి బాధితులైన మహిళలు సిగ్గుపడకుండా ముందుకు వచ్చి మార్గదర్శనం చేయాలని కోరింది.

"హెచ్.ఐ.వి. ఉందని తెలిశాక నాలాగా ఎవరూ దాచిపెట్టుకోకండి. ఇది దాచాల్సిన విషయం కాదు. పరీక్షలు చేయించుకొని పాజిటివ్ అని తేలితే చికిత్స ప్రారంభించండి. ఈ సంస్థ నన్ను భయపడకుండా చేసింది. జీవించటం నేర్పింది. మీరూ నాలాగానే లబ్ధి పొందండి" అని హితవు చెప్పింది. మూడు నెలలకోసారి డాక్టర్ దగ్గరకు వెళ్లి పరీక్ష చేయించుకొంటున్నది.

హెచ్.ఐ.వి. ట్రీట్‌మెంట్‌లో లేటెస్ట్‌గా వచ్చిన ఆర్టికల్స్ అన్నీ చదివి కొత్త మార్గాలను అధ్యయనం చేస్తోంది. హెచ్.ఐ.వి. బాధిత మహిళలతో, గ్రూపులతో మాట్లాడి వారికి ధైర్యాన్ని కల్గిస్తోంది.

అక్రమ ద్విలింగ సంపర్కం వల్ల సంక్రమించే ఈ వ్యాధి దాచుకోవటం ప్రమాదకరమని, దానివల్ల సమాజంలో అందర్నీ బాధితుల్ని చేస్తారని కనుక నిస్సంకోచంగా వ్యాధిని గురించి బహిరంగపరచి చికిత్స చేసుకోవాలని సేలేస్టీ అందరికి చెబుతోంది. మహిళలు ముఖ్యంగా తమ ఆరోగ్యం గురించి పట్టించుకోరని ఇతరుల ఆరోగ్యాన్ని గురించే ఆలోచిస్తారని ఈ విధానం మంచిది కాదని "ముందుగా నీ ఆరోగ్యం, నీ సెక్స్ హెల్త్ గురించి ఆలోచించు" అని ఆమె మహిళలకు ఇచ్చిన ముఖ్య సందేశం.

ఇప్పటికే సేలేస్టీ జీవితంలో సగం హెచ్.ఐ.వి.తోనే గడిచిపోయింది. ఇరవై ఆరేళ్ళ క్రితం ఈ వ్యాధిని గుర్తించి, జాగ్రత్తలు తీసుకొంటూ ఆమె జీవిస్తూ ఉండటం అందరికి గర్వకారణం. తాను పొందిన జాగృతిని మిగిలిన వ్యాధిగ్రస్తులకూ కలిగిస్తూ ప్రజలలో మమైకం అవుతూ సఫల జీవితాన్ని సేలేస్టీ గడుపుతూ మార్గదర్శిగా నిలుస్తోంది. ❀

**(విహంగ మహిళా వెబ్ మాసపత్రికలో ప్రచురితం)**



## 50. అమెరికా తొలి మహిళా డాక్టర్ – ఎలిజబెత్ బ్లాక్‌వెల్

1821 ఫిబ్రవరి మూడున ఎలిజబెత్ బ్లాక్‌వెల్ ఇంగ్లాండ్‌లోని బ్రిస్టల్‌లో సామ్యుల్ బ్లాక్ వెల్స్‌కి, హన్నాకు జన్మించింది. తండ్రి ఉదారుడూ రిఫైనరీ నడిపేవాడు. మత సంస్థలతో మంచి సంబంధాలున్నవాడు. తండ్రికి పిల్లల విద్యమీద అమిత శ్రద్ధ ఉండేది. అందుకు కావలసిన వసతులు కల్పించి ప్రోత్సహించాడు. దురదృష్టవశాత్తు ఆయిల్ రిఐనరి ఒడిదుడుకులతో నడిచి ఆర్థికంగా కుంగిపోయాడు. అప్పుడు కుటుంబంతో సహా 1832లో అమెరికాకు చేరాడు. అక్కడ కాంగ్రెస్ రిఫైనరి స్థాపించాడు. సామ్యుల్ హాక్స్ కాంగ్రిగేషన్‌లో చేరి మంచిపేరు తెచ్చుకొన్నాడు. సంస్కరణలంటే ఆయనకు మహా ఇష్టం. అమెరికాలోని బానిస వ్యతిరేక ఉద్యమంలో చురుకుగా పాల్గొన్నాడు. కుమార్తె ఎలిజబెత్‌పై ఆయన ప్రభావం పడి, ఆమె కూడా బానిస వ్యతిరేక ఉద్యమాలలో పాల్గొన్నది. దురదృష్టవశాత్తు రిఫైనరి 1836లో తగలబడింది. ఆర్థిక ఇబ్బందులేర్పడ్డాయి. నౌకర్లను తగ్గించేశాడు. ఇక అక్కడ ఉండలేక సిన్సినాటికి కుటుంబం మార్చాడు. అక్కడ నల్ల లేబర్ సమస్యలను ఎదుర్కోవటానికి బీట్‌రూట్‌తో పంచదార తీసే పద్ధతిపై ఆలోచించాడు. కాని కొద్ది రోజుల్లోనే భార్యనూ, తొమ్మిది మంది సంతానాన్నీ, తీర్చాల్సిన అప్పుల్నీ వదిలి తండ్రి తీవ్ర జ్వరంతో చనిపోయాడు.

కుటుంబ పోషణ భారం మీదపడటంతో ఎలిజబెత్ “సిన్సినాటి ఇంగ్లీష్ అండ్ ఫ్రెంచ్ అకాడెమి ఫర్ యంగ్ లేడీస్” అనే స్కూల్‌ను ప్రారంభించింది. అక్కడ అన్ని సబ్జెక్టులను బోధించే ఏర్పాటు, వసతి, ట్యూషన్లను కల్పించి వాటికి రుసుము తీసుకొనే ఏర్పాటు చేసింది. అదేమీ ఆదర్శం కోసం ఏర్పాటు చేసింది కాదు. ఆర్థికంగా ఆసరా ఇస్తుందని మాత్రమే. ఈ స్కూల్ బాధ్యతా, నిర్వహణ వల్ల స్లేవరిపై ఆలోచించి పనిచేసే సమయం దొరకలేదామెకు. దీనికి తోడు అక్కడి ప్రజల్లో బానిసల విముక్తి వ్యతిరేకత ఎక్కువవటమూ కారణమే. సోదరి ‘అన్నా’ ప్రభావం వల్ల ఈమె ఎపి స్కోపలనిజంలోకి మారింది. రెండేళ్ళలోనే ఆ చర్చ్ కార్యకలాపాలలో చురుగ్గా పాల్గొని అందరి దృష్టినీ ఆకర్షించింది. కాని చానెల్ అనే

యునిటేరియన్ మినిస్టర్ ద్వారా 'భావాతీత ధ్యానం'లోకి మారింది. దీనికి ఆగ్రహించిన చర్చ్ అధికారుల వల్ల ఎకాడెమి మూతపడింది. పిల్లలకు ట్యూషన్లు చెప్పి జీవితం కొనసాగించింది.

చానెల్‌గారి ప్రభావంతో సంస్కరణలు, విద్యా వ్యాసంగం పెరిగింది. ఎన్నో సమావేశాల్లో పాల్గొని, కథలు రాయటం కూడా మొదలుపెట్టింది. స్త్రీ విద్య, హక్కులు మహిళా సాధికారతపై దృష్టి నిలిపింది. అన్నా అండతో టీచర్ ఉద్యోగాన్ని పొంది ఏడాదికి నాలుగు వందల డాలర్ల జీతానికి పనిచేసింది. కాని స్కూల్‌లో విద్యార్ధులకు తగిన సౌకర్యాలు లేవు. హెడ్ మాస్టర్ చెప్పే సాధారణ జీవితం అంటే ఇది కాదని తెలుసుకొని మానేసింది. మళ్ళీ సిన్సినాటి చేరి వాస్తవ దృక్పథాన్ని అలవరచుకొంది. అప్పుడే ఆమెకు మొదటిసారిగా మెడిసిన్ చదవాలనే కోరిక కలిగింది. దీనికి కారణం అక్కడ స్నేహితురాలొకరు "యుటినరి కేన్సర్'తో చనిపోవటం ఆమెను కలచివేసింది. ఒక లేడీ డాక్టర్ ఉండి ఉంటే తన స్నేహితురాలు చనిపోయేది కాదు కదా అనిపించింది. అంతే ఇక దృష్టి అంతా మెడిసిన్ చదువుపైనే నిలిపింది. ఆరోజుల్లో "అబార్షనిస&ట్"అను "ఫిమేల్ ఫిజీషియన్స్" అనేవారు. ఆనాడున్న ఆనవాయితీల ప్రకారం మెడిసిన్ చేయటం అంత తేలిక కాదు. కాని ఆమె దృఢ నిశ్చయం ఆమెను ముందుకు నడిపించి మెడిసిన్ చదివించి డిగ్రీ సాధించేట్లు చేసింది.

కాని దీనికి మూడువేల డాలర్లు అవసరమైనాయి. అంత డబ్బు ఆమె దగ్గర లేదు. మళ్ళీ అన్నా సహాయంతో ఒక మ్యూజిక్ టీచర్‌గా నార్త్ కరోలినాలోని నాష్‌వెల్ స్కూల్‌లో చేరింది. అక్కడ మాజీ ఫిజిషియన్ అయిన క్లేర్జిమన్ డిక్సన్‌తో పరిచయమేర్పడింది. ఆయన తన మెడిసిన్ పుస్తకాలను, లైబ్రరీని వాడుకోవచ్చని పర్మిషన్ ఇచ్చాడు. దాన్ని సద్వినియోగం చేసుకొంటూ బానిస వ్యతిరేకోద్యమానికి సహకరించింది కాని ఆమె పనిచేసే స్కూల్ మూతపడింది. అప్పుడు డిక్సన్‌గారి సోదరుడు చార్లెస్టన్‌లో ఫిజిషియన్ అయిన హెన్రి డిక్సన్ సహాయంతో ఒక బోర్డింగ్ స్కూల్‌లో టీచర్‌గా చేరింది. ఫిలడెల్ఫియా చేరి జోనాథన్ అలెన్ అనే ఆయన దగ్గర ప్రైవేటుగా అనాటమీ చదివి ఫిలడెల్ఫియాలో మెడిసిన్‌లో చేరటానికి దారి ఏర్పరచుకొంది. అందరూ ఆమె ఆశలపై నీళ్ళు చల్లినవారే. ప్రోత్సహించినవారే లేకపోయారు. కొందరు ఫిజిషయన్లు ఆమెను పారిస్ వెళ్ళమని సలహా ఇచ్చారు.

ఇంతలో న్యూయార్క్‌లోని అప్ స్టెయిర్ మెడికల్ యూనివర్సిటిలో చేరమని ఆహ్వానం వచ్చింది. అక్కడ మగ స్టూడెంట్లు ఒప్పుకుంటేనే స్త్రీ విద్యార్ధి చేరగలదు. కాని విద్యార్ధులందరూ ఏకగ్రీవంగా ఆమెకు మద్దతిచ్చి చేర్చుకోటానికి అనుమతించారు. కాలేజీలో చేరింది కాని అంతా కొత్త. పుస్తకాలెక్కడ దొరుకుతాయో తెలీదు. ఎవరినైనా అడగాలంటే సిగ్గు. చేరిన కొద్ది రోజుల్లోనే ఆమె ప్రభావం మగ విద్యార్ధులపై పడి అల్లరి తగ్గింది. అప్పటివరకు మెడికల్ క్లాస్‌లోవారు గందరగోళమే సృష్టించేవారు. ఈమె రాకతో అందరూ నిశ్శబ్దంగా పాఠాలు

విన్నారు. అనాటమీ ప్రొఫెసర్ వెబ్ స్టార్ పునరుత్పత్తి పాఠం చెప్పబోతూ ఇలాంటివి సున్నిత మనస్కులైన ఆడపిల్లలు వినటం భావ్యం కాదని క్లాసులకు రావద్దన్నాడు కాని ఆమె క్లాసులకు వెళ్ళింది. అప్పటి వరకు చాలా అసహ్యంగా చెప్పే విషయాలను ఆమె ఉండటంతో హుందాగా బోధించటం ప్రారంభమైంది. దీనిని లెక్చరర్లు స్టూడెంట్లు అందరూ అభినందించారు. మొదట్లో జెనీవా ప్రజలు ఈమెను వింతగా చూసినా తర్వాత సర్దుకుపోయారు. ప్రేమ వ్యవహారాలకు దూరంగా ఉండేది. క్లినికల్ అనుభవం కావాలని అనుకొని దరఖాస్తు చేస్తే "బ్లాకీ ఆం హౌస్" అవకాశమిచ్చింది. రోగాలను గుర్తించటం తగిన చికిత్స చేయటం ద్వారా అభిమానం పొందింది. సిఫిలిస్ వ్యాధి దానికి కారణమైన టైఫస్‌పై ప్రత్యేక విషయంగా ఆమె జెనీవా మెడికల్ కాలేజి నుండి మెడికల్ డిగ్రీ పొంది తన లక్ష్యాన్ని సాధించింది. 'సాంఘిక నైతిక స్థిరత్వం – ఆరోగ్యం'పై థీసిస్ రాసి మెడికల్ కోర్సు విజయవంతంగా పూర్తిచేసి, 1848 జనవరి 23న మెడిసిన్‌లో డిగ్రీ పొందిన అమెరికా మొదటి మహిళగా గుర్తింపు పొందింది. డీన్ చార్లెస్ లీన్ అనే ఆయన బ్లాక్ వెల్‌కు డిగ్రీ ప్రదానం చేస్తున్నప్పుడు వంగి గౌరవ పురస్కారంగా అందజేసినట్లు పత్రికలన్నీ గొప్పగా ప్రచురించాయి.

యూరప్ వెళ్లి పై చదువులు చదవాలని ఎలిజబెత్ భావించింది. ఇంగ్లాండ్ వెళ్లి ప్రయత్నం చేసి అవకాశాలు లేక పారిస్ చేరింది. స్త్రీ అవటం వల్ల ఎక్కడా అవకాశం లభించలేదు. పాల్ డూబోస్ అనే ఆయన ఆమె అనుభవాన్నీ, అంకిత భావాన్నీ గుర్తించి గొప్ప డాక్టర్ అవుతుందని చెప్పాడు. మిడ్ వైఫ్‌గా పని చేయాల్సి వచ్చింది. ఒకసారి ఒక కంటిజబ్బు రోగికి చికిత్స చేస్తుంటే ఆ జబ్బు ఈమెకు అంటింది. దానితో ఎడమ కన్ను చూపు పోయింది. అందువల్ల సర్జన్ అవ్వాలనే కోరిక తీరలేదామెకు. నయం అయిన తర్వాత 1850లో లండన్‌లో సెయింట్ బెత్ లోం హాస్పిటల్‌లో ఎన్రోల్ అయింది. సెయింట్ పాగట్ బోధలు తరచూ వినేది. కాని ఆమెకు అమెరికా వెళ్లి ప్రజాసేవ చేయాలనిపించి 1851లో న్యూయార్క్ చేరి స్వయంగా ప్రాక్టీస్ మొదలుపెట్టింది. ప్రజా వయతిరేకత ఉన్నా న్యూయార్క్ టైమ్స్ పేపర్ ఆమెకు సపోర్ట్‌గా నిలిచింది. ఉపన్యాసాలిస్తూ "ది లాస్ ఆఫ్ లైఫ్ విత్ స్పెషల్ రిఫరెన్స్ టు ఫిజికల్ ఎడ్యుకేషన్ ఫర్ గర్ల్స్" అనే పుస్తకం రాసి ప్రచురించింది. టాంపిక్న్ స్క్వేర్‌లో చిన్న డిస్పెన్సరీ ప్రారంభించింది. డాక్టర్ మేరీ జాక్సా, సోదరి ఎమిలీ సాయంతో 1857లో దాన్ని విస్తరించి "న్యూయార్క్ ఇంఫర్మరి ఫర్ ఇండిజేంట్ వుమెన్ అండ్ చైల్డ్" నెలకొల్పింది. బోర&డ్ ఆఫ్ డైరెక్టర్స్‌గా స్త్రీలనే తీసుకొంది. ఇన్ అండ్ అవుట్ పేషెంట్‌లను అంగీకరించింది. ఒక్క ఏడాదిలోనే ఎంతో అభివృద్ధి చేసింది. చెల్లెలు ఎమిలీ కూడా డాక్టర్ డిగ్రీ పొందిన అమెరికా మూడవ మహిళా డాక్టర్ అయింది.

అమెరికా సివిల్ వార్‌లో బ్లాక్‌వెల్ క్షతగాత్రులకు సేవలందించింది. ఇది మగ

డాక్టర్లకు ఇష్టంలేదు. డోరోతి డిక్స్ సాయంతో నర్స్‌తో నర్స్ ట్రైనింగ్ ప్రారంభించింది. సంస్థ ఆర్థిక అభివృద్ధి కోసం ఇంగ్లాండ్‌కు చాలాసార్లు వెళ్లి వచ్చింది. బ్రిటన్‌లో ఈమెకు గుర్తింపు లభించి జెనరల్ మెడికల్ కౌన్సిల్ రిజిస్టర్‌లో 1859లో నమోదు అయింది. ఇలా నమోదైన తొలి మహిళా ఆమెయే. 1868లో ప్రారంభించింది. దానికి అనుబంధంగా లేబరేటరిని నెలకొల్పింది. ఈ కృషిలో నిమగ్నమై కూడా ఆమె సంస్కరణ భావాలను వదిలి పెట్టలేదు. ఆమె శిష్యురాలు మేరీ పుట్నం జాకోబి అందర్నీ ఎదిరించి వైద్య సేవలందిస్తోంది. స్త్రీలు సున్నితమైన మనస్కులు కనుక వైద్య సేవలో వారు బాగా రాణిస్తారని బ్లాక్‌వెల్ నమ్మింది. ఇంగ్లాండ్‌లో వైద్యసేవలు చేస్తూనే 1871లో "నేషనల్ హెల్త్ సొసైటీ" ఏర్పాటు చేసింది. యూరప్ అంతా తిరిగి స్త్రీ విద్యకు, మహిళా వైద్యానికి మద్దతు సంపాదించింది.

ఉద్యోగ విరమణ తర్వాత ఆమె జీవితాన్ని సాంఘిక, నైతిక విలువలకు, స్వచ్ఛమైన సెక్స్ వ్యాప్తికి అంకితమిచ్చినది. మహిళా హక్కుల కోసం, కుటుంబ నియంత్రణ కోసం కృషి చేసింది. రెండు యుటోపియన్ కమ్యూనిటీలకు విరాళాలు సేకరించి నిలబెట్టింది. జబ్బులు నైతికత్వం లేకపోవటం వల్లనే వ్యాప్తి చెందుతాయి కాని క్రిముల వల్ల కాదని దృఢంగా నమ్మింది. వేశ్యలకు లైసెన్స్ ఇవ్వటం, గర్భ నిరోధక మాత్రలకు వ్యతిరేకంగా పనిచేసింది. తలిదండ్రులు పిల్లల విషయమై తీసుకోవాల్సిన నైతిక బాధ్యతలపై ఒక పుస్తకం రాసింది.

సంఘంలో ఆదర్శ మహిళగా, సేవా భావంతో పనిచేసే మహిళా డాక్టర్‌గా ఆమె పేరు మారు మోగింది. జీవితం చివరి రోజుల్లో కూడా ఆమె కార్యక్రమాల చురుకుదనం ఏ మాత్రమూ తగ్గలేదు. 1895లో తన జీవిత చరిత్ర "పయనీర్ వర్క్ ఇన్ ఓపెనింగ్ ది మెడికల్ ప్రొఫెషన్ ఫర్ వుమెన్" పేర రాసుకొంది. ఎన్నో పర్యటనలలో కాలం గడిపింది. 1906లో అమెరికా వెళ్లి మోటార్ కార్ నడిపి సంచలనం సృష్టించింది. 1907 ఇంగ్లాండ్ వచ్చి మెట్లమీది నుంచి జారి శారీరక, మానసిక ఆరోగ్యం కోల్పోయింది. 1910 మే 31 90వ ఏట శాశ్వతంగా రోగార్తులకు దూరమైంది. అశేష ప్రజావాహిని ఆమె అంత్యక్రియలకు హాజరై నివాళులర్పించి కృతజ్ఞత తెలుపుకొన్నారు. ఎలిజబెత్ బ్లాక్‌వెల్ పేర అనేక బహుమతులందజేస్తున్నారు. ఎన్నో సంస్థలకు ఆమె పేరు పెట్టి గౌరవించారు.

అమెరికాలో మొదటి మహిళా డాక్టర్‌గా, ఇంగ్లాండ్‌లో రిజిస్టర్ అయిన మొదటి మహిళా డాక్టర్‌గా, సాంఘిక, నైతిక సంస్కరణలను ఇటు అమెరికాలోను అటు యూరప్‌లోను ప్రారంభించిన స్త్రీగా, అక్కడా, ఇక్కడా మహిళా మెడిసిన్ విద్యావ్యాప్తికి, స్త్రీ హక్కులకు, బానిసత్వ విమోచనానికి అంకితమై కృషి చేసిన ఎలిజబెత్ బ్లాక్‌వెల్ జీవితం మహిళా లోకానికి ఒక చారిత్రక సత్యం అయింది. ❀

**(విహంగ మహిళా వెబ్ మాసపత్రికలో ప్రచురితం)**

ఈ పుస్తకానికి ఆర్థిక సహకారం అందించిన దాతలు

**శ్రీ అండ్ శ్రీమతి మైనేని సత్యవతి, గోపాలకృష్ణ గార్లు**



శ్రీ మైనేని గోపాలకృష్ణ గారి పెద్ద కుమారులు

**శ్రీ అండ్ శ్రీమతి కృష్ణ కుటుంబం**



శ్రీ మైనేని గోపాలకృష్ణ గారి చిన్నకుమారులు

**శ్రీ అండ్ శ్రీమతి రవి కుటుంబం**

